# అవతారిక

మన్నుమదిళ్ తిరుమణ్డజ్గుడితాన్ వాழ
మార్గழிమాత క్కేట్టైనాళిల్ వన్దు
తున్ను పుకழ் త్తొణ్డరడిప్పొడియే ! నీ మున్
తుழாయ్మాలై ప్పణియడిమై శెయ్దు నాళుమ్
తెన్నరజ్గమణవాళఱ్కు అన్బుమిక్కు
చ్చెప్పియ నர்గ్రిరుమాలై నాఱ్పత్తైన్దుమ్
మన్నియ నர்గ్రిరుప్పళ్ళియెழுచ్చి పత్తుమ్
పழவడియేనుక్కరుళ్ శెయ్ పరిన్దు నీయే !

(స్థిరంగా చిరకాలం నిలచి ఉండే ప్రాకారాలను కల తిరుమణ్డజ్గుడి అనే దివ్యదేశం వర్ధిల్లేటట్లుగా ఆ క్షేత్రంలో మార్గశీర్షమాసంలోని జ్యేష్ఠానక్షత్రంలో అవతరించి, మిక్కిలి కీర్తిని కల్గిన ఓ తొాణ్డరడిప్పొడి ఆழ்వార్లా ! మీరు పూర్వం అందమైన శ్రీరంగనగరంలో వేంచేసి ఉండే శ్రీరంగనాథునకు అన్ని కాలాలలోను తులసీమాలికనుకూర్చి సమర్పించే కైంకర్యాన్ని చేసి, దానివల్ల ఆ స్వామిపై ప్రేమ అతిశయించి, భక్తిగా పరిణమించగా అనుగ్రహించిన గొప్పదైన తిరుమాలై అనే ప్రబంధంలోని నలభై అయిదు పాశురాలను, గొప్పగా శ్లాఘింపబడే తిరుప్పళ్ళి ఎழுచ్చిలోని పది పాశురాలను అనాదిగా నీకు దాసుడనైన నాకు ప్రేమతో అనుగ్రహించు)

(వేదాంతదేశికులు-ప్రబంధసారం-11)

యత్పాదరేణువహనేన సుగంధిమౌళిః
తం బ్రహ్మగంధ మధిగచ్ఛతి ముక్తి బంధః ।
తద్విష్ణుభక్తపదరేణుమునీంద్రభక్తం
కాంతోపయంతృముని మన్వహ మాశ్రయేహమ్ ॥

(ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్-వరవరమునిశతకమ్)

(ఏ తొాండరడిప్పొడి ఆழ்వార్ల శ్రీపాదరేణువును ధరించడంవల్ల మంచి సుగంధాన్ని కల్గిన శిరస్సును కల్గినవాడై, సంసారబంధంనుండి విడివడి బ్రహ్మసంబంధాన్ని పొందుతున్నాడో, ఆ ఆழ்వార్లపట్ల భక్తిని కల మణవాళ మహామునులను నేను ఆశ్రయిస్తున్నాను.)

కారేఱు కరుముకిల్ పోల్ కణ్వళరుమ్ అరజ్గేశన్
పారేఱు పుకళ్ పాడి త్తిరుప్పళ్ళియుణర్త్తు మొరు
పోరేఱ్ఱు త్తిరుమణ్డజ్గుడియిలుఱుమ్ఎతిరాశన్
శీరేఱు మణవాళచ్చీయరురై ఓదుమినే
(శ్రీ గుణవాళమామునికళ్ నూఱ్ఱన్దాది-18)

(కారెద్దువలె, నల్లని మేఘంవలె శయనించి ఉండే శ్రీరంగనాథుని ఈ భూలోకంలో వృద్ధిచెందే కల్యాణగుణాలను కీర్తించి, సుప్రభాతాన్ని పాడే అద్వితీయమైన పోటెద్దువంటి తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు అవతరించిన తిరుమణ్డజ్గుడిని ఆశ్రయించే భగవద్రామానుజులయొక్క సద్గుణాలను కీర్తించే మణవాళమహామునులు వ్యాఖ్యానాలను అభ్యసిస్తాము.)

ఆళ్వార్లు అందటిలోను విలక్షణమైన వ్యక్తిత్వాన్ని, నామాన్ని కల్గినవారు తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు. "అరజ్గనై క్కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే" అని పల్కిన తిరుప్పాణ్ ఆళ్వార్లు సైతం శ్రీవేంకటేశ్వరుని కీర్తించారు. కాని, ఆ పాతివ్రత్యాన్ని శ్రీరంగనాథునిపట్ల ఆచరించినవారు తొణ్డరడిప్పొడియాళ్వార్లు. మిగిలిన ఆళ్వార్ల తిరునామాలు వారు అవతరించిన చోటు, ఊరు మొదలైనవానిని పురస్కరించుకొని ఏర్పడ్డాయి. కాని, తొణ్డరడిప్పొడి అనే ఈ ఆళ్వార్ల నామం వారి భాగవతశేషత్వ వైభవాన్ని పురస్కరించుకొని వ్యవహరింపబడుతున్నది. ఇటువంటి ఈ ఆళ్వార్లు అనుగ్రహించిన ప్రబంధాలు రెండు. వాటిలో మొదటిది తిరుమాలై ప్రబంధం కాగా, రెండవది తిరుప్పళ్ళి ఎళుచ్చి. ఈ రెండు నాలాయిరంలో "ముదలాయిరమ్" అనబడే మొదటి సహస్రంలో కూర్పబడ్డాయి. ముందుగా ఈ ఆళ్వార్ల అవతారవైభవం క్లుప్తంగా నివేదింపబడుతున్నది.

## తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల వైభవం

కోదండే జ్యేష్ఠనక్షత్రే మణ్డజ్గుడిపురోద్భవమ్ ।
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణు మాశ్రయే ॥

(చోళదేశంలో "మణ్డజ్గుడి" అనే నగరంలో మార్గళి (మార్గశీర్ష) మాసంలో జ్యేష్ఠానక్షత్రంలో భగవానుని "వైజయంతి" అనే వనమాలయొక్క అంశగా అవతరించిన తొణ్డరడిప్పొడి యాళ్వార్లను ఆశ్రయిస్తున్నాను.)



చోళక్షితౌ ధనుషి మాసి మహేంద్రతారే
యః ప్రాదురాస మురజిద్వనమాలికాంశః ।
రంగేశకేళిసఖ మూర్ధ్వశిఖం ద్విజేంద్రం
భక్తాంఘ్రిరేణు మనఘాత్మగుణం ప్రపద్యే ॥

(చోళదేశంలో మార్గశీర్షమాసంలో ఇంద్రుని దేవతగా కల్గిన జ్యేష్ఠానక్షత్రంలో భగవానుని వనమాలయొక్క అంశగా శ్రీరంగనాథునకు ప్రియసఖులై, ఊర్ధ్వశిఖులై, బ్రాహ్మణశ్రేష్ఠులై, ఏ దోషం లేని ఆత్మగుణాలను కలవారై అవతరించిన తొణ్డరడిప్పొడి ఆళ్వార్లను శరణు వేడుతున్నాను)

దేహశ్రీశరదుత్తరే ప్రభవనామ్న్యబ్దే కలౌ భాస్కరే
చాపగ్రాహిణి భూమిసూనుదివసే జ్యేష్ఠాభిధే శ్రీమతి ।
ఋక్షే కృష్ణచతుర్దశీతిథియుతే భక్తాంఘ్రిరేణుస్సుధీః
రంగేశాంఘ్రిసరోరుహైకహృదయః ప్రాపావతారం భువి ॥

("దేహశ్రీ" అనే పదంచేత కటపయాదిసంఖ్యానుసారంగా నిర్దేశింపబడే 288 సంవత్సరాలు కలియుగంలో గడచిన తరువాత, ప్రభవనామసంవత్సరంలో, సూర్యుడు ధనూరాశిలో ఉండగా మంగళవారంనాడు జ్యేష్ఠానక్షత్రంలో కృష్ణచతుర్దశీతిథిలో శ్రీరంగనాథుని శ్రీచరణద్వయమే హృదయంలో కల్గిన తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు ఈ లోకంలో అవతరించారు)

తత్రోదభూద్భాగవతాత్ ద్విజేంద్రాత్
మాహేంద్రభే మాసి చ మార్గశీర్షే ।
శ్రీవిప్రనారాయణనామధేయో
మురారివక్షోవనమాలికాంశః ॥

(ఆ తిరుమణ్డజ్గుడి అనే క్షేత్రంలో మార్గశీర్షమాసంలో ఇంద్రదేవతాకమైన జ్యేష్ఠానక్షత్రంలో పరమభాగవతులైన ఒక బ్రాహ్మణశ్రేష్ఠులకు పుత్రులై, శ్రీరంగనాథునకు భక్తులై మురారి వక్షఃస్థలంలోని వనమాలికయొక్క అంశతో శ్రీవిప్రనారాయణులనే పేరుతో అవతరించారు.)

మన్నియశీర్ మార్గళియిల్ కేట్టై యిన్ఱు మానిలత్తీర్ !
ఎన్ ఇతనుక్కేఱ్ఱ మెనిల్ ఉరైక్కేన్- తున్ను పుకళ్

మామత్రైయోన్ తొణ్డరడిప్పొడి యాళ్వార్ పిఱప్పాల్
నాన్మత్రైయోర్ కొణ్డాడుమ్ నాళ్ (ఉపదేశరత్తినమాలై-11)

(విశాలమైన భూలోకంలోని జనులారా ! ఈనాడు స్థిరమైన వైభవాన్ని కల మార్గశీర్షమాసంలోని జ్యేష్ఠానక్షత్రం. దీనికి గల అతిశయం ఏమి ? అని అంటారా? వినండి చెబుతాను. పొందికగా ఉండే గొప్పతనాన్ని కల్గినవారు, గొప్ప వైదికులు అయిన తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల అవతారంచేత చతుర్వేదవిదులు కీర్తించే నక్షత్రం ఇది) అని,

"తొణ్డరడిప్పొడి యాళ్వార్ తోన్ఱియ వూర్ తొల్పుకళ్ శీర్
మణ్డఙ్గుడి యెన్బర్ మణ్ణులకిల్" (ఉపదేశరత్తినమాలై-31)

(తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు అవతరించిన ఊరు- అనాది అయిన కీర్తిని కల్గిన ఈభూమిలోని మణ్డఙ్గుడి అని అంటారు.)

పైన ప్రస్తావింప బడిన తనియన్‌లోను, వైభవశ్లోకాలలోను, పూర్వాచార్యులు అనుసంధించిన రీతిలో కలియుగం ప్రారంభమైన తరువాత, 289వ సంవత్సరమైన ప్రభవ వర్షంలో మార్గశీర్షమాసంలో జ్యేష్ఠానక్షత్రంలో కూడిన కృష్ణచతుర్దశిలో మంగళవారంనాడు చోళమండలంలోని దివ్యక్షేత్రాలలో ఒకటి అయిన పుళ్ళమ్ పూదఙ్గుడికి దగ్గరలో ఉండే తిరుమణ్డఙ్గుడి అనే ప్రాచీననగరంలో, భగవానుని వక్షఃస్థలాన్ని అలంకరించే వనమాలయొక్క అంశతో పూర్వశిఖాశ్రీవైష్ణవ కులంలో అవతరించారు - తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు. భగవానుని జాయమానకటాక్షంవల్ల చిన్న వయస్సునుండి పరమసాత్త్వికులై ఉండే వీరికి వేదవిద్వద్వరేణ్యులైన వీరి తండ్రి "విప్రనారాయణ" అనే పేరును పెట్టి, చౌలం, ఉపనయనం మొదలైన వైదిక సంస్కారాలను యుక్తవయస్సులో జరిపించి, వేదశాస్త్రాలను అభ్యసింప జేసినందున వీరు అన్ని శాస్త్రాలలో చిన్నతనంలోనే పాండిత్యాన్ని గడించారు. వీరు నైష్ఠిక బ్రహ్మచారియై జీవితాన్ని గడపాలని నిశ్చయించుకొని, శ్రీరంగనాథునకు కైంకర్యం చేయాలని తలచినవారై శ్రీరంగనగరానికి వచ్చారు. ఆదిశేషశయనంపై పడమటి వైపుకు శిరస్సును పెట్టుకొని, తూర్పుదిశలో శ్రీచరణాలను చాచి, ఉత్తర దిశలో వెనుక భాగాన్ని కలవాడై, దక్షిణ దిక్కులోని లంకను కటాక్షిస్తూ పరుండి ఉండే శ్రీరంగనాథుని గొప్ప భక్తితో వీరు సేవించగా, ఆ స్వామికూడా **"కుழలழకర్ వాయழకర్ కణ్ణழకర్"** (కేశసుందరుడు, అధరసుందరుడు, నేత్రసుందరుడు)



అని కీర్తింపబడే తన రూపసౌందర్యాన్ని అంతటిని దర్శింపజేసి, తనపట్ల సాటి లేని భక్తిని కలవారినిగా కటాక్షించాడు. శ్రీవిప్రనారాయణులు పుండరీకమహర్షివలె, శ్రీ కృష్ణావతారంలోని మాలాకారునివలె, సంపెంగ, మల్లె, తామర, ఇరువాట్చి మొదలైన పూలను కూర్చి పూమాలికలను కట్టి సమర్పించిన పెరియాళ్వార్లవలె, పుష్పమాలికా సమర్పణ కైంకర్యాన్ని చేయాలని భావించి, నందనవనాన్ని నిర్మించి, ప్రతిదినం పలువిధాలైన పూమాలికలను, తులసీమాలికలను కట్టి తీసికొనివచ్చి, శ్రీరంగనాథునకు సమర్పించేవారు.

ఈ విధంగా కొంతకాలం జరిగిన తరువాత, ఉత్తరకావేరినది ఉత్తరతీరంలో ఉండే తిరుక్కరమ్బనూర్ **(ఉత్తమర్ కోయిల్)** అనే దివ్యదేశంలో ఒక దైవకాంత అంశతో జన్మించిన, సాటి లేని అందాన్ని కల దేవదేవి అనే ఒక గణిక తన అక్కతో, సఖులతో కలసి ఉఱైయూర్‌కు వచ్చి, చోళరాజుముందు ఆటపాటలను ప్రదర్శించి గొప్ప సంమానాలను, బహుమానాలను పొంది, తిరిగి వెళ్ళేటపుడు దారిలో ఉండే విప్రనారాయణుల పూలతోటలోని ఒక చెట్టునీడలో విశ్రమించింది. నందనవనం అందంలో చాలా అభినివేశాన్ని పొందిన వారంతా అక్కడ ఉండగా, భగవానునకు పూమాలికలను కూర్చడంకోసంగా పూలను కోయాలని వచ్చిన విప్రనారాయణులను వారు చూచారు. శరీరం అంతా పెరిగిన రోమాలను, మీసాలను కలవారై, ద్వాదశోర్ధ్వపుండ్రాలతో, తులసీనలినాక్షమాలికలతో అలంకరింపబడినవారై, బ్రహ్మచారి అయిన ఆ మహానుభావుడు పూలమొక్కలకు పాదులు చేయడం, నీరు ప్రవహింపజేయడం మొదలైన కార్యాలను చేస్తూ, తన ముందు ఉండే వీరిని కన్నెత్తి కూడా చూడలేదు. దానిని చూచిన దేవదేవి తన అక్కను "ఇతడు నపుంకుడా? లేక, పిచ్చివాడా? మనం ఇతనిముందు నిలచి ఉన్నా ఏమాత్రం కన్నెత్తి చూడడంలేదే!" అని అడిగింది. ఆమె (అక్క) కూడా "ఇతడు నీవు భావిస్తున్నట్లుగా నపుంసకుడు కాడు. పిచ్చివాడుకూడా కాడు. శ్రీరంగనాథుని కైంకర్యంలో అభినివేశాన్ని కల్గి, గొప్పవైరాగ్యాను కల నైష్ఠిక బ్రహ్మచారి కనుక, మనవంటివారి అందాన్ని లెక్కించరు. నీవు ఇతనిని వ్యామోహపఱచగల్గితే నేను నీకు ఆఱు నెలలు దాసిగా ఉంటాను" అని బదులిచ్చి ప్రతిజ్ఞ చేసింది. దానిని విన్న దేవకీదేవి "ఈయనను నేను వ్యామోహపఱచలేకపోతే నేను నీకు ఆఱు నెలలు దాసిగా ఉంటాను" అని మాఱు ప్రతిజ్ఞ చేసి, తన అలంకారాలను అన్నిటిని తీసివేసి, చెలికత్తెలను, అక్కను అక్కడనుండి పంపించి వేసింది. సాత్త్వికవేషాన్ని

ధరించిన దేవదేవి విప్రనారాయణుల వద్దకు పోయి వారి శ్రీచరణాలపై పడి నమస్కరించింది. అపుడు విప్రనారాయణులు- "కన్యకా! నీవెవరు?'' అని ప్రశ్నించగా, ఆమెకూడా "స్వామీ ! దాసురాలనైన నేనుపూర్వజన్మలోని కర్మవశంచేత దాసీ (గణికా) కులంలో జన్మించాను. నా తల్లి నన్ను కులవృత్తిని చేసి ధనాన్ని సంపాదించమని నిర్బంధించింది. కాని, నేను "ఎన్నో పాపాలను చేసి ఈ కులంలో పుట్టినది చాలకుండా, ఇంకా ఇంకా పాపాలను చేసి, పాడు పాపకూపంలో పడిపోవాలా!" అని పల్కి దురాశను కల ఆమెను విడచి, శ్రీరంగనాథునకు మాలికా సమర్పణకైంకర్యాన్ని చేసే మిమ్ములను ఆశ్రయించి, ఉజ్జీవించాలని వచ్చాను. వేఱు రక్షకులు ఎవరూ లేని ఈ దాసురాలిపట్ల దయచూపి నందన వనాన్ని పెంచే కైంకర్యాన్ని ఇచ్చినట్లయితే, మీరు ప్రతిదినం మాలికాసమర్పణను చేయడంకోసం కోవెలకు వెళ్ళేటపుడు, మాధుకరం (భిక్షను) యాచించడానికి వెళ్ళేటపుడు ఈ నందనవనాన్ని కాపాడుతూ ఉంటాను'' అని అన్నది. విప్రనారాయణులుకూడా ఆమె మాటలకు జాలిపడి, తాము యాచించి సంపాదించిన భిక్షను తమ ఆరాధనలోని అర్చామూర్తికి నివేదించి, తాము భుజించి, భుజించగా మిగిలిన ఆహారాన్ని ఆమెకు ఇచ్చేవారు.

దేవదేవికూడా, పూలచెట్లకు పాదులను చేయడం, నీటిని పారించడం, వాటిని కంటికి రెప్పలా కాపాడడం మొదలైన కైంకర్యాలను ఆఱు నెలల కాలం చేసింది. ఈ రీతిలో ఉండగా, వర్షాకాలంలో ఒకనాడు గొప్ప వర్షం కురిసింది. అపుడు విప్రనారాయణులు తమ పర్ణశాలలోనే ఉన్నారు. దేవదేవి పర్ణశాలకు బయటనే ఉన్నందువల్ల బాగా తడిసిపోయింది. ఆమెను చూచిన విప్రనారాయణులు జాలిపడి "లోపలికి రా'' అని పిలువగా, ఆమె లోపలకు వచ్చింది. తడిబట్టలతో ఉండే ఆమె చలికి వణుకుతూ ఉండడాన్ని చూచి విప్రనారాయణులు తమ ఉత్తరీయాన్ని ఆమెకు ఇచ్చారు. ఆమె దానిని ధరించి విప్రనారాయణులవద్దకు వచ్చి "మీ శ్రీచరణాలకు సంవాహనం చేస్తాను, అనుమతించండి'' అని ప్రార్థించింది. ఆయన కూడా సమ్మతించారు. దేవదేవి పాదాలను సంవాహనం చేసేటపుడు నిప్పులో పెట్టిన నేయివలె విప్రనారాయణుల మనస్సు ద్రవించడం ఆరంభించింది. దానిని ఆధారంగా చేసికొని, తన మృదుభాషణాలతోను, రూపసౌందర్యంతోను ఆమె విప్రనారాయణులను లోబరచుకొని తనవశం చేసికొన్నది. విప్రనారాయణులను శ్రీరంగనాథుని సేవను కూడా మఱచిపోయేటట్లు చేసింది.



ఈ విధంగా కొంతకాలం గడచిన తరువాత విప్రనారాయణులను విడచిపెట్టి తిరుక్కరమ్బునూర్‌లోని తన ఇంటికి దేవదేవి తిరిగి వెళ్ళిపోయింది. విప్రనారాయణులు దేవదేవి విశ్లేషాన్ని సహించలేక ఆమె ఉండే చోటికి పోయి, ఆమె ఇంటి వాకిటిలోనే వ్యామోహంతో నిలబడ్డారు. నిర్ధనులైన వీరిని చూచి, లక్ష్యం చేయకుండా ఆమె ఇంటి తలుపులను మూసివేసింది. విప్రనారాయణులు ఆమె ఇంటి వీథి తిన్నెపైననే బాధపడుతూ ఉండిపోయారు.

ఆ సమయంలోనే శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకి ఆ దారిలోనే వస్తున్నారు. శ్రీరంగనాయకి విప్రనారాయణుల దీనస్థితిని చూచి జాలిపడి, "మనకు అంతరంగ భక్తులైన వీరిని నీ మాయకు లోబడేటట్లు చేయవచ్చునా? వీరిని మళ్ళీ నీ శ్రీచరణాలకు అంతరంగ కైంకర్యాన్ని చేసేటట్లుగా కటాక్షించాలి'' అని స్వామిని ప్రార్థించింది. శ్రీరంగనాథుడుకూడా దానికి సమ్మతించి, తన ఆరాధనలో ఉపయోగపడే ఒక బంగారు పాత్రను తీసికొనివచ్చి, మానవరూపాన్ని దాల్చి, దేవదేవి ఇంటివాకిటిలో నిలచి "తలుపులు తెఱవండి'' అని పిలిచాడు. ఆమె "నీవెవరు ?'' అని అడిగింది. అపుడు స్వామి "నేను అఴకియ మణవాళన్ అనే పేరును కలవాడను. విప్రనారాయణుల స్నేహితుడను. ఆయన పంపగా వచ్చాను'' అని అన్నాడు. దేవదేవి తలుపులు తెఱచి వచ్చింది. శ్రీరంగనాథుడు- "విప్రనారాయణుడు నీకు ఈ బంగారుపాత్రను పంపాడు'' అని అన్నాడు. ఆమె సంతోషించి, "ఆయనను ఇంటిలోపలకు రమ్మని చెప్పు'' అని అన్నది. శ్రీరంగనాథుడు విప్రనారాయణుల దగ్గరకు పోయి, "దేవదేవి మిమ్ములను లోపలకు రమ్మని అన్నది'' అనగా, ఆయన చాలా ఆనందించి లోపలకు వెళ్ళారు. శ్రీరంగనాథుడు దివ్యాలయాన్ని చేరాడు.

మఱునాడు తెల్లవారగానే, ఆలయంలో ఆరాధనకు ఉపయోగపడే బంగారు పాత్ర కన్పించలేదు. రాజభటులు అర్చకులను, పరిచారకులను విచారించి, వారిని దండించడానికి సిద్ధపడగా, అపుడు దేవదేవి సేవకురాండ్రలో ఒకతె కార్యాంతరంపై అచటికి వచ్చి, తనకు సంబంధించిన ఒక వ్యక్తి దండింపబడేవారిలో ఉండడం గమనించి, ఆలయంలోని బంగారుగిన్నె దొంగిలింపబడిందని తెలిసికొని, "విప్రనారాయణులు ఒక బంగారు పాత్రను తీసికొనివచ్చి, దేవదేవికి ఇచ్చారు. దానిని ఆమె పరుపై గల తలదిండు కింద పెట్టింది'' అని అర్చక పరిచారకులకు తెలిపింది. దానిని వారు రాజసేవకులకు తెలియజేయగా, వారు దేవదేవి ఇంటిలో

వెదకినపుడు ఆమె ఇంటిలో బంగారు పాత్ర కన్పించింది. రాజభటులు దేవదేవిని, విప్రనారాయణులను బంధించి ప్రభువు ముందు పెట్టారు. దేవదేవిని ప్రభువు బంగారు గిన్నె ఆమె వద్దకు ఏవిధంగా వచ్చింది? అని ప్రశ్నించాడు. ఆమె "అళకియమణవాళన్ అనే విప్రనారాయణుని దూత ఒకడు ఆయన పంపినట్లుగా చెప్పి ఈ పాత్రను నాకు ఇచ్చాడు. ఇది శ్రీరంగనాథునకు చెందినది- అని నాకు తెలియదు'' అని అన్నది. తరువాత ప్రభువు విప్రనారాయణుని ప్రశ్నించగా, "నాకు ఏదూత లేడు. నేను ఈ బంగారు పాత్రను పంపలేదు'' అని అన్నారు. దేవదేవి మళ్ళీ "ఈయనే నాకు పంపారు'' అనగా, విప్రనారాయణులు "లేదు లేదు, అసత్యం'' అని అన్నారు. వీరిద్దరి మాటలను విన్న ప్రభువు దేవదేవికి అపరాధ శుల్కాన్ని విధించి ఆ శుల్కాన్ని బంగారు పాత్రను శ్రీరంగనాథునకు సమర్పించేటట్లు చేసి, "విప్రనారాయణులకు తగిన దండనను విధించేవరకు కావలిలో పెట్టండి'' అని ఆజ్ఞాపించాడు.

ఆనాటి రాత్రి శ్రీరంగనాయకి శ్రీరంగనాథునితో ఏకాంతంలో సంభాషించేటపుడు, "విప్రనారాయణులను ఇంకా నీ లీలకు విషయంగా చేయకుండా, కటాక్షించు'' అని పురుషకారం చేయగా, స్వామి అంగీకరించి, ప్రభువుకు కలలో కన్పించి, 'విప్రనారాయణుల పూర్వజన్మకర్మను తీర్చుంకోసమే నేను బంగారు పాత్రను తీసికొనివచ్చి ఇచ్చి, వారికి కారాగారవాసం కలిగేటట్లు చేశాను. అందువల్ల వారి తప్పు ఏమీ లేదు. వారిని విడచిపెట్టి నాకు పుష్పమాలికా కైంకర్యాన్ని పూర్వం వలె ఆయన చేసికొనేటట్లు అవకాశాన్ని కలుగజేయి. దేవదేవి అపరాధశుల్కంతో నాకు పనిలేదు'' అని ఆజ్ఞాపించాడు. చోళరాజు ఉదయం కాగానే స్వప్నాన్ని స్మరించి, విప్రనారాయణులను చెఱనుండి విడిపించి, తనవద్దకు రప్పించి, వారికి పలు ఉపచారాలను చేసి, నమస్కరించి విడుదల చేశాడు. విప్రనారాయణులు తాము చేసిన పనిని స్మరించి, చాలా సిగ్గుపడి, లౌకికవిషయాలపట్ల పూర్ణమైన వైరాగ్యాన్ని పొందారు. గణికాస్త్రీతో సంబంధాన్ని పొందినందులకు ప్రాయశ్చిత్తంగా అచ్యుతుని భక్తుల శ్రీపాదతీర్థాన్ని సేవించి, పరిశుద్ధులయ్యారు. తరువాత, గ్రామకులాదులవల్ల కలిగే అనర్థావహమైన నామాలను పూర్తిగా విడచిపెట్టి, తులసీమాలికా సమర్పణ కైంకర్యంలో అభినివేశాన్ని పొందిన భక్తుల శ్రీచరణరేణువే తమకు ఉజ్జీవనం- అని నిశ్చయించుకొని **"తొణ్డర్ అడిప్పొడి"** అనే తిరునామాన్ని పొందారు. శ్రీరాముని తప్ప ఇంకొక దైవాన్ని తెలియని హనుమానునివలె,



లక్ష్మణునివలె, శ్రీరంగనాథుని తప్ప ఇంకొక దైవాన్ని తెలియనివారయ్యారు. **"కణ్డియూర్ అరఙ్గమ్ మెయ్యమ్ కచ్చిపేర్ మల్లై"** (తిరుక్కుఱు-19) ఇత్యాది దివ్యదేశాలు అన్నిటిలో అభినివేశాన్ని పొంది అంతటా పర్యటించిన మిగిలిన ఆళ్వార్లవలె కాకుండా, శ్రీరంగనాథుని వద్దనే ప్రాతివ్రత్యాన్ని కలవారయ్యారు. శ్రీరంగనాథుడుకూడా వీరికి **"మయర్వఱ మదినలమ్"**ను అనుగ్రహించి, తమ స్వరూపరూపగుణవిభూతి చేష్టితాలను అన్నిటిని కరతలామలకంగా దర్శింపజేశారు. తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు శ్రీరంగనాథుని అనుభవించి, ఆ అనుభవం వల్ల కల్గిన ఆనందం తమ లోపల ఇముడనందువల్ల, చేతనులు (జీవులు) ఉద్ధరింపబడడానికి తెలియవలసిన అర్థాలను అన్నిటిని లోపల ఇమిడ్చి, **"తిరుమాలై"**, **"తిరుప్పళ్ళియెళుచ్చి"** అనే రెండు దివ్యప్రబంధాలను అనుగ్రహించి లోకాన్ని తరింపజేశారు. దేవదేవికూడా వీరి మహిమను చూచి మనస్సును మార్చుకొని, తన సొత్తును అంతటిని శ్రీరంగనాథునకు సమర్పించి, కోవెలలో కైంకర్యాలను చేస్తూ జీవించింది.

ఇక, ఈ ఆళ్వార్ల దివ్యప్రబంధాలలోని అర్థం సంగ్రహంగా నివేదింపబడుతున్నది. మొదటి ప్రబంధమైన తిరుమాలై ప్రబంధం శ్రీశౌనక భగవాన్ అనుగ్రహించిన విష్ణుధర్మంయొక్క సారం. దానిలోని మొదటి రెండు పాశురాలలో, శ్రీరంగనాథుని తిరునామాన్ని ఉచ్చరించినందువల్ల తమకు కల్గిన గొప్పతనాన్ని గూర్చి ఆ స్వామి సన్నిధిలోనే విన్నపించారు. తిరునామసంకీర్తన రసం తప్ప పరమపదానుభవంకూడా తమకు అక్కరలేదని అన్నారు. మూడవ పాశురంలో "సంసారంలో జన్మ తమకు వద్దు'' అని పల్కి, తృతీయవిభూతిగా కీర్తింపబడే శ్రీరంగంలో జీవనమే చాలు- అని నిశ్చయించి పలికారు. ఆ తరువాత 11 పాశురాల ద్వారా స్వరూపానికి తగినది, మిక్కిలి సులభమైనది అయిన భగవద్విషయాన్ని సంసారులు కోల్పోవడాన్ని గమనించి సహించలేక, శ్రీరంగనాథుని మహిమను గూర్చి వారికి ఉపదేశించారు. సంసారులు దానిని గ్రహించనందువల్ల, శ్రీరంగనాథుడు తమకు అజ్ఞానాన్ని తొలగించినది ఆదిగా పరమభక్తి పర్యంతం నిర్హేతుకంగా కృపజేసి కల్గించిన మహోపకారాలను తరువాత పది పాశురాలతో తెలిపారు. ఆ తరువాత పది పాశురాలతో ఒక దేశవిశేషాన్ని (పరమపదాన్ని) చేరి అక్కడ అనుభవించడానికి తగిన సాధనాంతరాలు ఏమీ తమవద్ద లేవనే ఉపాయశూన్యతను విన్నవించారు. ముప్పై అయిదవ పాశురంలో ''ఏ

సాధనానుష్ఠానాన్ని చేయని నేను ఇక భగవద్విషయాన్ని కోల్పోవలసినదేకదా !'' అని నిస్పృహతో వెనుకంజ వేసిన తమను తన అభినివేశాతిశయాన్ని చూపి శ్రీరంగనాథుని తనవద్దకు చేర్చుకొన్న రీతినిగూర్చి పలికారు. తరువాత రెండు పాశురాలతో విశేషకటాక్షాన్ని అనుగ్రహించాలని అర్థించి, దానిని పొందలేక తాము గొప్పక్లేశాన్ని పొందడాన్నిగూర్చి పలికారు. తిరుమాలై ప్రబంధంలోని ప్రాణస్థానీయమనదగిన ముప్పై ఎనిమిదవ పాశురంలో ప్రాప్య- ప్రాపకనిష్కర్షాన్ని చేసి, ప్రాప్యత్వరను కల్గిన రహస్యత్రయనిష్ఠుల పట్ల శ్రీరంగనాథునకు ఉండే ఆదరాతిశయాన్నిగూర్చి తెలిపారు. తరువాత అయిదు పాశురాలతో ఇటువంటి భాగవతుల గొప్పతనాన్ని, వారిని తక్కువగా భావించేవారి నైచ్యాన్ని తెలిపారు. నలభై నాల్గవ పాశురంలో - "బ్రహ్మ, శివుడు మొదలైన స్వప్రయత్ననిష్ఠులు పొందలేని ఫలాన్ని తననే ఉపాయంగా గ్రహించిన గజేంద్రునకు అనుగ్రహించిన విషయాన్నిగూర్చి పలికారు. నలభై అయిదవ పాశురంలో ఈ ప్రబంధాన్ని అధ్యయనం చేసినవారికి కలిగే ఫలాన్నిగూర్చి పల్కి పూర్తిచేశారు. ఇది తిరుమాలై ప్రబంధంలోని సంగ్రహప్రమేయం.

తిరుమాలై ప్రబంధంలో తొణ్డరడిప్పొడి ఆళ్వార్లకు **"ఆదలాల్ పిఱవి వేణ్డేన్"** అనే రీతిలో ప్రకృతిసంబంధం చాలా హేయమైనది- అనే జ్ఞానాన్ని, **"పోనకమ్ శెయ్ద శేడమ్ తరువరేల్ పునిదమ్"** అనే రీతిలోని భాగవతశేషత్వపర్యంతంగా స్వరూపయాథాత్మ్యజ్ఞానాన్ని, **"కావలిల్ పులనై వైత్తు"** అనే రీతిలో ఇంద్రియనిగ్రహాన్ని, **"కుళిత్తు మూన్ఱనలై"** అనే రీతిలోని అనన్యోపాయత్వజ్ఞానాన్ని, **"ఉన్నరుళెన్నుమ్ ఆశైతన్నాల్"** అనే రీతిలోని ఉపాయ యాథాత్మ్యజ్ఞానాన్ని కల్గించి, సంసారమనే గొప్పనిద్రలో ఉండేవారిని ప్రబోధించిన శ్రీరంగనాథుడు, **"శోమ్బరై యుకత్తిపోలుమ్"** అనే రీతిలో చాలా సంతోషించి, వీరిని ఇంతదూరం తీసికొనివచ్చి నిలిపిన తన గొప్పతనాన్ని అనుసంధిస్తూ, అందఱిని వీరివలెనే నాపట్ల అభినివేశాన్ని పొందేటట్లుగా చేసే ఉపాయం ఏమి ?'' అని ఆలోచిస్తూ యోగనిద్రను పొందాడు. ఆ రీతిలో యోగనిద్రను పొందిన శ్రీరంగనాథుని **"ఉత్తిష్ఠ పురుష! హరి! లోహితపింగళాక్ష !" ("తైత్తిరీయ నారాయణవల్లి")** (ఎఱ్ఱతామరలవంటి ఎఱ్ఱని కన్నులను కలవాడా! పురుషా! హరీ! నిద్రలే) అని పరమపురుషునకు అసాధారణాలైన రెండు తిరునామాలను, పుండరీకాక్షత్వమనే లక్షణాలను నిర్దేశించి సంబోధించి, అతనికి మేల్కొలుపు పాడిన వేదపురుషునివలె, **"కౌసల్యాసుప్రజా !**



**రామ !"** (శ్రీరామా-బాల-23-2) అనే విశ్వామిత్రమహర్షివలె, **"ఉమ్బర్‌కోమానే ! ఉఱఙ్గాదు ఎళున్దిరాయ్"** (తిరుప్పావై-17) అనే గోదాదేవివలె, **"అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెళున్దరుళాయే"** అని అంటూ తమ ప్రాప్యత్వరవల్ల ప్రతిపాశురంలోను ప్రబోధాన్ని పల్కి, **"అడియార్‌క్కు ఆట్పడుత్తాయ్"** అని ప్రాప్యంయొక్క పరమావధి అయిన భాగవతకైంకర్యాన్ని ప్రార్థించి, పూర్తిచేశారు, తమ రెండవ ప్రబంధమైన తిరుప్పళ్ళిఎళుచ్చిని.

తిరుమఙ్గైయాళ్వార్, వీరి నందనవనం ఉండే చోటును వదలిపెట్టి ప్రాకారాన్ని కట్టారు అని, వీరు తాము పూలను కోసే ఆయుధానికి **"అరుళ్ మారి"** అనే తిరుమఙ్గై ఆళ్వార్ పేరును పెట్టారనే ఐతిహ్యాలు ఉన్నందున వీరిరివురు సమకాలీనులని, **"అన్బర్‌తాళ్‌తూళి నఱ్పాణన్ నఱ్కలియన్"** అనే ఉపదేశరత్తిన మాలై ప్రబంధంలో మణవాళ మహామునులు వీరి అవతార క్రమాన్ని అనుగ్రహించినందువల్ల ముగ్గురు ఒకే కాలంలో జీవించినవారని తెలుస్తున్నది. తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు శ్రీరంగంలోనే పరమపదించారు. ఇపుడు తిరుప్పళ్ళి యెళుచ్చి అనే సాహిత్యప్రక్రియను గూర్చి సంగ్రహంగా తెలుపబడుతున్నది.

## వాళిత్తిరునామం

మణ్డఙ్గుడి యతనై వాళ్‌విత్తాన్ వాళియే
మార్గళియిల్ కేట్టైయతనిల్ వన్దుదిత్తాన్ వాళియే
తెణ్డిరైశూళ్ అరఙ్గరైయే దెయ్వ మెన్ఱాన్ వాళియే
తిరుమాలై ఒన్బదఞ్జుమ్ శెప్పినాన్ వాళియే
పణ్డు తిరుప్పళ్ళియెళుచ్చి పత్తురైత్తాన్ వాళియే
తొణ్డు శెయ్తు తుళవత్తాల్ తులఙ్గినాన్ వాళియే
తొణ్డరడిప్పొడి యాళ్వార్ తుణైప్పదఙ్గళ్ వాళియే

(తిరుమణ్డఙ్గుడి అనే దివ్యదేశాన్ని తమ అవతారంలో ఉజ్జీవింపజేసినవారికి మంగళం. మార్గశీర్షమాసంలోని జ్యేష్ఠానక్షత్రంలో ఈ భూమిలోకి వచ్చి అవతరించిన వారికి మంగళం. దక్షిణదిక్కులో సముద్రంచేత పరివేష్ఠితమైన శ్రీరంగంలోని శ్రీరంగనాథుడే దైవమని పల్కినవారికి మంగళం. నలభై అయిదు పాశురాలను కల తిరుమాలైప్రబంధాన్ని అనుగ్రహించినవారికి మంగళం. పూర్వం పది పాశురాలను కల తిరుప్పళ్ళి యెళుచ్చిని కృపజేసినవారికి మంగళం. "మాదరార్

కయిఱ్కణెన్నుమ్ వళైయుళ్ పట్ట*ఴు*న్దు" ఇత్యాదిగా కాంతలతో సంగమాన్ని నిందించిన వైరాగ్యసంపదను కలవారికి మంగళం. తులసీమాలతో కైంకర్యాన్ని చేసి వెలిగినవారికి మంగళం. తొణ్డరడిప్పొడి ఆ*ఴ్వా*ర్ల శ్రీచరణద్వంద్వానికి మంగళం.)

ఇప్పుడు తిరుప్పళ్ళియె*ఴు*చ్చి అనే ద్రావిడ సాహిత్య ప్రక్రియను గురించి కొన్ని విశేషాలు ప్రస్తావింపబడుతున్నాయి.

## ద్రావిడవాఙ్మయంలో తిరుప్పళ్ళియె*ఴు*చ్చి సాహిత్యప్రక్రియ

"పళ్ళి యె*ఴు*చ్చి" అనే ద్రావిడ సాహిత్యప్రక్రియ నాలాయిర దివ్యప్రబంధ వాఙ్మయంలోకూడా చోటు చేసికొన్నది. తొణ్డరడిప్పొడి యా*ఴ్వా*ర్లు అనుగ్రహించిన తిరుప్పళ్ళియె*ఴు*చ్చి ప్రబంధం "ముదలాయిరమ్" అనే ప్రథమ సహస్రంలో ఎనిమిదవ ప్రబంధం. శ్రీరంగంలోని శ్రీరంగనాథుని మేల్కొలుపు పాడే రీతిలో ఆ*ఴ్వా*ర్లు ఈ కృతిని పాడారు. ఈ ఆ*ఴ్వా*ర్లు అనుగ్రహించిన ఇంకొక ప్రబంధం తిరుమాలై. ఇందులో **45** పాశురాలున్నాయి. ఈ రెండు ప్రబంధాలలో కలిపి **55** పాశురాలు మాత్రమే ఉన్నాయి. ఇంత పరిమితసంఖ్యలో పాశురాలను పాడిన తొణ్డరడిప్పొడి ఆ*ఴ్వా*ర్లు "పళ్ళియె*ఴు*చ్చి", "మాలై" అనే రెండు విధాలైన విశిష్ట విభిన్న సాహిత్య ప్రక్రియలను రచించడం గమనార్హమైన అంశం.

"పళ్ళియె*ఴు*చ్చి" అంటే -మేల్కొలుపు -అని అర్థం. ఈ విధంగా పళ్ళియె*ఴు*చ్చి (మేల్కొలుపు) పలికే అర్థంలో పాడిన ప్రబంధానికి అదే పేరుగా నిలిచింది. భగవానునకు చెందిన ప్రబంధాలకు "తిరు" అనే విశేషణపదాన్ని చేర్చడం సంప్రదాయం. ఆ రీతిలోనే శ్రీరంగనాథుని మేల్కొలుపు పాడే పది పాశురాలను కల ఈ ప్రబంధం "తిరుప్పళ్ళియె*ఴు*చ్చి" అని వ్యవరింపబడుతున్నది. ఈ పేరుతో వ్యవహరింపబడిన మొదటి ప్రబంధం తిరుప్పళ్ళియె*ఴు*చ్చి. అనంతరకాలంలో మాణిక్కవాచకర్ రచించిన, శైవసాహిత్యానికి చెందిన సుప్రభాత కృతికూడా ఈ పేరుతోనే వ్యవహరింపబడుతున్నది.

తిరుప్పళ్ళియె*ఴు*చ్చి అనే సాహిత్యప్రక్రియ ఆవిర్భావానికి ముందు ఉండే పూర్వం రంగాన్ని పరిశీలించినపుడు, తొల్కాప్పియంలో కొన్ని అంశాలను గమనించవచ్చు. తొల్కాప్పియంకాలంలో- ప్రభువులు నిదురించే ముందు, మేల్కొనేటపుడు పాటలను పాడే సంప్రదాయం ఉన్నట్లు తెలుస్తున్నది. ప్రభువులు



నిద్రించడానికి ఉపక్రమించేటపుడు పాడడాన్ని **"కణ్పడైకణ్ణియ కణపడైనిలై"** అనే వేరుతో తొల్కాప్పియం నిర్దేశించింది. నిద్రిస్తున్న ప్రభువులు మేల్కొనేటపుడు వారిని కీర్తిస్తూ పాడే పాటలను **"తుయిలెడై నిలై"** అని నిర్దేశించింది. ఈ విధంగా నిద్రించే ముందు, మేల్కొనేటపుడు గానం చేసేవారు **"సూతు"**లనబడతారు. **"తావిల్ నల్లిశై కరుదియ కిడన్దోర్క్కు చ్చూతర్ ఏత్తియ తుయిలెడై నిలైయుమ్"** అని అంటూ తొల్కాప్పియం - పొరుళ్ అధికారంలో ఈ విషయం తెలుపబడింది.

ఈ రీతిలో ప్రభువులకు మేల్కొలుపు పాడే **"తుయిలెడై"** వాఙ్మయమే భక్తివాఙ్మయంలో భగవానునకు సుప్రభాతాన్ని పాడే పాటలుగా పరిణమించింది. అపుడు **"తుయిలెడై నిలై"** అనే పేరు కూడా మాఱి, **"తిరుప్పళ్ళియె*ఴు*చ్చి"** అనే కొత్త పేరుతో కూడా ఈ ప్రక్రియ వ్యవహరింపబడింది. వినియోగవైలక్షణ్యాన్ని బట్టి పేరులోకూడా ఇటువంటి విలక్షణత ఏర్పడిందని చెప్పాలి.

ప్రాచీనద్రావిడసాహిత్యంలో ప్రభువులను మేల్కొలుపు పాడడంకోసం సూతులు పాడే పాటలు లభించడం లేదు. తొల్కాప్పియర్ గ్రంథకారుడు తెలిపే **"తుయిలెడైనిలై"** కు ఇళమ్పూరణర్, నచ్చినార్క్కినియర్ మొదలైనవారు ఉదాహరణలుగా చూపిన పాశురాలు. **"తుయిలెడైనిలై"** ప్రక్రియకు చెందినవి కావు. అవి **"తుయిలెడై నిలై"** ప్రక్రియకు చెందిన అర్థాన్ని మాత్రమే తెలుపుతున్నవి. శాబ్దికమైన నిర్దేశం వాటిలో కన్పించదు''- అని ఎం.వరదరాజన్ అనే ద్రావిడ సాహిత్యవిమర్శకులు **"తమి*ఴ్* ఇలక్కియ వరలాఱు"** అనే గ్రంథంలో పేర్కొన్నారు.

నిశితంగా గమనిస్తే, ప్రభువులకు సుప్రభాతాన్ని పాడే **(తుయిలెడైనిలై)** పాశురాల ఛాయలు తిరుప్పావైలో కన్పిస్తాయి. ప్రాతఃకాలంలో నందగోపాలుని అంతఃపురానికి వెళ్ళిన గోపికలు ద్వారపాలకుని అనుజ్ఞతో నందగోపాలుడు, యశోద, శ్రీకృష్ణుడు బలరాముడు, నీళాదేవి మొదలైనవారికి మేల్కొలుపు పాడారు. **"ఎమ్బెరుమాన్ నన్ద గోపాలా! ఎ*ఴు*న్దిరాయ్", "ఎమ్బెరుమాట్టి యశోదా ! అఱివుఱాయ్", "ఉమ్బర్కోమానే ! ఉఱఙ్గాదు ఎ*ఴు*న్దిరాయ్", "శెల్వా ! బలదేవా! ఉమ్బియుమ్ నీయుమ్ ఉఱఙ్గేల్", "నప్పిన్నై నఙ్గాయ్ ! తిరువే ! తుయిలె*ఴా*య్"** అని పైన పేర్కొన్నవారికి గోపికలు సుప్రభాతాన్ని పాడారు. లోకంలో సామాన్యంగా ఎవరినైనా నిద్రలేపడంకోసం పాడే జానపదగీతాల శైలిలో పై వాక్యాలు ఉన్నాయని ఎం. శ్రీనివాసన్ అభిప్రాయపడ్డారు.

పైన ప్రస్తావించిన తిరుప్పావైలోని పాశురాలు **"తుయిలెడైనిలై"** ప్రక్రియకు చెందినవిగాను, **"తిరుప్పళ్ళియెழுచ్చి"** ప్రక్రియకు చెందినవిగాను చెప్పవచ్చు. నందగోపాలుడు, శ్రీకృష్ణుడు గోపికలకు ప్రభువు, ప్రభువుకుమారుడే కదా. కనుక ఇవి **"తుయిలెడైనిలై"** ప్రక్రియకు అన్వయిస్తాయి. ఇక, గోదాదేవి శ్రీకృష్ణుని **"కణ్ణన్ ఎన్నుమ్ కరున్దెయ్‌వమ్"** అని భావించి మేల్కొలుపు పాడింది కనుక, **"తిరుప్పళ్ళి యెழுచ్చి"** ప్రక్రియకుకూడా ఇవి చెందుతాయి.

ఈవిధంగా పరిశీలించినపుడు పైన పేర్కొన్న మేల్కొలుపు అర్థాన్ని తెలిపే పాశురాలు, శబ్దతః, అర్థతః సుప్రభాతాన్ని పాడే తిరుప్పావై పాశురాలు మొదలైనవి తొణ్డరడిప్పొడియాழ்వార్లు తిరుప్పళ్ళియెழுచ్చి ప్రబంధాన్ని రచించడానికి కారణమైన నేపథ్యంగా చెప్పవచ్చు. కాలాన్నిబట్టి గోదాదేవి తొణ్డరడిప్పొడి ఆழ்వార్లకు ముందు జన్మించిందికదా !

**సాంప్రదాయికమైన నేపథ్యం :**

ఇంతవరకు తొణ్డరడిప్పొడి యాழ்వార్ల తిరుప్పళ్ళి యెழுచ్చి ప్రబంధానికి గల చారిత్రక నేపథ్యాన్ని గమనించాము. ఇక, సాంప్రదాయిక దృక్కోణంలో చూస్తే, ఈ ప్రబంధాన్ని ఆழ்వార్లు అనుగ్రహించడానికి గల కారణం విభిన్నమైనది. విశ్వామిత్రమహర్షి శ్రీరామచంద్రునకు సుప్రభాతాన్ని పాడినట్లుగానే, ఆழ்వార్లు శ్రీరంగనాథునకు సుప్రభాతాన్ని పాడారు- అనేది సాంప్రదాయికమైన వివరణం. ఈ దృష్టిలోనే ఈ ప్రబంధవ్యాఖ్యాతలైన పెరియవాచ్చాన్‌పిళ్ళై, నంజీయర్ తమ అవతారికలను అనుగ్రహించారు. (అవతారికలో ఈ అంశం వివరింపబడింది. వివరాలను అక్కడ దర్శించవచ్చు.)

"ఈ వివరణలోకూడా ఒక సత్యాన్ని గమనించాలి. శ్రీరాముడనే ప్రభువునకు పాడిన **"తుయిలెడై నిలై"** (సుప్రభాతం) శ్రీరంగనాథుడనే భగవానునకు తిరుప్పళ్ళియెழுచ్చి పాడడానికి కారణమైనది అనేదే ఆ సత్యం - అని **"తమిழ் ఇలక్కణ వరలాఱు"** అనే గ్రంథంతో శ్రీ.ఎం. శ్రీనివాసన్‌గారు అన్నారు. తిరుప్పళ్ళి యెழுచ్చికి పూర్వాచార్యులు అనుగ్రహించిన తనియన్‌లో సైతం **"రంగేశయం రాజవదర్హణీయమ్"** (ప్రభువువలె ఆరాధింపదగినవాడైన శ్రీరంగనాథుని) అని ప్రయోగింపబడడంవల్లకూడా ప్రభువును మేల్కొలుపడానికి పాడే **"తుయిలెడైనిలై"** తరువాతి కాలంలో భగవానునకు పాడే తిరుప్పళ్ళియెழுచ్చి అయినదనే విషయాన్ని తెలుపుతున్నదని వారి అభిప్రాయం.



ద్రావిడభక్తిసాహిత్యయుగంలో భగవానునకు తిరుప్పళ్ళియెழுచ్చి పాడిన మొదటి ప్రబంధాలుగా రెండు కృతులు అవతరించాయి. అవి - తొణ్డరడిప్పొడి యాழ்వార్లు, మాణిక్కవాచకర్ రచించిన తిరుప్పళ్ళియెழுచ్చి ప్రబంధాలు. ఈ రెండు ప్రబంధాలకు తిరుప్పళ్ళియెழுచ్చి అనేదే సాధారణనామం. కర్తృనామాన్ని పురస్కరించుకొని వాటిలోని భేదం గమనింపబడుతున్నది.

తొణ్డరడిప్పొడి యాழ்వార్లు తిరుప్పళ్ళియెழுచ్చి ప్రబంధాన్ని శ్రీరంగంలో శయనించి ఉండే శ్రీరంగనాథుని ఉద్దేశించి సుప్రభాతం పాడే రీతిలో అనుగ్రహించారు. ఈ ఆழ்వార్లు పాడిన ఇంకొక ప్రబంధం తిరుమాలై. ఇదికూడా శ్రీరంగనాథుని ఉద్దేశించి రచింపబడినదే. శ్రీరంగనాథుని తప్ప వేఱు దైవాన్ని తెలియనివారు ఈ ఆழ்వార్లు. పదిమంది ఆழ்వార్లలో మిగిలిన తొమ్మిదిమంది శ్రీరంగమే కాకుండా ఇంకా కొన్ని దివ్యక్షేత్రాలను కీర్తించగా, తొణ్డరడిప్పొడి ఆழ்వార్లు మాత్రం శ్రీరంగాన్ని మాత్రమే కీర్తించారు. అందువల్ల వీరు, శ్రీరంగంలోని శ్రీరంగనాథుని గూర్చి తిరుప్పళ్ళియెழுచ్చి పాడడానికి ఇది ఒక కారణం. ఇంకొక- ఆసక్తిని కల్గించే కారణంకూడా ఉన్నది. భగవానుడు పలు దివ్యక్షేత్రాలలో అర్చామూర్తి రూపంలో వేంచేసి ఉన్నాడు. ఈ విధంగా భగవానుడు వేంచేసి ఉండే సన్నివేశాలు విభిన్నాలు. పరుండి ఉండే స్థితి, కూర్చుని ఉన్న స్థితి, నిలబడి ఉండే స్థితి- అనే రీతిలో ఒక్కొక్క దివ్యదేశంలో ఒక్కొక్క సన్నివేశంతో స్వామి వేంచేసి ఉంటాడు. శ్రీరంగంలో శేషశయనంపై పరుండి ఉండే సన్నివేశంతో సాక్షాత్కరించే శ్రీరంగనాథునకు తొణ్డరడిప్పొడి యాழ்వార్లు తిరుప్పళ్ళియెழுచ్చి పాడడం సన్నివేశానుగుణం కదా!

**తిరుప్పళ్ళియెழுచ్చి ప్రబంధస్వరూపం :**

తొణ్డరడిప్పొడి యాழ்వార్లు తిరుప్పళ్ళియెழுచ్చి పాశురాలను **ఎణ్ శీర్ ఆశిరియవిరుత్తమ్** అనే వృత్తభేదంలో కూర్చారు. అనాదిగా ప్రాతఃకాలంలో గానం చేయబడే భూపాళరాగానికి అనుగుణంగా ఇవి రచింపబడ్డాయని సంగీతజ్ఞుల అభిప్రాయం. ఈప్రబంధంలోని పది పాశురాలు. **"ప్పళ్ళి యెழுన్దరుళాయే"** అనే మకుటంతో ముగుస్తున్నాయి. ఎనిమిది పాశురాలలో **(1,2,3,4,5,6,7,8,9)** **"అరఙ్గత్తమ్మా ! పళ్ళి ఎழுన్దరుళాయే"** అని సంబోధనాంతంగాను, మిగిలిన రెండు **(5,10)** పాశురాలలో సంబోధనరహితంగా మకుటం కన్పిస్తున్నది.

మొదటి అయిదు పాశురాలలో ప్రాతఃకాలికమైన వర్ణన ఆ యా గుర్తులను ప్రస్తావించడం ద్వారాచేయబడింది. ఆ పాశురాలలోని ఉత్తరార్ధంలో భగవానుని ఆయా అవతారాలలోని అద్భుతలీలలు వర్ణింపబడ్డాయి. తరువాత నాల్గు పాశురాలలో భగవానుడు నిద్ర లేచే సొబగును దర్శించడంకోసం కుతూహలంతో పలువురు దేవతలు వేచి ఉండే స్థితిని విన్నవిస్తూ మేల్కొనమని ప్రార్థింపబడింది. చివరి పాశురం ఆళ్వార్లు తమ కోసం ప్రార్థించే రీతిలో రచింపబడింది.

మాణిక్కవాచకర్ రచించిన శైవభక్తిసాహిత్యానికి చెందిన తిరుప్పళ్ళియెళుచ్చి ప్రబంధంకూడా అన్నివిధాలుగా తొణ్డడిప్పొడి యాళ్వార్ల తిరుప్పళ్ళియెళుచ్చి ప్రబంధంతో సామ్యాన్ని కల్గి ఉన్నది. పాశురాల సంఖ్య, **"పళ్ళి యెళున్దరుళాయే"** అనే మకుటసామ్యం, ప్రాతఃకాలిక చిహ్నాల వర్ణన, ఇష్టదైవంయొక్క నిర్హేతుకకృపను స్తుతించడం, ఇష్టదైవం పేరును, మహిమను ప్రస్తావించడం - మొదలైన పలు అంశాలలో ఈ పోలిక కన్పిస్తుంది. ఈ సందర్భంలో, తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల తిరుప్పళ్ళియెళుచ్చి ప్రభావం మాణిక్యవాచకర్‌పై ఉండడం గమనించదగిన ఒక అంశం. విభిన్నసంప్రదాయాలకు చెందిన ఈ రెండు ప్రబంధాల మధ్య కన్పించే ఈవిధమైన అత్యంతసామ్యాలకు గల కారణాలను విశ్లేషిస్తూ శ్రీఎం. వరదరాజన్‌గారు **"తమిళ్ ఇలక్కియ వరలాఱు"** అనే గ్రంథంలో - "ఈ కవులిద్దఱు తిరుప్పళ్ళియెళుచ్చి ప్రబంధాన్ని పాడడానికి ముందే ద్రావిడదేశంలో **"తుయిలెడైనిలై"** అనేది ప్రత్యేకించి, ఏదో ఒక సంప్రదాయానికి చెందిన ప్రక్రియ కాకుండా, సాధారణమైన ప్రక్రియగా ప్రసిద్ధిజెంది ఉండాలి. అదికూడా జనసామాన్యప్రచారంలో ఉండే జానపదగీత (ఫోక్ సాంగ్) ప్రక్రియగా ప్రసిద్ధిజెంది ఉండాలి, ఈ విధంగా సర్వసమాదరణీయమైన ఈ సాహిత్యప్రక్రియరచనలో కూడా ఛందస్సు విషయాల ప్రస్తావన మొదలైన అంశాలలోకూడా సామ్యం ప్రసిద్ధమై ఉండాలి, ప్రభువులకు, ఇష్టదేవతలకు సుప్రభాతం పాడడంలో ఈ అంశాల ఉపయోగం కూడా ప్రసిద్ధమై ఉండాలి'' అంటూ వివరించారు. సంస్కృత సాహిత్యంలో కన్పించే సుప్రభాతస్తుతులుకూడా బహుళంగా వసంతతిలక వృత్తంలోనే రచింపబడడంవంటి సమానమైన అంశాలను గమనిస్తే పైన తెలుపబడ్డ కారణాలు అంగీకార్యాలుగానే కన్పిస్తాయి.

ఇష్టదైవానికి మేల్కొలుపు పలికే రీతిలో భక్తులు ఆ దైవం యొక్క మహిమను కీర్తించడమే ప్రధానోద్దేశ్యంగా తిరుప్పళ్ళియెళుచ్చి ప్రబంధాలు అవతరించాయని



చెప్పాలి. భక్తులకు అనుగ్రహించే రీతిలో మేల్కొనాలి- అని దైవసన్నిధిలో విన్నపించడమే ఇందులోని ముఖ్యమైనదృష్టి. అయితే, "భగవానుని కూడా నిద్రలేపవలసి ఉన్నదా ? ఆయనకు కూడా నిద్ర ఉన్నదా ?'' మొదలైన సందేహాలు, సహజంగా ఈ సందర్భంలో కల్గుతాయి. వీటికి తగిన వేదాంతపరమైన సమాధానాన్ని వ్యాఖ్యాతలు సప్రమాణంగా తెలిపారు. లోకప్రసిద్ధమైన సాహిత్య ప్రక్రియలను భక్తకవులు తమ ఇష్టదైవాలను స్తుతించడానికి వినియోగించడం ఈ తిరుప్పళ్ళియెళుచ్చి ప్రబంధాల ఆవిర్భావానికి కారణంగా భావించడంకూడా సమంజసమే.

**మిగిలిన ఆళ్వార్ల పాశురాలలో తిరుప్పళ్ళియెళుచ్చిచ్ఛాయలు :**

తొణ్డరడిప్పొడి యాళ్వార్లవలె మిగిలిన ఏ ఆళ్వార్లు వేఱొక తిరుప్పళ్ళి యెళుచ్చి ప్రబంధాన్ని పాడలేదు. అయినా, కొందఱు ఆళ్వార్ల పాశురాలలో తిరుప్పళ్ళియెళుచ్చిచ్ఛాయలు గోచరిస్తాయి. పెరియాళ్వార్ తిరుమొళిలోని **"అరవణైయాయ్ ! ఆయరేఱే ! అమ్మ ! ముణ్ణత్తుయిలెళాయే"** (2-2-1) అని అంటూ యశోదాదేవి శ్రీకృష్ణుని మేల్కొలుపు పాడే రీతిలో పల్కిన సూక్తి దీనికొక ఉదాహరణ. గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో కూడా పలు ప్రయోగాలు తిరుప్పళ్ళియెళుచ్చి ప్రక్రియలో చేయబడ్డాయి. ఆఱవ పాశురం నుండి 15వ పాశురం వరకుగల 10 పాశురాలు నిద్రించే గోపికలను ముందుగా మేల్కొన్న గోపికలు నిద్ర లేపే క్రమంలో ఉన్నాయి. ఇంతేకాక, **"కలియే ! తుయిలెళాయ్, ఇనిత్తాన్ ఎళున్దిరాయ్ విమలా ! తుయిలెళాయ్, తిరువే ! తుయిలెళాయ్, శుడరే! తుయిలెళాయ్"** అనే ప్రయోగాలు అన్నీ మేల్కొలుపును పాడే రీతిలోనే ఉన్నాయి. **"తూయోమాయ్ వన్దోమ్ తుయిలెళ ప్పాడువాన్"** (16) అనే తిరుప్పావైలోని ప్రయోగం కూడా మేల్కొలుపును గూర్చి ప్రస్తావిస్తున్నది.

నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళి ప్రబంధంలోని **"కిడన్దాళ్ కిడన్దాయ్ ఎత్తనై కాలమ్ కిడత్తి ఉన్ తిరువుడమ్బశైయ"** (9-2-3), **"కొడియార్ మాడ క్కోళూరకత్తుమ్ పుళిఙ్గుడియుమ్"** అనే ప్రయోగాలలో తిరుప్పళ్ళియెళుచ్చి భావాలను గమనించవచ్చు.

ఒక సమయంలో ఒక సాహిత్యప్రక్రియలో అంతర్భాగమైనది. తరువాతి కాలంలో ప్రత్యేకమైన ప్రక్రియగా వికసించడం సహజమే. అదేరీతిలో ప్రత్యేకమైన

ప్రక్రియగా విస్తరించినదే కొంతకాలానికి ఒక ప్రక్రియలో అంతర్భవించవచ్చు. ఆ విధంగానే కొంతకాలం **"తుయిలెడైనిలై"**లో అంతర్భాగమైన తిరుప్పళ్ళియెళ్ళుచ్చి తరువాత ప్రత్యేక ప్రక్రియగా వికసించింది- అని చెప్పవచ్చు.

**తిరుప్పావై- తిరుప్పళ్ళియెళ్ళుచ్చి ప్రబంధాలలోని సామ్యం :**

తిరుప్పావై, తిరుప్పళ్ళియెళ్ళుచ్చి ప్రబంధాల మధ్య కన్పించే కొన్ని అర్థసామ్యాలు గమనించదగినవి. శ్రీకృష్ణుని ప్రబోధించే గోపికలు **"శిరియ శిఙ్గానశనత్తిరున్దు యామ్ వన్ద కారియమ్ ఆరాయ్న్దు అరుళ్" (23)** అని ప్రార్థించారు. ఇదే రీతిలో తొణ్డరడిప్పొడి యాళ్వార్లు కూడా **"నాళోలక్కమరుళ అరఙ్గత్తమ్మా! పళ్ళి యెళ్ళున్దరుళాయే"** అని తిరుప్పళ్ళియెళ్ళుచ్చిలో పలికారు. గోపికలు ప్రాతఃకాలంలో లేచి, మార్గశీర్షవ్రత స్నానానికి సన్నద్ధలై, శ్రీకృష్ణుని మేల్కొలుపు పాడే రీతిలో తిరుప్పావైలోని పాశురాలు ఉన్నందున వాటిలో ప్రాభాతిక చిహ్నాలను తెలిపే పలు వర్ణనలు కన్పిస్తాయి. అదే రీతిలో, తిరుప్పళ్ళియెళ్ళుచ్చిలోని మొదటి అయిదు పాశురాలలో కూడా ప్రభాతసమయాన్ని సూచించే వర్ణనలు గోచరిస్తాయి. ఈ విధమైన అర్థసామ్యాలను పురస్కరించుకొనియే ఆలయాలలో, గృహాలలోని ఉదయకాలం ఆరాధనలో నిత్యానుసంధేయాలుగా విధింపబడి ఉండవచ్చునని శ్రీతిరుమలై అయ్యంగార్ అభిప్రాయపడ్డారు.

ఈవిధంగా తిరుప్పళ్ళియెళ్ళుచ్చి అనే సాహిత్యప్రక్రియ, తిరుప్పళ్ళియెళ్ళుచ్చి అర్థాన్ని తెలిపే ప్రయోగాలు ప్రాచీన ద్రావిడ భక్తిసాహిత్యయుగంలోనే కన్పిస్తున్నా, ద్రావిడకావ్యలక్షణగ్రంథాలలో తిరుప్పళ్ళియెళ్ళుచ్చి ప్రక్రియకు లక్షణం తెలుపబడలేదు. పన్నిరుపాట్టియల్‌లో ప్రబంధదీపికైలో **"తుయిలెడైనిలై"** లక్షణం నిర్దేశింపబడింది. వీటిలో **"తుయిలెడైనిలై"** ప్రభువులకు మేల్కొలుపు పాడే సాహిత్యప్రక్రియగా లక్షింపబడింది. కాని, తిరుప్పళ్ళి యెళ్ళుచ్చినిగూర్చి పై రెండు లక్షణగ్రంథాలు ప్రస్తావించలేదు. ప్రాచీనకాలంలో **"తుయిలెడైనిలై"**లో అంతర్భాగమైనందువల్ల తిరుప్పళ్ళియెళ్ళుచ్చికి ప్రత్యేకంగా లక్షణం చెప్పబడలేదని భావించవచ్చు. అయినా, **పాదాదికేశమ్, కేశాదిపాదమ్**- వంటి ప్రక్రియలకుకూడా ప్రత్యేకప్రత్యేకంగా లక్షణాలను పేర్కొన్న లక్షణగ్రంథాలు, ప్రభువులకు మేల్కొలుపు **"తుయిలెడైనిలై"** అని, భగవానుని మేల్కొలుపు **"తిరుప్పళ్ళియెళ్ళుచ్చి"** అనే నామభేదాన్ని ఈ రెండు ప్రక్రియలకు ఉండగా, లక్షణకర్తలు తిరుప్పళ్ళియెళ్ళుచ్చికి



ప్రత్యేకలక్షణాన్ని తెలుపని కారణం ఏమో స్పష్టపడడం లేదు" అని శ్రీఎం.శ్రీనివాసన్ అభిప్రాయపడ్డారు.

**ఇది ఒక కొనసాగే ప్రక్రియ :**

తిరుప్పళ్ళియెళ్ళుచ్చి అనే ద్రావిడసాహిత్య ప్రకారం భక్తిసాహిత్యకాలంలో మాత్రమే కన్పించి, తరువాత మఱుగుపడిపోయిన ప్రక్రియ కాదు. ఈనాటికీ ఇరవై ఒకటవ శతాబ్దిలోకూడా కొనసాగుతున్నది. ఈ ప్రక్రియ భగవానునకు మేల్కొలుపు పాడే రీతిలోనే కాక, ఆచార్యులకు, భాషకు, దేశానికి, మహా పురుషులకు, ఇంకా పలువురికి సుప్రభాతం పాడే రీతిలోకూడా విస్తరించింది.

తొణ్డరడిప్పొడి యాళ్వార్లు, మాణిక్కవాచకర్ మొదలైనవారికి తరువాతి కాలానికి చెందిన **తత్తువరాయర్, చిదంబరస్వామికళ్, శివప్రకాశర్, ఇరామలింగ శామికళ్** వంటివారు ఈ సాహిత్యప్రక్రియలో రచనలు చేశారు. తిరుప్పళ్ళి యెళ్ళుచ్చి రచనాసంవిధానంలో కాలక్రమేణ కొన్ని మార్పులుకూడా చోటు చేసికొన్నాయి కీర్తనల శైలిలో ఈ ప్రక్రియను భారతియార్ రచించారు. పల్లవి, అనుపల్లవి కూడిన మూడు చరణాలను కల గీతారూపంలో ఈ రచన చేయ బడింది. ఈ రీతిలో తిరుప్పళ్ళియెళ్ళుచ్చి నిత్యనూతనంగా వర్ధిల్లే సాహిత్యప్రక్రియ.

**తొణ్డరడిప్పొడి యాళ్వార్ల తిరుప్పళ్ళియెళ్ళుచ్చి ప్రభావం :**

తొణ్డరడిప్పొడి యాళ్వార్ల తిరుప్పళ్ళియెళ్ళుచ్చి ప్రభావం మాణిక్కవాచకర్ తిరుప్పళ్ళియెళ్ళుచ్చిలో కన్పిస్తున్నదనే అంశం పూర్వమే ప్రస్తావింపబడింది. ప్రతివాది భయంకరమ్అణ్ణన్ రచించిన వేంకటేశసుప్రభాతస్తోత్రంలో కూడా తిరుప్పళ్ళియెళ్ళుచ్చిలోని సూక్తుల భావాలు ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. **"కదిరవన్ కుణదిశైచ్చికరమ్ వన్దెడున్దాన్"** అనే సూక్త్యర్థాన్ని **"భాస్వానుదేతి"** అని, **"మడలిడై క్కీఱ్ఱు వణ్పాళైకళ్ నాఱ వైకఱై కూర్న్దదు మారుతమ్"** అనే సూక్త్యర్థం **"ఈషత్ప్రఫుల్ల సరసీరుహనారికేళ పూగద్రుమాదిసుమనోహరపాలికానామ్, ఆవాతి మందమనిలః సహ దివ్యగంధైః"** అని, **"తుమ్బురు నారదర్ పుకున్దర్"** అనే సూక్తిభావాన్ని **"తంత్రీ ప్రకర్షమధురస్వనయా విపంచ్యా గాయత్యనంతచరితం తవ నారదోఽపి"** అని అనుసంధింపబడడం ఇందుకు కొన్ని ఉదాహరణలు. ఈ రీతిలో తిరుప్పళ్ళియెళ్ళుచ్చిప్రభావం తరువాత కాలంలోని రచలనపై పడినది- అనే విషయం సుస్పష్టం.

## తిరుప్పళ్ళియెళుచ్చి ప్రబంధంలో దివ్యసూరిసూక్తుల అర్థసామ్యాలు కొన్ని

తిరుప్పళ్ళిఎళుచ్చి ప్రబంధంలో తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు అనుగ్రహించిన సూక్తులకు, మిగిలిన ఆళ్వార్ల దివ్యప్రబంధాలలోని సూక్తులకు మధ్య కన్పించే కొన్ని అర్థసామ్యాలు సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నాయి.

1. **ఇమైయవర్ పదినారు విడైయరుమివరో -(తిరుప్పళ్ళి-6)**
   **వెళ్ళేఱన్ నాన్ముకన్ ....పుళ్ళూర్‌ది కళల్ పణిన్దు -**
   **(తిరువాయ్‌మొళి-2-2-10)**

రాజసేవను చేసేవారు తమ తమ చిహ్నాలతో కూడివచ్చి సేవించేటట్లే శివుడు, చతుర్ముఖుడు మొదలైనవారుకూడా తమ తమ చిహ్నాలతో వచ్చి సేవిస్తారు- అనే సంగతిని ఈ రెండు సూక్తులు తెలుపుతున్నాయి. దీనివల్ల రాజాధిరాజైన సర్వేశ్వరుడు దేవతాంతరాలను సృష్టించాడని, వారికి ఆయా అధికారాలను, చిహ్నాలను ఇచ్చాడని, వారుకూడా తమ చిహ్నాలతో, పరివారంతో వచ్చి భగవానుని సేవిస్తారని తెలుపబడింది. కనుక, 'శ్రీమన్నారాయణుడే రాజాధిరాజు' అనే వేదార్థం విశదమైనది.

2. **ఇలజ్గైయర్‌కులత్తై వాట్టియ వరిశిలై -(తిరుప్పళ్ళి-4)**
   **అరక్కనై క్కిళ్ళి క్కళైన్దానై - (తిరుప్పావై-13)**

ఈ తిరుప్పళ్ళి ఎళుచ్చి సూక్తిలోని **"వాట్టియ"** అనే ప్రయోగాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై - **(వాట్టియ)** - **"వాట్టుకై"** అంటే - నిశ్శేషంగా వధించడం. బూడిద చేయడం. **"వాట్టియ"** అంటే భస్మం చేయడమనే అర్థమా? - అని అంటే, వీరపత్ని కనుక గోదాదేవి **"కిళ్ళికళైన్దానై"** అని అంటూ శత్రువధను భగవానుడు అవలీలగా చేసినట్లుగా తెలిపిన రీతిలోనే ఇక్కడకూడా శత్రునిరసనాన్ని అవలీలగా చేసినట్లు తెలుపడం కోసం **"వాట్టియ"** అని తొణ్డరడిప్పొడి అనుగ్ర హించారు'' అని వ్యాఖ్యానించడంవల్ల ఈ రెండు దివ్యప్రబంధాల సూక్తులలోని సామ్యం స్పష్టం.

3. నమ్మాళ్వార్లు తిరువిరుత్త ప్రబంధాన్ని **"అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్"** అని ఆరంభించి, **"మాఱన్ విణ్ణప్పమ్ శెయ్య"** అని ముగించారు. గోదాదేవి తిరుప్పావై ప్రబంధాన్ని **"నమక్కే పఱై తరువాన్"** అని ఆరంభించి, **"అజ్గప్పఱై**



**కొణ్డ వాళ్రై"** అని ముగించారు. ఇదేరీతిలో, తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు తిరుప్పళ్ళియెళుచ్చి ప్రబంధాన్ని **"కదిరవన్ కుణదిశై చ్చికరమ్ వన్దెడున్దాన్"** అని ఆరంభించి, **"కతిరవన్ కనైకడల్ ముళైత్తనన్"** అని ముగించారు. ఈ విధంగా ఈమూడు ప్రబంధాలలోని ఉపక్రమోపసంహారాల అర్థైక్యం గమనించదగినది.

సహృదయావర్జకాలైన ఇటువంటి అర్థసామ్యాలు ఇంకా చాలా ఉన్నాయి.

## తిరుప్పళ్ళియెళుచ్చి వ్యాఖ్యానాలు

ఉపదేశత్తినమాలై ప్రబంధంలో శ్రీమణవాళమహామునులు **"నఞ్జీయర్ శెయ్‌ద వియాక్కియైకళ్ నాలిరణ్డుక్కు"** -అని పల్కిన సూక్తిని శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ **"నాలిరణ్డుక్కు ఎన్గు సంఖ్యానిర్దేశమన్దు. ఒరు ముళుచ్చొల్ ఇరుక్కిఱపడి. అతావతు - అల్పత్తిలే తాత్పర్యమ్. మేలుమ్ "శిల" ఎన్నిటే అరుళిచ్చెయ్‌తతు. ఇవర్‌తామ్ శెయ్‌దరుళినతాయ్ కణ్డతు తిరుప్పావైక్కుమ్, కణ్ణినుణ్ శిఱుత్తామ్బుక్కుమిటే ఉళ్ళతు. పిన్నైయు ముణ్డాకిల్ కణ్డుకొళ్వదు"** (**"నాలిరణ్డు"**- అని సంఖ్యానిర్దేశం కాదు. ఇది ఏకపదం. అంటే- అల్పసంఖ్యలో తాత్పర్యం. పైనకూడా **"శిల"** అని కదా అన్నారు. వీరు రచించినవిగా చూచిన (గమనించిన) వ్యాఖ్యలు తిరుప్పావైకు, కణ్ణినుణ్‌శిఱుత్తామ్బుకు కదా ఉన్నాయి. ఇంకా ఏమైనా ఉన్నాయేమో చూడాలి.) అని వివరించినందున శ్రీపిళ్ళైలోకమ్ జీయర్‌కాలం నాటికి నఞ్జీయర్ తిరుప్పళ్ళియెళుచ్చివ్యాఖ్య ప్రసిద్ధం కాలేదు- అని తెలుస్తున్నది. **"పిన్నైయుమ్ ఉణ్డాకిల్ కణ్డుకొళ్వదు"** (ఇంకా ఉంటే చూడాలి) అని అన్నందున మఱికొన్ని నంజీయర్ వ్యాఖ్యలు ఉండి ఉండవచ్చుననే అభిప్రాయాన్ని పిళ్ళైలోకమ్‌జీయర్ వ్యక్తం చేసినట్లయినది. విశేషమేమంటే - నంజీయర్ రచించిన తిరుప్పావైవ్యాఖ్య పిళ్ళైలోకమ్ జీయర్‌కాలంనాటికి లభ్యమై ఉండగా, అది ఈనాడు అలభ్యం కావడం.

నంజీయర్ వ్యాఖ్యలో ఎన్నో విశేషాలు గోచరిస్తాయి. **"అయోత్తి ఎమ్ అరశే! అరజ్గత్తమ్మా !"** అనే సంబోధనలోని స్వారస్యాన్ని- **"తిరువయోధ్యైయిలుమ్ కాట్టిల్ కోయిలై విరుమ్బిన సర్వాధికరాన దేవరీర్"** (అయోధ్యా నగరంలోకంటే శ్రీరంగంలో ఎక్కువ అభిమానాన్ని కలిగిన దేవరవారు) అని వివరించడం ఈ వ్యాఖ్యలోనే గోచరిస్తుంది. **"కతిరవన్ కుణదిశై చ్చికరమ్ వన్దెడున్దాన్"** అనే సూక్తిలోని

విశేషార్థాన్ని- **"అడియిలుమ్ ముడియిలుమ్ ఆదిత్యర్కళ్ వన్దు నిఱ్కు నడువే కిడన్దు కణ్వళర్న్దరుళకిఅదెన్?"** (శ్రీచరణాలు ఉండే దిక్కు అయిన తూర్పులో సూర్యుడు, శిరస్సుపై వేయి సూర్యులవలె వెలిగే కిరీటం- ఈవిధంగా శ్రీచరణాలవద్ద, శిరస్సువద్ద ఆదిత్యులు ప్రకాశిస్తూ ఉండగా మధ్యలో నీవు శయనించి ఎందుకు నిద్రిస్తున్నావు?) అనే వివరణ సరసంగా అనుగ్రహింపబడింది. ఇటువంటి విశేషార్థాలు ఇంకా చాలా ఉన్నాయి.

ఆళ్వార్ల దివ్యప్రబంధాలకు అన్నిటికి రస్యరహస్యార్థమధురాలైన వ్యాఖ్యలను మణిప్రవాళశైలిలో అనుగ్రహించిన పరమకారుణికులు, వ్యాఖ్యాతృ చక్రవర్తి పెరియవాచ్చాన్పిళ్ళై ఈ ప్రబంధానికికూడా గొప్ప వ్యాఖ్యను కృపజేశారు. ఇందులో అడుగడుగునా ఎన్నో విశేషార్థాలున్నాయి. భగవానునకు సుప్రభాతాన్ని పల్కడంలోని సామంజస్యాన్నిగూర్చి విచారిస్తూ, ఇది స్వరూపజ్ఞానాన్ని విశదతమంగా కల్గినవారు చేసే ఆత్మస్వరూపానుగుణమైన కైంకర్యంలో అంతర్భవిస్తుందని సప్రమాణంగా, సోదాహరణంగా నిరూపించడం, చివరి పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ, ప్రబంధంలోని ఉపక్రమ- ఉపసంహారాలలోని విషయైక్యాన్ని నిరూపించడం, నాల్గవ అయిదవ పాశురాలలోని **"వయలుళ్ ఇరిన్దన శురుమ్బినమ్"** అని, **"పులమ్బిన పుట్కళుమ్ పూమ్ పొழిల్ కణిన్వాయ్"** అని రెండు చోట్ల పక్షులు నిద్రలేవడాన్ని గూర్చి ప్రస్తావించడంలోని స్వాపదేశార్థాన్ని వివరించడం (ఈ వివరణను అయిదవ పాశురవ్యాఖ్యలో గమనించవచ్చు) మొదలైన అద్భుతమైన వివరణలు సహృదయ హృదయాలను రంజింపచేస్తాయి. ఎన్నో పూర్వాచార్యకృతులు కాలగర్భంలో కలిసిపోయినా, పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యలు ఈనాటికీ మనకు అందడం నిజంగా మన భాగ్యవిశేషంగా భావించాలి కదా!

ప్రస్తుతగ్రంథముద్రణ గూర్చి :-

ఉత్తరాంధ్ర ప్రాంతంలో, విశేషించి విజయనగంలో, శ్రీవైష్ణవసంప్రదాయ ప్రచారాన్ని అద్వితీయంగా నిర్వహించిన మహనీయులు ఉ.వే.శ్రీమాన్ కందాళ **వేంకటాచార్యస్వామివారు.** వీరు చేసిన కృషిని చూచి కులపతి ఉ.వే.శ్రీమాన్ తె.కం. **గోపాలాచార్యస్వామివారు** ఎంతో ప్రశంసించారు. శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారి తరువాత వారి రెండవ కుమార్తె, విదుషీమణి, **శ్రీమతి కె.వి. జానకమ్మగారు**



పితృపాదులు చూపిన మార్గాన్ని అనుసరిస్తూ మఱింత వైభవంతో చేసే సంప్రదాయాభివృద్ధి శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారు, శ్రీమాన్ రంగ **రామానుజాచార్యస్వామివారి** వంటి పలువురు పెద్దల మంగళాశాసనాలను పొందుతున్నది. విజయనగరంలోని త్రైవర్ణికవైష్ణవరామానుజకూటం గతంలో శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారి, ప్రస్తుతం జానకమ్మగారి మార్గదర్శకత్వంలో సనాతన ధర్మప్రచారానికి, భగవద్రామానుజసంప్రదాయవ్యాప్తికి కావిస్తున్న అవిరళకృషి సర్వథా శ్లాఘనీయం. ఈ రామానుజకూటం అధ్యక్షులుగా సమర్థవంతంగా బాధ్యతలను నిర్వహిస్తున్నవారు, భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠులైన **శ్రీమాన్ దాసరి కృష్ణాజీగారు.** వీరు ఇపుడు అఱువై వసంతాలను పూర్తి చేసికొని, షష్ట్యబ్దపూర్తిమహోత్సవాన్ని ఈ ఏడు డిశంబరు 10వ తేదీన జరుపుకోవడం చాలా ఆనందదాయకం. ఈ సందర్భంలో శ్రీమతి విమలమ్మ, **శ్రీమాన్ కృష్ణాజీదంపతులు** సకుటుంబంగా, సపరివారంగా అన్నివిధాల ఉత్తరోత్తరాభివృద్ధిని శ్రియఃపతి అనుగ్రహంవల్ల పొంది, పూర్వంవలె భగవద్భాగవతాచార్య కైంకర్యాన్ని చేసికొంటూ **"పశ్యేమ శరదశ్శతమ్"** అని వేదపురుషుడు పల్కిన రీతిలో శతాయుష్కులు కావాలని మనఃపూర్వకంగా మంగళాశాసనాలను చేస్తున్నాను. (వీరు రామానుజకూట భవనపునర్మిణానికి కావించిన కృషి ప్రశంసనీయం.) శ్రీకృష్ణాజీగారు తమ షష్ట్యబ్దపూర్త్యుత్సవ జ్ఞాపికగా తిరుప్పళ్ళిఎழுచ్చి ప్రబంధాన్ని పూర్వాచార్య వ్యాఖ్యానసహితంగా, భావదీపిక ఆంధ్రవివరణతో ముద్రించడం స్పృహణీయం, అభినందనీయం. చాలా కాలంగా దుర్లభమైన ఈ గ్రంథాన్ని తిరిగి ప్రకాశింపజేయవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉన్నది. వీరిని ఈ ప్రయత్నంలో ప్రోత్సహించిన శ్రీమతి జానకమ్మగారికి హార్దిక కృతజ్ఞతలు. ఈ గ్రంథాన్ని కటాక్షించి తమ అమూల్య మంగళాశాసనాలను కృపజేసిన మహనీయులు శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ **జీయర్స్వామివారి** సన్నిధిలో, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ **జీయర్స్వామివారి సన్నిధిలో, పితృపాదులు, న్యాయవేదాంత విద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారి సన్నిధిలో, మాతులచరణులు, పండితరత్న,** ఉ.వే.శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారి సన్నిధిలో, శాస్త్రరత్నాకర, ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి. రంగరామానుజాచార్యస్వామివారి సన్నిధిలో సవినయంగా సాష్టాంగ ప్రణామాలను సమర్పించుకుంటున్నాను. గ్రంథాన్ని సకాలంలో డి.టి.పి.

చేసి సహకరించిన శ్రీమతి ఎ.యస్. జయలక్ష్మిగారికి, శ్రీచంద్రశేఖర్‌గారికి, ముద్రణబాధ్యతను అందంగా నిర్వహించిన శ్రీహర్షవర్ధన్ గారికి హార్దికాభి నందనలు. తిరుప్పళ్ళి ఎఴుచ్చికి గల నంజీయర్, పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యలను అనుసరిస్తూ ద్రావిడభాషలో శ్రీమాన్ ఎన్. కృష్ణస్వామి అయ్యంగార్ (శ్రీసుదర్శన పత్రికా సంపాదకులు, పుత్తూర్ అగ్రహారం, తిరుచ్చి) రచించి ముద్రించిన వివరణ గ్రంథం చాలా ఉపయోగపడింది. తిరుప్పళ్ళిఎఴుచ్చి అనే ద్రావిడ ప్రక్రియను గూర్చిన కొన్ని అంశాలు శ్రీమాన్. ఎం. శ్రీనివాసన్‌గారు రచించిన **"తమిఴ్ ఇలక్కణ వరలాఱు"** అనే గ్రంథంనుండి గ్రహింపబడ్డాయి. ఈ మహనీయులిద్దఱికి సవినయంగా కార్తజ్ఞ్యావిష్కరణను చేసికొంటున్నాను. దాసుని భావదీపికవివరణలో దొర్లిన స్ఖాలిత్యాలను వాత్సల్యంతో సహృదయపాఠకులు క్షమిస్తారని ఆశిస్తూ, సెలవు తీసికొంటున్నాను. స్వస్తి.

జయతు జయతు నిత్యం భక్తపద్రేణుసూరిః
జయతు జయతు దివ్యం తత్కృతం సుప్రభాతమ్ ।
జయతు జయతు తస్య వ్యాకృతిః కృష్ణసూరేః
జయతు జయతు పూర్వాచార్యభావజ్ఞగోష్ఠీ ॥

కృతినౌ శ్రీవిమలాంబా కృష్ణాజీ దంపతీ సదా ।
వర్ధేతాం సకుటుంబం శ్రీపతేః కరుణయా శ్రియా ॥

జయతు సదా రామానుజసిద్ధాంతః పరమవైదికో జగతి ।
జయతు తరాం త్రైవర్ణికవైష్ణవగోష్ఠీ విజయపురే సతతమ్ ॥

తిరుపతి
24-11-2012

ఇట్లు నివేదించు
భాగవతవిధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**



**శ్రీమతే రామానుజాయ నమః**



తొణ్డరడిప్పొడి ఆఴ్వార్లు అనుగ్రహించిన

# తిరుప్పళ్ళియెఴుచ్చి

## తిరుమాలై ఆణ్డాన్ అనుగ్రహించిన తనియన్

1. తమేవ మత్వా పరవాసుదేవం
రఙ్గేశయం రాజవదర్హణీయమ్ ।
ప్రాబోధికీం యోఽకృత సూక్తిమాలాం
భక్తాఙ్ఘ్రిరేణుం భగవన్తమీడే ॥

## తిరువరఙ్గ పెరుమాళ్ అరైయర్ అనుగ్రహించిన తనియన్

2. మణ్డఙ్గుడి యెన్బర్ మామఱైయోర్ మన్నియ శీర్,
తొణ్డరడిప్పొడి తొన్నకరమ్, వణ్డు
తిణర్త్త వయల్ తెన్నరఙ్గత్తమ్మానై, ప్పళ్ళి
యుణర్త్తుమ్ పిరానుతిత్త వూర్.

1. కతిరవన్ కుణతిశై చ్చికరమ్ వన్దణైన్దాన్
కనవిరుళకన్దతు కాలైయమ్బొఴుతాయ్
మతువిరిన్దొఴుకిన మామలరెల్లామ్
వానవరరశర్‌కళ్ వన్దు వన్దీణ్డి
ఎతిర్‌తిశై నిఱైన్దనర్ ఇవరొడుమ్ పుకున్ద
ఇరుఙ్గళిఱ్ఱీట్టముమ్ పిడియొడు మురశుమ్
అతిర్‌తలిల్ అలైకడల్ పోన్ఱుళతెఙ్గుమ్
అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెఴున్దరుళాయే

2. కొఴుఙ్గొడి ముల్లైయిన్ కొఴు మలరణవి
    క్కూర్న్దతు కుణతిశై మారుత మితువో
ఎఴున్దన మలరణై ప్పళ్ళికొళ్ళన్నమ్
    ఈన్బని ననైన్ద తమిరుమ్ శిఱకుతఱి
విఴుఙ్గియ ముతలైయిన్ పిలమ్బురై పేఴ్వాయ్
    వెళ్ళెయిఱుఱ అతన్ విడత్తినుక్కనుఙ్గి
అఴుఙ్గియ వానైయిన్ అరున్దుయర్ కెడుత్త
    అరఙ్గత్తమ్మా! పళ్ళి యెఴున్దరుళాయే

3. శుడరొళి పరన్దన శూఴ్ తిశై యెల్లామ్
    తున్నియ తారకై మిన్నొళి శురుఙ్గి
పడరొళి పశుత్తనన్ పనిమతి యివనో
    పాయిరుళకన్ఱతు పైమ్బొఴిఱ్కముకిన్
మడలిడై క్కీఱి వణ్ పాళైకళ్ నాఱ
    వైకఱై కూర్న్దతు మారుత మితువో
అడలొళి తికఴ్తరు తికిరియమ్ తడక్కై
    అరఙ్గత్తమ్మా! పళ్ళి యెఴున్దరుళాయే

4. మేట్టిళ మేతికళ్ తళైవిడుమాయర్కళ్
    వేయ్ఙ్గుఴలోశైయుమ్ విడైమణి క్కురలుమ్
ఈట్టియ విశైతిశై పరన్దన వయలుళ్
    ఇరిన్దన శురుమ్బిన మిలఙ్గైయర్కులత్తై
వాట్టియ వరిశిల వానవరేఱే !
    మామునివేళ్వియై క్కాత్తు అవపిరతమ్
ఆట్టియ వడుతిఱ లయోత్తి యెమ్మరశే !
    అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెఴున్దరుళాయే

5. పులమ్బిన పుట్కళుమ్ పూమ్బొఴిల్కళిన్ వాయ్
    పోయిఱ్ఱు క్కఙ్గుల్ పుకున్దతు పులరి



కలన్దతు కుణతిశై క్కనైకడలరవమ్
    కళివణ్డు మిఴఱ్ఱియ కలమ్బకమ్ పునైన్ద
అలఙ్గలమ్ తొడైయల్ కొణ్డు అడియిణై పణివాన్
    అమరర్కళ్ పుకున్దనర్ ఆతలిలమ్మా!
ఇలఙ్గైయర్కోన్ వఴిపాడు శెయ్ కోయిల్
    ఎమ్బెరుమాన్! పళ్ళి యెఴున్దరుళాయే

6. ఇరవియర్ మణినెడుమ్ తేరొడు మివరో
    ఇఱైయవర్ పతినొరు విడైయరు మివరో
మరువియ మయిలినన్ అఱుముకనివనో
    మరుతరుమ్ వశుక్కళుమ్ వన్దు వన్దీణ్డి
పురవియోడాడలుమ్ పాడలుమ్ తేరుమ్
    కుమరదణ్డమ్ పుకున్దీణ్డియ వెళ్ళమ్
అరువరై యనైయ నిన్ కోయిల్మున్నివరో
    అరఙ్గత్తమ్మా! పళ్ళి యెఴున్దరుళాయే

7. అన్దరత్తమరర్కళ్ కూట్టఙ్గళివైయో
    అరున్దవ మునివరుమ్ మరుతరు మివరో
ఇన్దిరనానైయుమ్ తానుమ్ వన్దివనో
    ఎమ్బెరుమాన్ ఉన కోయిలిన్ వాశల్
శున్దరర్ నెరుక్క విచ్చాతరర్ నూక్క
    ఇయక్కరుమ్ మయఙ్గినర్ తిరువడి త్తొఴువాన్
అన్దరమ్ పారిడమిల్లై మఱ్ఱితువో
    అరఙ్గత్తమ్మా! పళ్ళి యెఴున్దరుళాయే

8. నమ్బువిఴ్ వానవర్ వాయుఱై వఴఙ్గ
    మానితి కపిలై యొణ్కణ్ణాడి ముతలా
ఎమ్బెరుమాన్ పడిమైక్కలమ్ కాణ్డఱ్కు
    ఏఱ్పనవాయిన కొణ్డు నన్మునివర్

తుమ్బురు నారదర్ పుకున్దనరివరో
తోన్రిన నిరవియుమ తులఙ్గొళి పరప్పి
అమ్బరతలత్తిల్ నిన్రకల్కిన్రతిరుళ్ పోయ్
అరఙ్గత్తమ్మా! పళ్ళి యెళున్దరుళాయే.

9. ఏతమిల్ తణ్ణుమై యెక్కమ్ మత్తళి
యాళ్కుళల్ ముళవమోడు ఇశైతిశై కెళుమి
కీతఙ్గళ్ పాడినర్ కిన్నరర్ కరుడర్కళ్
కన్దరువరుమివర్ కఙ్గులు ళెల్లామ్
మాతవర్ వానవర్ శారణర్ ఇయక్కర్
శిత్తరుమ్ మయఙ్గినర్ తిరువడిత్తొళువాన్
అతలిల్ అవర్క్కు నాళోలక్క మరుళ
అరఙ్గత్తమ్మా! పళ్ళి యెళున్దరుళాయే

10. కడిమలర్ క్కమలఙ్గళ్ మలర్న్దన వివైయో
కతిరవన్ కనైకడల్ ముళైత్తననివనో
తుడియిడైయార్ శురికుళల్ పిళిన్దుతఱి
తుకిలుడుత్తేఱినర్ శూళ్పునలరఙ్గా!
తొడైయొత్త తుళవముమ్ కూడైయుమ్ పొలిన్దు
తోన్రియతోళ్ తొణ్డరడిప్పొడి యెన్నుమ్
అడియనై యళియనెన్రరుళి ఉన్నడియార్క్కు
ఆట్పడుత్తాయ్ పళ్ళి యెళున్దరుళాయే

తిరుప్పళ్ళియెళుచ్చి సంపూర్ణమ్

తొణ్డరడిప్పొడి ఆళ్వార్ తిరువడికళే శరణమ్



శ్రీమతే రామానుజాయ నమః



తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు అనుగ్రహించిన

# తిరుప్పళ్ళియెళుచ్చి

## తిరుమాలై యాణ్డాన్ అనుగ్రహించిన తనియన్

తమేవ మత్వా పరవాసుదేవం
రఙ్గేశయం రాజవదర్హణీయమ్ ।
ప్రాబోధికీం యోஉకృత సూక్తిమాలాం
భక్తాఙ్ఘ్రిరేణుం భగవన్తమీడే ॥

యః =ఏ తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు, రాజవత్ = ప్రభువువలె, అర్హణీయం= పూజించదగినవాడు, రంగేశయం = శ్రీరంగంలో శయనించి ఉండేవాడైన శ్రీరంగనాథుని, తం పరవాసుదేవమ్ ఏవ = ఆ పరవాసుదేవునిగానే, మత్వా = తలచి, ప్రాబోధికీం = తిరుప్పళ్ళి ఎళుచ్చి అనే ప్రబంధాన్ని (మేల్కొలుపు ప్రబంధాన్ని), అకృత = అనుగ్రహించారో, (తం = అటువంటి) భగవంతం = జ్ఞానాది గుణాలను పూర్ణంగా ఆటింటిని కల్గిన, భక్త+అంఘ్రిరేణుం = తొణ్డరడిప్పొడి ఆళ్వార్లను, ఈడే = స్తుతిస్తున్నాను.

## పిళ్ళైలోకమ్ జీయర్ అరుళిచ్చెయ్త తిరుప్పళ్ళియెళుచ్చి త్తనియన్ వ్యాఖ్యానమ్

అవతారికై. (తమేవ మత్వేత్యాది) ఇశ్లోకత్తిల్. "శెయ్యుమ్ పశుమ్ తుళవత్తొళిల్ మాలైయై" ఎప్పోతుమ్ శెయ్తు పోరువారాయ్, విశేషిత్తు "శెన్దమిళిల్ పెయ్యుమ్ మఱైత్తమిళ్ మాలైయుమ్ పేరాత శీరరఙ్గత్తైయన్ కళుక్కణియు" మవరాన తొణ్డరడిప్పొడియాళ్వారై స్తుత్యభివాదమ్ పణ్ణుమ్బడి శొల్లుకిఱతు. తిరుమాలై ఎన్గిఱ దివ్యప్రబన్ధమన్రిక్కే, తిరుప్పళ్ళియెళుచ్చియైయుమ్ "ప్రాబోధికీం యోஉకృత సూక్తిమాలామ్" ఎన్రు శొన్నాలైయాకవితే శొల్లువతు; ఇతుతాన్ - తిరుప్పళ్ళియెళుచ్చి త్తనియనాయాయ్త్తిరుప్పతు.

వ్యాఖ్యానమ్ :- (రాజవదర్హణీయం రఙ్గేశయం పరవాసుదేవం మత్వా) అతావతు- రాజవత్పూజ్యరాయ్, శ్రీరఙ్గరాజధానియిలే కణ్వాళర్న్దరుళుమవరాన శ్రీరఙ్గరాజరై శ్రుతిప్రసిద్ధరాన పరవాసుదేవరాకవే ప్రతిపత్తిపణ్ణి- ఎన్నపడి. రాజవదర్హణీయరాకై యావతు- రాజవత్పూజ్యర్ -ఎన్నపడి. రాజాధిరాజరాన చక్రవర్తి త్తిరుమకనారాలుమ్ ఆరాధనీయరాయిరుక్కై.

(రఙ్గేశయమ్) అతావతు- "శెరువిలే యరక్కర్కోనై చ్చెఱ్ఱ నమ్ శేవకనార్ మరువియ పెరియకోయిల్" ఎన్నుమ్, "పునరపి పురస్కర్తుం శ్రీరఙ్గిణః ఫణిపుఙ్గవే" ఎన్నుమ్, "అరఙ్గత్తరవణై ప్పళ్ళియాన్" ఎన్నుమ్ పేశుమ్బడి అరఙ్గమ్ తన్నుళ్ పామ్బణై ప్పళ్ళికొళ్ళుకై. ఇప్పడి పడుక్కైవాయ్ప్పాలే పళ్ళికొణ్డరుళుమ్ పెరియపెరుమాళై.

(తం పరవాసుదేవం మత్వా) - "వాసుదేవోఽసి పూర్ణః" ఎన్గిఱ అన్ద పరవాసు దేవరాకవే బుద్ధిపణ్ణి. ఇఙ్గుత్తైయిఱ్పడియై విచారియాతే అఙ్గుత్తైయిఱ్పడియాకవే అనుసన్ధిత్తు, "అతియమ్శోతి యురువై యఙ్గువైత్తిఙ్గు ప్పిఱన్ద" ఎన్నుమ్, "నెఞ్జినాల్ నినైప్పాన్ యవన్ అవనాకుమ్ నీళ్కడల్వణ్ణన్" ఎన్నుమ్ శొల్లక్కడవతిఱే. "కడలిడఙ్గొణ్డ కడల్వణ్ణ"రిఱే, పెరియపెరుమాళ్. ఆకైయాల్ పూర్ణషాడ్గుణ్యరాయ్, సర్వమ్ పూర్ణమాయాయ్త్తు ఇఙ్గుత్తైయిల్ అవర్ పడియిరుప్పతు. అత్తాలే "యావరుమ్ వన్దడి వణఙ్గ"మ్బడి సర్వసమాశ్రయణీయమాయాయ్త్తు ఇవ్విషయమిరుప్పతు.

అవధారణత్తాలే - కైఙ్కర్యమ్ పణ్ణు మిడత్తు "ముకప్పే కూవి" "క్రియతామితి" ఎన్ఱు ఏవిక్కొణ్డు "వానాడమరుమ్ కుళిర్విழி"కళాలే ఎతిర్విழி కొడుక్కుమ్ విషయమాకవే ఇవరై బుద్ధి పణ్ణి, "ఆతిమూర్త్తి యరఙ్గమానకరుళానే!" ఎన్నుమ్, "ఇన్దిర లోకమాళు మచ్చువై పెఱినుమ్ వేణ్డేన్ అరఙ్గమానకరుళానే!" ఎన్నుమన్నో ఇవ్విషయత్తిలే ఇవర్ మణ్డియిరుప్పతు. "రాజవదర్హణీయం తం రఙ్గేశయమ్" ఎన్ఱు ఇఙ్గుత్తైయిల్ సౌలభ్యప్రసిద్ధియై చ్చొల్లుకిఱతాకవుమామ్.

"పరవాసుదేవమ్" ఎన్నైయాలే - వ్యూహవాసుదేవరిల్ వ్యావృత్తిశొల్లుకిఱతు. "ఆత్మానం వాసుదేవాఖ్యం చిన్తయన్ మధుసూదనః" ఎన్నుమ్బడి "ఇవళ్ తిఱత్తెన్ శిన్దిత్తాయే?" ఎన్నుమ్, "ఉఱఙ్గువాన్బోల్ యోకు శెయ్త పెరుమానై" ఎన్నుమ్ వ్యూహసౌహార్దముముణ్డిఱే ఇఙ్గు. ఇవర్ పరిపూర్ణానుభవమ్ పణ్ణుమ్ పరవిషయ మాకవే పెరియపెరుమాళై ప్రీతిపణ్ణి యిరుప్పరాయ్త్తు. "కావేరీ విరజా సేయం వైకుణ్ఠం రఙ్గమన్దిరమ్, స వాసుదేవో రఙ్గేశః ప్రత్యక్షం పరమం పదమ్" ఎన్నక్కడవతిఱే.



"అణ్డర్కోన్ అణియరఙ్గన్" ఎన్నుమ్, "వడివుడైవానోర్ తలైవనే ! యెన్నుమ్ వణ్తిరువరఙ్గనే!" ఎన్నుమ్, "పొఙ్గోతమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాతుమ్ శోరామే యాళ్కిన్ఱ ఎమ్బెరుమాన్ శెఙ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనార్" ఎన్నుమ్ అడియరిఱివార్ అనుసన్ధిత్తార్కళ్.

విశేషిత్తు కోయిలిల్ తిరుద్వాదశాక్షరి ప్రధానమాయిఱే తిరువారాధనమ్ కొణ్డరుళువతు. "ద్వాదశాక్షరమన్త్రోఽయం మన్త్రాణాం రాజ ఉచ్యతే" ఎన్గిఱ పడియే, "శ్రీరఙ్గనాథ, జగన్నాథ" ఎన్నుమ్బడి అర్చ్యరాన ఇవరుమ్ సర్వర్క్కుమ్ రాజావాయిరుప్పర్; ఇఙ్గుమ్ "రావదర్హ ణీయమ్" ఎన్నతిఱే. ఆకైయాలే రాజాక్కళై ప్పళ్ళియుణర్త్తుమాపోలే అన్ద రాజాక్కళుక్కుమ్ రాజావాన శ్రీరఙ్గరాజరై త్తిరుప్పళ్ళియుణర్త్తినపడి శొల్లుకిఱతు.

(ప్రాబోధికీం సూక్తిమాలాం యః అకృత తం భగవన్తం భక్తాఙ్ఘ్రిరేణుమీడే) ఎన్గిఱతు - అఙ్గుత్తైక్కు అనురూపమాయిరుప్పతాయ్, శ్రావ్యమాయ్, తిరుప్పళ్ళి యుణర్త్తుమతాన పామాలైయై యారొరుత్తర్ పణిత్తార్; అప్పడిపట్ట వైభవత్తై యుడైయరాయ్, జ్ఞానాదిగుణపరిపూర్ణరాన తొణ్డరడిప్పొడియాழ்వారై స్తుతిత్తు త్తొழுకిఱేనెన్గిఱతు. ఈడే - ఎన్గిఱ శబ్దమ్ ఇరణ్డైయుమ్ వచిక్కక్కడవతు.

రాజావదర్హణీయనాకైయాలే రాజవదుపచారమామ్బడి తిరుప్పళ్ళియుణర్త్త వేణుమిఱే. "అయోత్తియెమ్మరశే! యరఙ్గత్తమ్మా! పళ్ళి యెழுన్దరుళాయే" ఎన్నిఱే ఇవర్ తిరుప్పళ్ళి యుణర్త్తువతు. "శ్రీమతా రాజరాజేన", "రాజాధిరాజ స్సర్వేషామ్" ఎన్నుమ్బడియాన పెరియపెరుమాళై, "వీర ! సౌమ్య ! విబుధ్యస్వ కౌసల్యానన్దవర్ధన !", "కౌసల్యాసుప్రజా! రామ! పూర్వా సన్ధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల!" ఎన్ఱు వన్దికళ్ ఉణర్త్తుమాపోలే అవర్క్కుమ్ పెరియపెరుమాళాయ్, ప్పెరియపెరుమాళాన శ్రీరఙ్గరాజరైయిఱే ఇవర్ తిరుప్పళ్ళి యుణర్త్తువతు.

ఇవర్తామ్ ఇప్ప్రబన్ధత్తిలే కాలాతిక్రమమాన వడివైయుమ్, బ్రహ్మాది దేవతైకళ్ సావధానరాయ్ వన్దు తిరువాశలిలే కాత్తు నిఱ్కిఱ పడియైయుమ్, అఙ్గుత్తైయిల్ సమ్మర్దత్తైయుమ్, తిరుప్పళ్ళియుణర్న్దాల్ కణ్డరుళుమ్బడి మఙ్గళవస్తుక్కళ్ పారిత్తపడియైయుమ్ మఙ్గళవాద్యఙ్గళ్ ముழఙ్గుకిఱ పడి

యైయుమ్, మఙ్గళదీపమ్బోలే ఆదిత్యనుదిత్తుత్తో*ற்ற*ు, అతిల్ అరవిన్దఙ్గళ్ దీపికైపోలే వికసిత్తపడియైయుమ్ శొల్లియితే తిరుప్పళ్ళియుణర్త్తుకిఱతు. ఇవై యెల్లామ్ రాజవదర్హణీయతైక్కు ఏఱ్కుమ్బడియాయాయ్త్తిరుప్పతు.

(రఙ్గేశయం ప్రాబోధికీం సూక్తిమాలామకృత) -ఎన్నైయాలే అడిక్కడి "అరఙ్గత్తమ్మా! పళ్ళి యె*ழு*న్దరుళాయే" ఎన్ఱుమ్, విశేషిత్తు "ఇలఙ్గైయర్ కోన్ వ*ழி*పాడు శెయ్ కోయిల్ ఎమ్బెరుమాన్ పళ్ళి యె*ழு*న్దరుళాయే" ఎన్ఱుమితే అరుళిచ్చెయ్‌తతు. "ప్రాబోధికీం సూక్తిమాలామ్" ఎన్నైయాలే తిరుప్పళ్ళియె*ழு*చ్చి యాకిఱ శొన్మాలైయైయితే ఇవర్ శొల్లి*ற்ற*ు. తిరుమాలైయుమ్ సూక్తిమాలైయితే; అతిలుమ్ "ఎన్నై నోక్కాతొ*ழி*వతే", "అళియ నమ్ పైయలెన్నార్" ఎన్గితే ఆలోకనాలాపాదికళై అపేక్షిత్తతు. అతిల్, "కిడన్దతోర్ కిడక్కై" ఎన్ఱు కిడైయ*ழு*కై యనుభవిత్తు, నడైయ*ழு*కు తొడక్కమానవ*ற்ற*ై క్కణ్డనుభవిక్క త్తుయిలె*ழு* పాడుకిఱార్. ఇరణ్డుమ్ పెరియపెరుమాళై ప్రతిపాదిత్త ప్రబన్ధమితే. ఆకైయాలే, "సూక్తిమాలామ్" ఎన్గిఱతిలే ఇరణ్డుమన్తర్భూతమ్.

భగవన్తమెన్నైయాలే జ్ఞానాదికళై చ్చొల్లి, జ్ఞానఫలమ్ తదీయశేషత్వమెన్నతు తో*ற்ற*ు "భక్తాఙ్ఘ్రిరేణుమ్" ఎన్గిఱతు. అవరుమ్ "అడియార్క్కాట్పడుత్తాయ్" ఎన్ఱుమ్, "తుళవత్తొణ్డాయ తొల్ శీర్ తొణ్డరడిప్పొడి" ఎన్ఱుమితే తలైక్కట్టి*ற்ற*ు. "తొడైయొత్త తుళవముమ్ కూడైయుమ్ పొలిన్దు తోన్ఱియ తోళ్ తొణ్డరడిప్పొడి" ఎన్నైయాలే- తిరుప్పళ్ళి యుణర్త్తి "శూట్టు నన్మాలై" యిఱ్పడియే భాగవత ముఖోల్లాసహేతువాన భగవత్కైఙ్కర్యత్తై ప్రార్థిత్తార్ అవర్. ఈడే -ఎన్ఱు- ఇతిల్ అవర్ విషయత్తిల్ వాచికకాయిక రూపకైఙ్కర్యత్తై చ్చొల్లి త్తలైక్కట్టుకిఱతు.

## భావదీపిక వివరణం

అవతారిక : తిరుప్పళ్ళి ఎ*ழு*చ్చి అనే దివ్యప్రబంధానికి చెందిన ఈ మొదటి తనియన్‌ను భగవద్రామానుజులకు తిరువాయ్‌మొ*ழி* దివ్యప్రబంధంయొక్క అర్థాన్ని అనుగ్రహించిన తిరుమాలైయాణ్డాన్ అనే పూర్వాచార్యులు అనుగ్రహించారు. సంస్కృతంలో శ్లోకరూపంగా రూపొందిన ఈ తనియన్‌లో- **"శెయ్యుమ్ పశుమ్ తుళవత్తొ*ழி*ల్ మాలైయుమ్, శెన్దమి*ழி*ల్ పెయ్యుమ్ మఱైత్తమి*ழி*ల్ మాలైయుమ్, పేరాద శీర్ అరఙ్గత్తైయ్యన్ క*ழு*ల్కణియుమ్ పరన్"** (ఇరామానుశ -13) (తమచే కూర్చబడిన పచ్చని తులసీమాలికను, అందమైన ద్రావిడభాషలో



రచింపబడిన వేదరూపమైన ద్రావిడపాశురమాలికను నిత్యమైన కల్యాణగుణాలను కల శ్రీరంగనాథుని శ్రీచరణాలలో సమర్పించే శేషత్వంలో గొప్పవారు) అని అముదనార్ అనుగ్రహించిన రీతిలో శ్రీరంగనాథునకు తులసీమాలను కూర్చడమే కైంకర్యంగా కలవారై, వేదార్థాలను తనలో ఇముడ్చుకొన్న తిరుమాలై, తిరుప్పళ్ళి ఎ*ழு*చ్చి- అనే రెండు వాఙ్మాలికలను శ్రీరంగనాథుని శ్రీచరణాలలో సమర్పించిన వారైన తొణ్డరడిప్పొడి ఆ*ழ*్వార్లను స్తుతించి నమస్కరిస్తున్నారు. **"తిరుమాలై"** అనే నామమే అది ఒక పాశురమాలిక అనే విషయాన్ని తెల్పుతున్నది. **"సూక్తిమాలామ్"** అని ఈ తనియన్‌లో తిరుప్పళ్ళిఎ*ழு*చ్చికూడా ఒక మాలికగా తెల్పుతున్నారు. ఈ రీతిలో పెరియా*ழ*్వార్ల (భట్టనాథుల) వలె, ఆణ్డాళ్ (గోదాదేవి) వలె **"పామాలై, పూమాలై"** (పాశురమాలిక, పుష్పమాలిక) అనే రెండిటిని శ్రీరంగనాథుని (పెరియ పెరుమాళ్) శ్రీచరణాలలో సమర్పించిన విషయాన్ని తెల్పుతున్నది, ఈ తిరుప్పళ్ళి ఎ*ழு*చ్చి తనియన్.

వ్యాఖ్యానమ్ : **(రాజవదర్హణీయం రంగేశయం పరవాసుదేవం మత్వా)** - దీని భావం ఏమంటే- ప్రభువులవలె ఉపచారం చేయదగినవాడై, శ్రీరంగమనే రాజధానిలో శయనించి ఉండేవాడైన శ్రీరంగరాజును వేదాంతాలలో ప్రసిద్ధిజెందిన, సర్వలోకప్రభువైన పరవాసుదేవునిగానే తలచి- అని భావం. **"రాజవదర్హణీయమ్"** (రాజువలె ఆరాధింపదగినవాడు) అనే ప్రయోగం రాజులవలె పూజించదగినవాడనే అర్థాన్ని ఇస్తుంది. ప్రభువులకు అందఱికి ప్రభువైన శ్రీరామునిచే (చక్రవర్తికుమారునిచే) ఆరాధింపబడినవాడైనందున పెరియపెరుమాళ్‌కూడా ప్రభువులకు అందఱికి ప్రభువు-అనే అర్థం స్ఫుటమవుతుంది.

**(రంగేశయమ్)** - **"శెరువిలే అరక్కర్‌కోనై చ్చె*ற்ற*ు నమ్ శేవకనార్ మరువియ పెరియకోయిల్"** (తిరుమాలై-11) (ధర్మయుద్ధంలో రాక్షస ప్రభువు రావణుని సంహరించిన మన వీరుడైన శ్రీరాముడు ఆదరించి వేంచేసి ఉండే శ్రీరంగ దివ్యాలయం) అని, **"ప్రతిజలధితో వేలాశయ్యాం విభీషణకౌతుకాత్ పునరపి పురస్కర్తుం శ్రీరంగిణః ఫణిపుంగవే, సముపదధతః కంచిత్ కంచిత్ ప్రసారయతో భుజద్వయమపి సదా దానశ్రద్ధాలుదీర్ఘ ముపాస్మహే"** (శ్రీరంగరాజస్తవమ్- పూర్వ -106) (విభీషణుని కోరికను మళ్లీ ఆదరించి అంగీకరించడంకోసమా అన్నట్లు సముద్రానికి అభిముఖంగా సముద్రతీరంలో పరుండి ఉన్నవాడు, ఆదిశేషునిపై ఒక బాహువును తలదిండుగా చేసిపెట్టుకొన్నవాడు, ఇంకొక బాహువును చాచి

ఉంచినవాడైన శ్రీరంగనాథునియొక్క ఎల్లప్పుడు దానం చేసి చేసి పొడుగైన బాహువులను ధ్యానిస్తున్నాను) అని, **"అరఙ్గత్తరవణై ప్పళ్ళియాన్"** (పెరియాఴ్వార్ తిరు-4-10) (శ్రీరంగంలో ఆదిశేషునిపై పరుండి ఉండేవాడు) అని మహాజ్ఞానులు పలికేటట్లుగా పెరియపెరుమాళ్ శ్రీరంగంలో ఆదిశేషశయనంపై పరుండి ఉండడం తెలుపబడింది.

ఈ విధంగా "శ్రీరంగక్షేత్రం శయనించి ఉండడానికి తగిన చోటు'' అని మనస్సులో భావించి అక్కడ శయనించిన పెరియపెరుమాళ్‌ను-

**(పరవాసుదేవం మత్వా) - "వాసుదేవోఽసి పూర్ణః"** (జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్య తేజస్సులనే ఆఱు గుణాలు నిండుగా కల్గిన పరవాసుదేవుడవై ఉన్నావు) అనే రీతిలో ఆ పరవాసుదేవునిగానే తలచి- అని భావం. ఇక్కడ అర్చపరాధీనుడై, భక్తులు చేసే అన్నివిధాలైన అపచారాలను సహించే అర్చావతారమై ఉండే రీతిని మనస్సులో భావించకుండా, అక్కడ (పరమపదంలో) వేంచేసి ఉండే, ఏడు లోకాలను ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించే పరవాసుదేవునిగానే తలచి- అని భావం. **"ఆదియఞ్జోది యురువై అఙ్గువైత్తిఙ్గు ప్పిఱన్ద"** (తిరువాయ్-3-5-5) (అప్రాకృతమైన, అందమైన జ్యోతిస్స్వరూపంతో పరమపదంనుండి ఇక్కడకు వచ్చి జన్మించిన) అని, **"నెఞ్జినాల్ నినైప్పాన్ యవన్ అవనాకుమ్ నీళ్‌కడల్‌వణ్ణన్"** (తిరువాయ్-3-6-9) (భక్తుడు మనస్సుతో ఏ రూపాన్ని ధ్యానిస్తాడో, ఆ రూపాన్నే సముద్రవర్ణుడైన భగవానుడు పొందుతాడు) అని చెప్పబడుతున్నదికదా! నమ్మాఴ్వార్లు పెరియపెరుమాళ్‌ను **"కడలిడమ్ కొణ్డ కడల్‌వణ్ణా!"** (తిరువాయ్-7-2-7) (సముద్రాన్ని నివాసంగా చేసికొన్న సముద్రవర్ణా !) అని పరవాసుదేవునిగానే కదా దర్శించారు. అందువల్ల ఈ స్వామి కూడా ఆ పరవాసుదేవునివలె జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు- అనే ఆఱుగుణాలతో నిండినవాడై, **"సర్వం పూర్ణమ్"** (ద్వయోపనిషత్తు) (అర్చావతారంలో అన్ని గుణాలు నిండుగా ఉన్నాయి) అనే రీతిలో అర్చావతారమైనందువల్ల పరరూపంలో మఱుగుపడి ఉండే సౌశీల్య- సౌలభ్య- వాత్సల్యాది గుణాలతోను పూర్ణంగా ఉంటాడుకదా! అందువల్ల **"యావరుమ్ వన్దు అడి వణఙ్గ అరఙ్గనకర్ త్తుయిన్ఱవనే!"** (పెరుమాళ్‌తిరు-8-10) (అందఱువచ్చి శ్రీచరణాలను సేవించేటట్లుగా శ్రీరంగంలో శయనించి ఉండేవాడా!) అనే రీతిలో నిత్యసూరులతో, ఈ లోకంలో ఉన్నవారితో భేదం లేకుండా అందఱు వచ్చి శ్రీచరణద్వయిని సేవించేటట్లుగాకదా పెరియపెరుమాళ్



ఉంటాడు. **"తం పరవాసుదేవమేవ మత్వా"** అనే ప్రయోగంలోని "ఏవ" కారంతో కైంకర్యాన్ని చేసేటపుడు **"ముకప్పే కూవి ప్పణి కొళ్ళాయ్"** (తిరువాయ్-8-5-7) (సమక్షంలోకి పిలిచి కైంకర్యాన్ని ఆజ్ఞాపించు) అని, **"పరవానస్మి కాకుత్స్థ ! త్వయి వర్షశతం స్థితే, స్వయం తు రుచిరే దేశే క్రియతా మితి మాం వద"** (రామా-ఆరణ్య-1-57) (కకుత్స్థుని వంశంలో జన్మించిన శ్రీరామా ! నీ సమక్షంలో ఎల్లప్పుడు నేను నీకు పరతంత్రుడనై ఉన్నాను. నీవే స్వయంగా "అందమైన చోట పర్ణశాలను నిర్మించు'' అని నన్ను ఆజ్ఞాపించు) అని పల్కిన రీతిలో పిలిచి, **"వానాడమరుమ్ కుళిర్ విఴియ"** (తిరువిరు-63) (నిత్యసూరులు ఉజ్జీవించేటట్లు చల్లగా కటాక్షించేవి) అనే రీతిలో చల్లని చూపు చూచే పరవాసుదేవునిగానే శ్రీరంగనాథుని భావించారని భావం. **"ఆదిమూర్త్తి! అరఙ్గమానకరుళానే!"** (తిరుమాలై-16) అని ఈ ఆఴ్వార్లే పెరియపెరుమాళ్‌ను పరవాసుదేవునిగా, **"ఇన్దిరలోకమాళుమ్ అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్ అరఙ్గమానకరుళానే !"** (తిరుమాలై-2) (పరమపదాన్ని ఏలే ఆ గొప్ప ఆనందాన్ని పొందినా, ఓ శ్రీరంగనాథా ! దానిని నేను కోరను) అని పరవాసుదేవునికంటే గొప్పతనాన్ని కల్గినవానినిగా తలిచి అభినివేశాన్ని పొంది తిరుమాలై ప్రబంధంలో పలికారుకదా! **"తం పరవాసు దేవమ్"** అని అన్వయించకుండా, **"తం రంగేశయమ్"** అని అన్వయిస్తే, పరవాసుదేవునికంటే పెరియపెరుమాళ్ సౌలభ్యగుణంతో ప్రసిద్ధిని చెందినవాడు- అనే గొప్పతనం **"తమ్"** అనే విశేషణంతో తెలుపబడుతుంది.

**"పరవాసుదేవమ్"** అనే చోట **"పర"** శబ్దంచేత వ్యూహవాసుదేవునికంటె గల వైలక్షణ్యం తెలుపబడింది. **"ఆత్మమాయామయీం దివ్యం యోగనిద్రాం సమాశ్రితః, ఆత్మానం వాసుదేవాఖ్యం చింతయన్ మధుసూదనః"** (విష్ణు-పు-6-4-6) (వాసుదేవుడనే పేరును కల తన స్వరూపాన్ని చింతిస్తూ, తనకు చెందిన మూలప్రకృతికి అభిమానదేవత అయిన యోగనిద్రను సమాశ్రయించాడు) అని **"ఇవళ్‌తిఱత్తు ఎన్ శిన్దిత్తాయే ?"** (తిరువాయ్-7-2-4) (ఈ పరాంకుశ నాయకి విషయంలో ఏమి ఆలోచించావు ?) అని, **"ఉఱఙ్గువాన్ పోల్ యోగు శెయ్‌ద పెరుమాన్"** (తిరువాయ్-5-4-11) (నిద్రించేవానివలె యోగచింతను చేసే స్వామి) అని వ్యూహవాసుదేవునకు చెప్పబడే జగద్రక్షణచింత అనే సౌహార్దంకూడా పెరియపెరుమాళ్ వద్ద ఉన్నది కదా ! అయినా, ఈ నమ్మాఴ్వార్లు పరిపూర్ణానుభవం పొందే పరవాసుదేవునిగానే పెరియపెరుమాళ్‌ను దర్శించి ఆనందించారు. "కావేరీ

విరజా సేయం వైకుంఠం రంగమందిరమ్, స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్" (శ్రీరంగమహాత్మ్యమ్) (ఈ కావేరీనది ఆ విరజానదియే. శ్రీరంగ దివ్యాలయం వైకుంఠమే. శ్రీరంగనాథుడు పరవాసుదేవుడే. ఈ రీతిలో పరమపదమే మన కంటికి ప్రత్యక్షమవుతున్నది) అని శ్రీరంగమాహాత్మ్యంలో చెప్పబడింది కదా! **"అణ్డర్‌కోన్ అణియరఙ్గన్"** (అమల-10) (అండాధిపతి, అందమైన శ్రీరంగానికి ప్రభువు) అని, **"వడివుడైవానోర్ తలైవనే ఎన్నుమ్ వణ్ తిరువరఙ్గనే !"** (తిరువాయ్-7-2-10) (అందమైన రూపాన్ని కల నిత్యసూరులకు నాథుడనే అందమైన శ్రీరంగంలోని నాథుడు) అని, **"పొఙ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్కిన్ఱ ఎమ్బెరుమాన్ శెఙ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనార్"** (నాచ్చి.తిరు-11-3) (పొంగే సముద్రంచేత పరివేష్ఠితమైన భూమి, పరమపదం- అనే వీటిలో ఏదీ జారిపోకుండా రక్షించేస్వామి, ఆజ్ఞాదండాన్ని కల శ్రీరంగనాథుడు) అని అంటూ శ్రీరంగనాథుడు ఎక్కడ నుండి వచ్చాడు- అనే విషయాన్ని తెలిసిన ఆழ்్వార్లు, గోదాదేవి ఇతనికి మూలమూర్తిగా పరమపదనాథునే పలికారు కదా !

విశేషించి, శ్రీరంగదివ్యాలయంలో పెరియపెరుమాళ్ **"ఓం నమో భగవతే వాసుదేవాయ"** అని తిరుద్వాదశాక్షరీమంత్రాన్ని ప్రధానంగా చేసికొని తన ఆరాధనను కటాక్షిస్తున్నాడు. **"ద్వాదశాక్షరమంత్రోஉయం మంత్రాణాం త్రాయ ఉచ్యతే"** (ఈ ద్వాదశాక్షరీమంత్రం మిగిలిన మంత్రాలకు రక్షకంగా చెప్పబడింది) అనేది ఈ విషయంలో ప్రమాణం. **"శ్రీరంగనాథ! జగన్నాథ!"** (శ్రీరంగనాథా! జగత్పతీ!) అనే రీతిలో ఆరాధింపబడే శ్రీరంగనాథుడుకూడా అందటికి ప్రభువు. ఈ తనియన్‌లో శ్రీరంగనాథుడు ప్రభువులవలె ఆరాధ్యుడు- అని చెప్పబడింది కదా! అందువల్ల, ప్రభువులను మేల్కొలిపేటట్లు ఆ ప్రభువులకు అందటికి ప్రభువైన శ్రీరంగనాథుని మేల్కొలిపే రీతిని ఈ దివ్యప్రబంధం తెల్పుతున్నది.

**(ప్రాబోధికీం సూక్తిమాలాం యః అకృత తమ్ భగవంతం భక్తాంఘ్రిరేణుమ్ ఈడే)** - శ్రీరంగనాథునకు తగినది, చెవులకు ఇంపైనది. ప్రబోధాన్ని పలికేది అయిన పాశురమాలికను ఎవరు అనుగ్రహించారో, అటువంటి గొప్పతనాన్ని కలవారై, జ్ఞానం- వైరాగ్యం, మొదలైన గుణాలతో నిండినవారైన తొణ్డరడిప్పొడి ఆழ்్వార్లను స్తుతించి నమస్కరిస్తున్నాను- అని భావం.

**(ఈడే)** - ఈ పదం స్తుతించడం, సేవించడం -అనే రెండు అర్థాలను తెల్పుతుంది.



**"రాజవదర్హణీయమ్"** (ప్రభువువలె పూజించదగినవాడు) కనుక, రాజులకు తగిన ఉపచారమైన మేల్కొలుపును చేయాలి కదా! **"అయోత్తియెమ్మరశే! అరఙ్గత్తమ్మా! పళ్ళి ఎழுన్దరుళాయే!"** (తిరుప్పళ్ళి-4) (అయోధ్యానగరంలోని మా ప్రభూ ! శ్రీరంగనాథా ! నిద్రనుండి మేలుకో) అని అంటూ వీరు శ్రీరంగనాథుని ప్రభువుగా పలికి కదా మేల్కొలుపు పాడారు. **"రక్షోగణపరిక్షిప్తో రాజా హ్యేష విభీషణః, శ్రీమతా రాజరాజేన లంకాయామభిషేచితః"** (రామా-యుద్ధ-28-7) (రాక్షసులచేత వెడలగొట్టబడినవాడై, ప్రభువైన ఈ విభీషణుడు రాజులకు రాజై, శ్రియఃపతి అయిన శ్రీరామునిచే లంకారాజ్యంలో అభిషేకించబడ్డాడు) అని, **"రాజాధి రాజస్సర్వేషాం విష్ణుః బ్రహ్మమయో మహాన్, ఈశ్వరం తం విజానీమ స్స పితా స ప్రజాపతిః"** (భారత-అశ్వ-43-13) (పరబ్రహ్మ స్వరూపి, గొప్పవాడు, రాజులందటికి రాజు అయినవాడు విష్ణువు. సర్వేశ్వరునిగా అతనిని తెలిసికొంటున్నాము. అతడే తండ్రి, అతడే ప్రజాపతి) అని పలికే రీతిలో రాజులకందటికి రాజు అయిన శ్రీరాముడనే స్వామిని **"వీర! సౌమ్య! విబుధ్యస్వ కౌసల్యానందవర్ధన!, జగద్ధి సర్వం స్వపితి త్వయి సుప్తే నరాధిప!"** (రామా-ఉత్తర-37-4) (కౌసల్యాదేవి ఆనందాన్ని వృద్ధి చేసేవాడా! వీరా! అందమైనవాడా! మేలుకో. ప్రభూ! నీవు నిద్రపోతే లోకమంతా నిద్రపోతుంది) అని వందులు, **"కౌసల్యా సుప్రజారామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్"** (రామా-బాల-23-2) (కౌసల్యాదేవి సత్పుత్రుడా ! శ్రీరామా ! తూర్పుదిక్కులోని సంధ్య ప్రవర్తిస్తున్నది. మానవులలో ఉత్తమా ! పరమాత్మను ఆరాధించే ప్రాతఃకాలిక కృత్యాలు చేయవలసి ఉన్నవి. మేలుకో) అని విశ్వామిత్రుడు మేల్కొలుపు పలికినట్లు, ఆ శ్రీరామునిచే కూడ ఆరాధింపబడిన పెరియపెరుమాళ్ కనుక **"పెరియపెరుమాళ్"** అనే నామాన్ని పొందినవాడైన శ్రీరంగరాజునుకదా వీరు మేల్కొలుపు పాడుతున్నారు. వీరు (తొణ్డరడిప్పొడి ఆழ்్వార్లు) తిరుప్పళ్ళి యెழுచ్చి అనే దివ్యప్రబంధంలో ఉదయకాలం గడచిన రీతిని, బ్రహ్మ మొదలైన దేవతలు జాగరూకతతో వచ్చి వాకిటిలో వేచి ఉండే రీతిని, వాకిటిలో ఏర్పడి (భక్తుల) సమ్మర్దాన్ని, నిద్రనుండి లేవగానే చూడదగిన మంగళవస్తువులు సిద్ధంగా ఉన్న రీతిని, మంగళదీపంవలె సూర్యుడు ఉదయించి, బయటకు రాగా అతనివల్ల విరిసిన తామరపూలు చిన్న చిన్న దీపాలవలె ప్రకాశించే రీతినిగూర్చి పల్కుతూ తిరుప్పళ్ళి యెழுచ్చిని పాడుతున్నారు. ఈ వైలక్షణ్యాలు అన్నీ శ్రీరంగనాథుడు- ప్రభువులవలె అర్హణీయుడు, ఆరాధించదగినవాడు అనే విషయానికి అనుగుణంగా ఉన్నాయి.

**(రంగేశయం ప్రాబోధికీం సూక్తిమాలామ్ అకృత)** - అని పల్కడంద్వారా పలు పాశురాలలో **"అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెழுన్దరుళాయే"** (శ్రీరంగనాథా ! నిద్రనుండి మేలుకో) అని, విశేషించి అయిదవ పాశురంలో **"ఇలఙ్గైయర్‌కోన్ వழிపాడు శెయ్ కోయిల్ ఎమ్బెరుమాన్ ! పళ్ళి యెழுన్దరుళాయే !"** (తిరుప్పళ్ళి-5) (లంకాధీశుడైన విభీషణుడు సేవ చేసే కోవెల అయిన శ్రీరంగంలోని స్వామీ ! నిద్రలే.) అని అంటూ ఈ ఆழ்వార్లు పల్కిన సూక్తులను స్మరింపజేస్తున్నారు. **"తిరుమాలై"** ప్రబంధం కూడా ఒక వాఙ్మాలికయే కదా ! అందులో కూడా **"ఎన్నై నోక్కాదొழிవదే"** (తిరుమాలై-36), (నన్ను కటాక్షించలేదే), **"ఆళియన్ నమ్ పైయలెన్నార్"** (తిరుమాలై-37) (బాలుడైన ఇతడు మన కృపకు పాత్రుడు) అని పెరియపెరుమాళ్ శయ్యనుండి లేచి తమను కటాక్షించాలి, తమతో భాషించాలి- అని అపేక్షించారుకదా ! ఆ దివ్యప్రబంధంలో **"కిడన్దదోర్ కిడక్కై"** (తిరుమాలై-23) (పరుండి ఉండే అద్వితీయమైన సన్నివేశం) అని భగవానుని శయనసన్నివేశ సౌందర్యాన్ని అనుభవించి, అతని గమనసౌందర్యం మొదలైనవానిని దర్శించి ఆనందించాలని ఈ దివ్యప్రబంధాన్ని పాడుతున్నారు. ఈ రెండు పెరియ పెరుమాళ్‌నుగూర్చి పల్కిన దివ్యప్రబంధాలుకదా! అందువల్ల **"సూక్తిమాలామ్"** అనే ఈ తనియన్ శ్లోకంలోని ప్రయోగంలో ఈ రెండు దివ్యప్రబంధాలు అంతర్భవిస్తాయి.

**(భగవంతమ్)** - అని ప్రయోగించినందున **"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః, జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా"** (విష్ణు.పు.6-5-74) (పూర్ణమైన ఐశ్వర్యం, వీర్యం, కీర్తి, సంపద, జ్ఞానం, వైరాగ్యం- అనే ఈ ఆఱు గుణాలు **"భగ"** అనే శబ్దంచే చెప్పబడుతున్నాయి) అని చెప్పబడ్డ జ్ఞానం మొదలైన ఆఱు గుణాలను కలవారు భగవచ్ఛబ్దవాచ్యులు. ఆ జ్ఞానంయొక్క ప్రయోజనం భగవానుని భక్తులకు శేషభూతులై ఉండడమే- అనే విషయం స్ఫురించేటట్లుగా **"భక్తాంఘ్రిరేణు"** అనే వీరి తిరునామాన్ని పల్కుతున్నారు. వీరు కూడా **"అడియార్‌క్కాట్పడుత్తాయ్"** (తిరుప్పళ్ళి-10) (నన్ను నీ దాసులకు శేషభూతునిగా చేశావు) అని తిరుప్పళ్ళి ఎழுచ్చి ప్రబంధాన్ని, **"తుళవత్తొణ్డాయ తొల్‌శీర్ తొణ్డరడిప్పొడిశొల్"** (తిరుమాలై-45) (తులసికి దాస్యం చేసే, స్వాభావిక కల్యాణ గుణాలను కల తొండరడిప్పొడి ఆழ்వార్ల సూక్తి) అని తిరుమాలై ప్రబంధాన్ని ముగించారు కదా? **"తొడైయొత్త తుళవముమ్ కూడైయుమ్ పొలిన్దు తోన్ఱియ తోళ్ తొణ్డరడిప్పొడి"** (తిరుప్పళ్ళి-10) (చక్కగా కూర్చబడిన తులసిని, పూలబుట్టను కల్గి ప్రకాశించే రీతిలో కల్గి ఉండే బాహువులను కల తొణ్డరడిప్పొడి ఆழ்వార్లు) అని మేల్కొలుపు పాడి, **"శూట్టునన్ మాలైకళ్ తూయన ఏన్ది"** (తిరువిరుత్తమ్-21) అని నమ్మాழ்వార్లు అనుగ్రహించినట్లే భగవద్భక్తుల మనస్సులో ఆనందానికి తగిన భగవత్కైంకర్యాన్ని ఆழ்వార్లు ప్రార్థించారు.



**(ఈడే)** అని అంటూ ఈతనియన్‌లో ఆ ఆழ்వార్ల విషయంలో వాక్కుతో చేసే స్తుతి, శరీరంతో చేసే నమస్కారమనే రెండు విధాలైన కైంకర్యాలను చేస్తున్నట్లుగా పల్కి తనియన్ శ్లోకాన్ని తిరుమాలైయాణ్డాన్ ముగిస్తున్నారు.

## తిరువరఙ్గ ప్పెరుమాళ్ అరైయర్ అనుగ్రహించిన తనియన్

2. **మణ్డఙ్గుడి యెన్బర్ మామఱైయోర్ మన్నియ శీర్,**
   **తొణ్డరడిప్పొడి తొన్నకరమ్, వణ్డు**
   **తిణర్‌త్త వయల్ తెన్నరఙ్గత్తమ్మానై, ప్పళ్ళి**
   **యుణర్‌త్తుమ్ పిరానుతిత్త వూర్.**

వణ్డు = తుమ్మెదలు, తిణర్‌న్ద = దట్టంగా చేరి ఉండే, వయల్ = సస్యక్షేత్రాలను కల, తెన్ = అందమైన, అరఙ్గత్తు = శ్రీరంగంలో (శయనించి ఉండే), అమ్మానై = స్వామి అయిన శ్రీరంగనాథుని, పళ్ళి ఉణర్‌త్తుమ్ = మేల్కొలుపు పలికేవారై, పిరాన్ = పరమోపకారకులై, తొణ్డరడిప్పొడి = **"తొణ్డరడిప్పొడి"** అనే తిరునామాన్ని కలవారైన ఆழ்వార్లు, ఉతిత్త ఊర్ = అవతరించిన దివ్యదేశం, శీర్ మన్నియ = సంపదను (గొప్పతనాన్ని) స్థిరంగా కల, మణ్డఙ్గుడి = తిరుమణ్డఙ్గుడి అనే, తొల్ నకరమ్ = అనాది అయిన నగరం, ఎన్బర్ మా మఱైయోర్ = అని వేదవిదులు అంటారు.

అవతారికై : (మణ్డఙ్గుడి యిత్యాది) శేషత్వసీమాభూమియాన తొణ్డరడిప్పొడి యాழ்వార్ తిరువవతారస్థలమ్ మిక్క వేతియరాలే సదా అనుసన్ధిక్కప్పడు మెన్గిఱతు.

వ్యాఖ్యానమ్ :- **(మామఱైయోర్ వణ్డు తిణర్‌త్త వయల్ తెన్నరఙ్గత్తమ్మానై ప్పళ్ళియుణర్‌త్తుమ్ పిరాన్ తొణ్డరడిప్పొడి ఉదిత్త వూర్ తొల్‌నకరమాన మణ్డఙ్గుడి యెన్బర్) "కణ్ణఙ్గుడి, కుఱుఙ్గుడి, పుళ్ళమ్ పూదఙ్గుడి"** ఎన్ఱు ఉకన్దరుళిన నిలఙ్గళై

చ్చొల్లుమాపోలే, ఇఙ్గుమ్ "మణ్డఙ్గుడి యెన్బర్ మామఱైయోర్" ఎన్గిఱతు. ఇవర్ మామఱైయోరాకైయాలే మణ్డఙ్గుడియై చ్చొల్లుమవర్కళుమ్ మామఱైయోరా యాయ్త్తు. మామఱైయోరాకిఱార్ - "మిక్క వేదియర్ వేతత్తినుట్పొరుళాన" తదీయవైభవత్తై యఱిన్దవర్కళ్. అతుతాన్ - తొణ్డరడిప్పొడి తొల్నకరమిఱే.

(తొల్ నకరమ్) పఴైయతాయ్ ప్పొరుకిఱ నగరమ్. నగరఙ్గళిలేయిఱే నల్లవస్తుక్కళుణ్డావతు. "నల్లార్ నవిల్ కురుకూర్నకర్" ఎన్నుమాపోలే. ఇతు నగరమాకైక్కు హేతుశొల్లుకిఱతు -

(వణ్డు తిణర్త్త వయలిత్యాదియాల్) వణ్డుకళ్ నెరుఙ్గివ నయలైయుడైయ. "వయలులిరిన్ద శురుమ్బినమ్" ఎన్ఱరుళిచ్చెయ్తారిఱే. "పూఙ్గువళైప్పోతిల్ పాటివణ్డు కణ్ పడుప్ప" ఇప్పడి నీర్ పూవిలే వణ్డుకళ్ నెరుఙ్గిన వయల్ శూఴ్న్ద కోయిలుక్కు నిర్వాహకరాన పెరియపెరుమాళై. "వణ్డు తిణర్త్త వయల్ తెన్నరఙ్గత్తమ్మానై ప్పళ్ళియుణర్త్తుమ్" ఎన్కైయాలే "వయలులిరిన్దన శురుమ్బినమ్" ఇత్యాదిప్పడియే, "మఞ్జరీసుప్తభృఙ్గా" ఎన్ఱు పూక్కళిలే కణ్పడుత్త వణ్డుకళ్ ఉణర్న్దన. శ్రీరఙ్గనాచ్చియార్ స్తనస్తబకత్తిలే కణ్వళర్న్దరుళుకిఱ శ్రీరఙ్గరాజభృఙ్గత్తై "అరఙ్గత్తమ్మా! పళ్ళియెఴున్దరుళాయే" ఎన్ఱు తిరుప్పళ్ళి యుణర్త్తుమవర్.

(పళ్ళి యుణర్త్తుమ్ పిరాన్) తిరుప్పళ్ళియుణర్త్తి పిన్బుళ్ళారుక్కుమ్ ఇప్రబన్ధత్తై యుణ్డాక్కి ఉపకరిత్తరుళినవర్.

(ఉదిత్త వూర్) "అఱివిలామనిశర్క్కు" "అఱియాతన అఱివిత్తు", అజ్ఞానత్తై ప్పోక్కుకైక్కాక ఇవర్ అవ్వూరిలే ఉదిత్తతు. "కతిరవన్ కుణతిశై చ్చికరమ్ వన్దణైన్దాన్ కనవిరుళకన్ఱతు" ఎన్నుమ్బడియన్ఱిక్కే, ఆన్తరమాన అన్ధకారత్తై ప్పోక్కిఱ్ఱు. ఆకైయాల్ "తొణ్డరడిప్పొడి తొన్నకరమ్ మణ్డఙ్గుడి" ఎన్బర్.

తనియన్ వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు
శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ తిరువడికళే శరణమ్.

## భావదీపిక వివరణం

అవతారిక : ఈ రెండవ తనియన్‌ను అనుగ్రహించిన ఆచార్యులు- భగవద్రామానుజులకు ఇంకొక ఆచార్యులైన తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్. శేషత్వంలో పరమావధిలో స్థిరంగా ఉండే తొణ్డరడిప్పొడి ఆఴ్వార్లయొక్క



అవతారస్థలమైన తిరుమణ్డఙ్గుడి వైదికశ్రేష్ఠులచేత ఎల్లప్పుడు అనుసంధింపబడేదై ఉన్నది - అని తెల్పుతున్నది ఈ తనియన్.

వ్యాఖ్యానమ్ : **(మామఱైయోర్ వణ్డు తిణర్త్త వయల్ తెన్నరఙ్గత్తమ్మానై ప్పళ్ళి యుణర్త్తుమ్ పిరాన్ తొణ్డరడిప్పొడి ఉదిత్త ఊర్ తొల్ నకరమాన మణ్డఙ్గుడి ఎన్బర్)** -అని అన్వయం. **"కణ్ణఙ్గుడి, కుఱుఙ్గుడి, పుళ్ళమ్ పూదఙ్గుడి"** అని భగవానుడు అభిమానించిన దేశాలను నిర్దేశించేటట్లే **"మణ్డఙ్గుడి"** అని ఆఴ్వార్లు అవతరించిన దివ్యదేశాన్నిగూర్చి పరమవైదికులు అంటారు- అని అంటున్నారు. ఈ ఆఴ్వార్లు పరమవైదికులైన **"మామఱైయోర్"** కనుక, వీరు అంతరించిన మణ్డఙ్గుడినిగూర్చి పలికేవారు కూడా **"మామఱైయోర్"** అవుతున్నారు. **"మామఱైయోర్"** ఎవరు ? అంటే- **"మిక్క వేదియర్ వేదత్తినుట్పొరుళ్"** (కణ్ణినుణ్ -9) (గొప్ప వేదవిదులు వేదంలోని సారార్థాన్ని) అని మధురకవి ఆఴ్వార్లచే వేదంలోని సారార్థంగా చెప్పబడ్డ భాగవతవైభవాన్ని తెలిసినవారే **"మామఱైయోర్"** కాగలరు. ఆ **"మణ్డఙ్గుడి"** అనే దివ్యదేశం తొణ్డరడిప్పొడి ఆఴ్వార్లు అవతరించిన అనాది అయిన నగరం- అనే ప్రసిద్ధినిగూర్చి పల్కుతున్నారు.

**(తొల్ నకరమ్)** - ప్రాచీనమైన నగరం. మిక్కిలి ప్రాచీనమైన నగరం- అని భావం. నగరాలలోకదా మంచి వస్తువులు లభిస్తాయి. **"నల్లార్ నవిల్ కురుకూర్ నకరాన్"** (తిరువిరుత్తమ్-100) (సత్పురుషులు స్తుతించే తిరుక్కురుకూర్‌కు ప్రభువు) అని నమ్మాఴ్వార్లు అవతరించిన కురుకూర్ కూడా ఒక నగరం కదా ! ఇది నగరం కావడానికి కారణం తిరుప్పళ్ళి ఎఴుచ్చి పాడిన తొణ్డరడిప్పొడి ఆఴ్వార్లు అవతరించడమే- అని పాశురంలోని మిగిలిన భాగంతో పల్కుతున్నారు.

**(వణ్డు తిణర్త్త వయల్)** - తుమ్మెదలు దట్టంగా ఉండే సస్యక్షేత్రాలను కల- అని భావం ఈ ప్రయోగం **"తెన్నకరమ్"** అనే దానికి విశేషణం. **"వయలుళ్ ఇరిన్దన శురుమ్బినమ్"** (తిరుప్పళ్ళి-4) అని ఈ విషయాన్నిగూర్చి వీరు కూడా అనుగ్రహించారు కదా ! **"పూఙ్కువళై ప్పోదిల్ పాటివణ్డు కణ్ పడుప్ప"** (తిరుప్పావై-3) (ఎఱ్ఱ కలువపూలలో ప్రకాశించే తుమ్మెదలు నిద్రించగా) అని గోదాదేవి సైతం పల్కింది.

**(తెన్నరఙ్గత్తమ్మానై)** - ఈ విధంగా నీటిలో మొలిచే పూవులలో తుమ్మెదలు నిండుగా కల్గిన క్షేత్రాలలో పరివేష్ఠితమైన శ్రీరంగ దివ్యక్షేత్రాన్ని పాలించే స్వామిని.

“వణ్డు తిణర్త్త వయల్ తెన్నరఙ్గత్తమ్మానై ప్పళ్ళి యుణర్త్తుమ్” అని పల్కినందువల్ల “వయలుళ్ ఇరిన్దన శురుమ్బినమ్” (తిరుప్పళ్ళి-4) (క్షేత్రాలలో తుమ్మెదల గుంపు ధ్వనిస్తున్నది) అని, “తరళయతు తరంగైః మందమాందోళ్య మాన స్వతటవిటపిరాజీ మంజరీసుప్తభృంగా, క్షిపతు కనకనామ్నీ నిమ్నగా నారికేళక్రముకజ మకరందైః మాంసలాపా మదంహః” (శ్రీరంగరాజస్తవం- పూర్వ-24) (మెల్లిగా కదిలే అలలతో మెల్లిగా ఊగిసలాడే, తన తీరంలోని తోటలలోని పూలగుత్తులలో నిద్రిస్తున్న తుమ్మెదలను కల్గినది, కొబ్బరి, పోక చెట్లనుండి పుట్టిన తేనెలతో నిండిన నీటిని కల్గినది అయిన “కనకా” అనే పేరును కల కావేరీనది నా పాపాన్ని పోగొట్టుగాక) అనే రీతిలో పూలలో నిద్రించే తుమ్మెదలు నిద్ర లేచాయి - అని పల్కి, శ్రీరంగరాజు అనే తుమ్మెదను “అరఙ్గత్తమ్మా! పళ్ళియెఴున్దరుళాయే !” అని మేల్కొలుపు పాడారు- అని తెలుపబడుతున్నది.

**(పళ్ళి యుణర్త్తుమ్ పిరాన్)** - పెరియపెయరుమాళ్‌కు మేల్కొలుపు పాడి, తరువాత వారికి కూడా ఈ దివ్యప్రబంధాన్ని అనుగ్రహించి ఉపకారం చేశారు.

**(ఉదిత్త ఊర్)** -“అఱివిలా మనిశర్” (తిరుమాలై-13) (జ్ఞానం లేని మానవులు) అనబడే సంసారులకు “అఱియాదన అఱివిత్త” (తిరువాయ్-2-3-2) (తెలియని వానిని తెలిపిన) అనే రీతిలో వారికి తెలియని మంచి విషయాలను తెలిపి, అజ్ఞానాన్ని పోగొట్టడంకోసమే వీరు (ఈ ఆళ్వార్లు) ఈ ఊరిలో అవతరించారు. “కదిరవన్ కుణదిశై చ్చికరమ్ వన్దెడున్దాన్ కనయిరుళకన్టతు” (తిరుప్పళ్ళి-1) (సూర్యుడు తూర్పుదిక్కున ఉదయించాడు, దట్టమైన చీకటి తొలగింది.) అని చెప్పబడే సూర్యునివలె బాహ్యాంధకారం మాత్రమే పోగొట్టకుండా, వీరు అజ్ఞానమనే ఆంతరమైన అంధకారాన్నికూడా పోగొట్టారు కదా ! అందువల్ల “తొణ్డరడిప్పొడి తొన్నకరమ్ మణ్డఙ్గుడి యెన్బర్” అని పూర్వార్ధంలో అన్వయించి అర్థాన్ని గ్రహించాలి.

తనియన్ వ్యాఖ్యానానువాదం భావదీపిక సంపూర్ణం
శ్రీపిళ్లైలోకమ్ జీయర్ తిరువడికళే శరణమ్.



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీతొణ్డరడిప్పొడియాఴ్వార్ అరుళిచ్చెయ్‌త

# తిరుప్పళ్ళియెఴుచ్చి

## నఞ్జీయర్ అరుళిచ్చెయ్‌త వ్యాఖ్యానావతారికై

“అనాదిమాయయాసుప్తో యదా జీవః ప్రబుధ్యతే” ఎన్గిఱపడియే అనాది కాలమ్ అజ్ఞానత్తాలే యుఱఙ్గుకిఱ ఇవరై, పెరియపెరుమాళ్ తమ్ముడైయ నిరవధికకృపైయాలే యుణర్త్తి యరుళ ఉణర్న్దు, పెరియపెరుమాళే ప్రాప్యరుమ్ ప్రాపకరుమెన్నుమిడమ్ “ఐమ్బులనకత్తడక్కి క్కామ్బఱత్తలై శిరైత్తున్ కడైత్తలై యిరున్దు వాఴుమ్ శోమ్బరై యుకత్తి” ఎన్ఱు ఇవరై యిట్టు నిలై యిడువిత్తు ఇప్రబన్ధత్తాలే నాట్టుక్కు వెళిచ్చెఱిప్పి ప్పణ్ణివైత్తు నిర్భరరాయ్ క్కణ్వాళర్న్దరుళ, అత్తలై ఇత్తలైయాయ్ పెరియపెరుమాళై యుణర్త్తి అడిమైశెయ్య ప్పారిక్కిఱార్.

ప్రాప్యప్రాపకఙ్గళిరణ్డుమవనే ఎన్ఱఱుతియిట్టాల్, పిన్బు, తిరుప్పళ్ళి యుణరుమ్బడియైయుమ్ అఴకోలక్కమిరుక్కుమ్బడియైయుమ్, అరుకే తిరుమాలై యెడుత్తు అడిమై శెయ్యుమ్బడియైయుమ్ మనోరథిత్తు ఇవైయే యాత్రైయాయ్ చ్చెల్లుమిత్తనైయిఱే. నాయ్‌చ్చియార్క్కు “మారిమలైముఴఞ్జిల్” ఎన్గిఱ పాట్టిలే ఇతువే యిఱే అనుసన్ధానమ్. నమ్మాఴ్వారుమ్ “నెడుమాఱ్కడిమై”యిలే పురుషార్థత్తినుడైయ చరమావధి నిలైయిట్టు, అనన్తరమ్ “కొణ్డపెణ్డి”రిలే నాట్టుక్కు వేణ్డుమ్ హితమరుళిచ్చెయ్‌తు, పిన్బు “కిడన్దనాళ్ కిడన్దాయ్” ఎన్గిఱ పాట్టిలే ఉణర్త్తి యెఴుప్పి అడిమై శెయ్యప్పారిత్తారిఱే.

విశ్వామిత్రనుమ్, “కౌసల్యాసుప్రజారామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్” ఎన్ఱానిఱే. అప్పడియే ఇవరుమ్ పెరియపెరుమాళ్ ఉణర్న్దరుళుమ్బోతై యఴకు కణ్డు అడిమై శెయ్య ఆశైప్పట్టు త్తిరుప్పళ్ళి యుణర్త్తుకిఱార్.

ఆదిత్యన్ ఉదయగిరిలే వన్దు తోఱ్ఱినాన్. తిరువారాధనత్తుక్కు సదృశమాన సకలోపకరణఙ్గళుమ్ కొణ్డు దుర్మానికళాన దేవజాతికళుమ్, రాజాక్కళుమ్ భగ్నాభిమానరాయ్ తిరుక్కణ్ణోక్కాన తెఱ్కుదిక్కిలే ప్రథమకటాక్షత్తుక్కాక, "నాన్ మున్బుట్టేన్, నాన్ మున్బుట్టేన్" ఎన్ఱు ముఱ్కోలిక్కొణ్డు వన్దు నిన్ఱార్కళ్. "సర్వరక్షకరాయ్, శ్రియఃపతియాయ్, ఆశ్రితవత్సలరాయ్, సర్వసమాశ్రయణీయరాన దేవరీర్ అడియేనుక్కాక ఉణర్న్దరుళినీర్" ఎన్గిఱ తరత్తై అడినుయేనుక్కు త్తన్దరుళి, తిరుప్పళ్ళి యుణర్న్దు అడియోఙ్గళడిమై కొణ్డరుళవేణుమెన్గిఱార్. ప్రజైకళై క్కాట్టి జీవనమ్ వేణ్డువారైప్పోలే, ఆరాధకరాన దేవజాతియై మున్నిట్టుక్కొణ్డు స్వప్రయోజనత్తై అపేక్షిక్కిఱార్.

నఞ్జీయర్ అరుళిచ్చెయ్దవతారికై ముఱ్ఱిఱ్ఱు

---

## పెరియవాచ్చాన్పిళ్ళై అరుళిచ్చెయ్త

## తిరుప్పళ్ళియెழுచ్చి వ్యాఖ్యానావతారికై

ఇవ్వாழ்వారాకిఱార్ - ముతలిలే స్వరూపోపాయ పురుషార్థవివేక శూన్యరాయ్, దేహత్తిలే ఆత్మబుద్ధియై ప్పణ్ణి, తదనుబన్ధికళాన శబ్దాదివిషయఙ్గళిలే మణ్డి, తమ్మోడు శేర్న్దారైయుమ్ తత్స్వభావరాక్కిప్పోరానిఱ్క, "మాతరార్ కయఱ్కణ్ణెన్నుమ్ వలైయుళ్ పట్టழுన్దువేనై ప్పోతరే యెన్ఱు శొల్లి ప్పున్దియిల్ పుకున్దు తన్బాలాదరమ్ పెరుక వైత్త వழுకన్" ఎన్గిఱపడియే పెరియ పెరుమాళ్ తమ్ నిర్హేతుకకృపైయాలే తమ్ వడివழுకై క్కాట్టి విషయాన్తరప్రావణ్యత్తై మాఱ్ఱి స్వరూపానురూపమాక త్తమ్బక్కలిలే అభినివేశత్తై ప్పిఱప్పిక్క, ఇవరుమ్ ప్రీతికారితమాన కైఙ్కర్యత్తై ప్పారిత్తుక్కొణ్డు పెరియపెరుమాళ్ తిరువడికళిలే శెన్ఱవిడత్తిలే, తిరుక్కణ్గళాలే కుళిర నోక్కుతల్, కైయై నీట్టి యణైత్తల్, కుశలప్రశ్నమ్ పణ్ణుతల్, "శిరసా దేవః ప్రతిగృహ్ణాతి" ఎన్గిఱపడియే "శూట్టు నన్మాలైకళై" శిరసా వహిత్తల్ శెయ్యాతే పళ్ళి కొణ్డరుళినార్ - పెరియపెరుమాళ్.

అతఱ్కు నిబన్ధనమ్ అనాదరమెన్న వొణ్ణాతు- ప్రియభూతరాకైయాలే. ఉఱ్ఱాతు అఱామైయాలేయాతల్, తమోభిభవత్తాలేయాతల్ ఎన్నవొణ్ణాతు- శుద్ధసత్త్వమాకైయాలే. పిన్బు ఇతఱ్కు నిబన్ధనమెన్? ఎన్నిల్, "ఆతలాల్ పిఱవి వేణ్డేన్" ఎన్నుమ్బడి ప్రకృతిసమ్బన్ధమ్ అప్రాప్త మెన్నుమ్బడియాన జ్ఞానవిశేషత్తై యుడైయ



రానపడియైయుమ్, "పోనకమ్ శెయ్త శేడమ్ తరువరేల్ పునితమ్" ఎన్నుమ్బడి తదీయశేషత్వపర్యన్తమాక స్వరూపయాథాత్మ్యజ్ఞానమ్ పిఱన్దపడి యైయుమ్, "ఇచ్చువై తవిర.... అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్" ఎన్నుమ్బడి ప్రకృతిపురుష యాథాత్మ్యజ్ఞానమ్ పిఱన్ద పడియైయుమ్, "కావలిల్ పులనై వైత్తు" ఎన్నుమ్బడి ఇన్ద్రియఙ్గళై నియమితపడియైయుమ్, "కుళిత్తు మూన్ఱనలైయోమ్బుమ్ కుఱికొళన్దణమైతన్నై యొళిత్తిట్టేన్" ఎన్నుమ్బడి ఉపాయాన్తరఙ్గళిల్ తువక్కఱ్ఱ పడియైయుమ్, "ఉన్నరుళెన్న మాశైతన్నాల్ పొయ్యనేన్ వన్దు నిన్ఱేన్" ఎన్నుమ్బడి ఉపాయయాథాత్మ్యజ్ఞానమ్ పిఱన్దపడియైయు మనుసన్ధిత్తు, "శోమ్బరై యుత్తి పోలుమ్" ఎన్గిఱపడియే ఇవరై ఇప్పడి ప్పెఱువో మెన్గిఱ ప్రీతిప్రకర్షత్తాలుమ్ "ఆత్మానం వాసుదేవాఖ్యం చిన్తయన్" ఎన్గిఱపడియే ఇవరై ప్పుకురనిఱుత్తిన్ తన్ వైభవత్తైయు మనుసన్ధిత్తు, "నాకమిశై త్తుయిల్వాన్పోల్ ఉలకెల్లామ్ నన్గొడుఙ్గ యోకణైవాన్" ఎన్గిఱపడియే ఎల్లారైయుమ్ ఇవరైప్పోలే నమ్బక్కలిలే ప్రవణరాక్కుమ్ విరకేతో? ఎన్ఱు తదేకాగ్రచిత్తరాయ్క్కొణ్డు పళ్ళికొణ్డరుళినార్.

"మాతరార్కయఱ్కణ్ణెన్నుమ్ వలైయుట్పట్టు" ఎన్గిఱపడియే ఇన్ద్రియవశ్యరాయ్ కైకழுన్ద వన్ఱు "అనిద్రస్సతతం రామః" ఎన్గిఱపడియే ఉఱఙ్గాతిరున్ద పెరియ పెరుమాళ్ "అడియరోర్క్కకలలామ్" ఎన్నుమ్బడి కైపుకున్ద పిన్బు కరైచ్చల్ కెట్టు మార్బిలేకై వైత్తు ఉఱఙ్గప్పుక్కార్. "ఎమ్మిరాఱ్కాట్చెయ్యాతే యెన్ శెయ్వాన్ తోన్ఱినేనే" ఎన్ఱిరుక్కుమవరాకైయాలే, కైఙ్కర్యత్వరైయాలే "ఉత్తిష్ఠ నరశార్దూల" "స మయా బోధితః" "ఉమ్బర్కోమానే! యుఱఙ్గాతెழுన్దిరాయ్" ఎన్నుమాపోలే "అరఙ్గత్తమ్మా! పళ్ళియెழுన్దరుళాయే" ఎన్ఱు తిరుప్పళ్ళియుణర్ త్తి. "ఉనక్కే నామాట్చెయ్నోమ్" ఎన్నుమాపోలే "తొణ్డరడిప్పొడియెన్ను మడియనై యళియనెన్ఱరుళి ఉన్నడియార్ క్కాట్పడుత్తాయ్" ఎన్ఱు తదీయపర్యన్తమాన కైఙ్కర్యత్తై క్కొణ్డరుళ వేణుమెన్ఱు ప్రార్థిక్కిఱారాయిరుక్కిఱతు.

తిరుప్పళ్ళి యుణర్త్తుకైక్కు నిబన్ధనమెన్? ఎన్నిల్, "ఆమ్పరిశఱిన్దుకొణ్డు" ఎన్గిఱపడియే కైఙ్కర్యయాథాత్మ్య మఱియుమవరాకైయాలే, "అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే" ఎన్ఱుమ్, "ఒழிవిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని "ఎన్గిఱపడియే పర్వదేశసర్వకాలసర్వావస్థైకళిలుమ్ సర్వవిధకైఙ్కర్యత్తైయుమ్ పణ్ణుమిడత్తిల్ తనక్కేయాక వెనై క్కొళ్ళుమీతే" ఎన్ఱు అవనుకన్ద కైఙ్కర్యమాక వేణుమ్. అతు శెయ్యుమిడత్తిల్, "క్రియతా మితి మాం వద" ఎన్ఱుమ్, "ఎనక్కే

యాట్చెయ్" ఎన్టుమ్, "ముకప్పే కూవి ప్పణికొళ్ళాయ్" ఎన్టుమ్ శొల్లుకిఱపడియే ఏవి క్కొళ్ళవేణుమెన్టిరుక్కువరాకైయాలే ప్రభాతసూచకఙ్గళై చ్చొల్లి త్తిరుప్పళ్ళి యుణర్త్తుకిఱార్.

తిరుమాలైయిల్ తిరుప్పళ్ళియెఴుచ్చిక్కు వాశి ఎన్? ఎన్నిల్, "అనాది మాయయా సుప్త"రాన ఇవరై ప్పెరియపెరుమాళుణర్త్తినార్- అతిల్; ఇవర్తమ్ పక్కల్ వ్యామోహత్తాలే సుప్తరానవవరై త్తిరుప్పళ్ళియుణర్త్తుకిఱార్- ఇతిల్. "పున్ కవితైయేలుమ్ ఎమ్బిరాఱ్కినియవాఱే" ఎన్టు వాచికకైఙ్కర్యత్తై ఇనితాకక్కైక్కొణ్డపడి శొల్లిఱ్ఱు - అతిల్. "తొడైయొత్త తుళవముమ్ కూడైయుమ్ పొలిన్దు తోన్టియ తోళ్ తొణ్డరడిప్పొడి యెన్ను మడియనై అళియనెన్టరుళి" ఎన్టైయాలే కాయిక కైఙ్కర్యత్తై ఇనితాక క్కైక్కొణ్డరుళవేణుమెన్గిఱార్- ఇతిల్. "ఎమ్బిరాఱ్కినియవాఱే" ఎన్టు పెరియపెరుమాళుక్కినితాన కైఙ్కర్యత్తై ప్పెఱ్ఱునిన్టార్ - అతిల్. "అడియార్ క్కాట్పడుత్తాయ్" ఎన్టు తదీయరుకన్ద కైఙ్కర్యత్తై యపేక్షిక్కిఱార్ - ఇతిల్. అతిల్- పెరియపెరుమాళుడైయ కృషి ఫలిత్తపడి శొల్లిఱ్ఱు. ఇతిల్- ఇవరుడైయ కృషి ఫలిత్తపడి శొల్లుకిఱదు. "ఎళియతోరరుళుమన్టే యెన్ తిఱత్తు" ఎన్టు తమ్మై విషయీకరిక్కవేణుమెన్టార్ - అతిల్. "అవర్క్కు నాళోలక్కమరుళ" ఎన్టు పరసమృద్ధియై ఆశాసిక్కుమ్బడి పాకమ్ పిఱన్దపడి శొల్లుకిఱతు -ఇతిల్.

పెరియవాచ్చాన్‌పిళ్ళై అరుళిచ్చెయ్ద అవతారికై ముఱ్ఱిఱ్ఱు

""""""""

## అరుమ్బుదమ్

*ప్రవేశే : ఆవరనుకూలరాన పిన్బు ఉఱఙ్గుకిఱార్ ఎన్టైక్కు ఉఱక్క మిల్లైయో? ఎన్న? అరుళిచ్చెయ్‌కిఱార్. (మాతరారిత్యాది).*

*ఆనాల్ ఎఴుప్పువానెన్? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (ఎమ్బిరాఱ్కిత్యాది) ఆనాలుమ్ నిర్బన్దిత్తు ఎఴుప్పుకైక్కు నిబన్ధనమేతు? ఎన్న, శఙ్కాపూర్వకమాక అరుళిచ్చెయ్‌కిఱార్. (తిరుప్పళ్ళి యిత్యాది).*

### భావదీపిక వివరణం - అవతారిక

"అనాదిమాయయా సుప్తో యథా జీవః ప్రబుధ్యతే" (గౌడపాదకారిక) (అనాది అయిన మాయతో నిద్రించే జీవుడు ఎపుడు మేల్కొంటున్నాడో) అనే రీతిలో అనాదికాలంగా అజ్ఞానంవల్ల నిద్రిస్తూ ఉండే ఈ ఆఴ్వార్లను పెరియ



పెరుమాళ్ తమ అంతు లేని నిర్హేతుకకృపతో **"మయర్వఱ మదినలమ్ అరుళినన్"** (దోషం లేని భక్తిరూపాన్ని జ్ఞానాన్ని అనుగ్రహించాడు) అనే రీతిలో దోషరహితమైన, భక్తిరూపాపన్న జ్ఞానాన్ని కల్గించి, ప్రబోధాన్ని కల్గించగా, స్వరూపజ్ఞానాన్ని పొందారు. ఈ విధంగా విశుద్ధమైన జ్ఞానాన్ని పొందిన ఆఴ్వార్లద్వారా శ్రీరంగనాథుడు "శ్రీరంగనాథుడే ప్రాప్యం, ప్రాపకం'' అనే విషయాన్ని తిరుమాలై ప్రబంధంలోని **"మేమ్బొరుళ్" (38)**అని ప్రారంభమయే పాశురముఖంగా **"ఐమ్బులనకత్తడక్కి కామ్బఱత్తలై శిరైత్తున్ కడైత్తలై యిరున్దు వాఴుమ్ శోమ్బరై యుకత్తి"** (పంచేంద్రియాలను లోపల అణచి, ఉపాయాంతరాలలో సంబంధాన్ని సమూలంగా పోగొట్టుకొని నీ వాకిటిలోనే పడి ఉండి ఉజ్జీవించే సోమరులను చూచి సంతోషిస్తావు) అని సుస్థిరం చేసి, తిరుమాలై ప్రబంధంద్వారా లోకానికి జ్ఞానవైశద్యాన్ని కల్గించి, మనస్సులో కలత తీరినవాడై శయనించగా, ఈ ఆఴ్వార్లు పెరియ పెరుమాళ్‌ను మేల్కొలుపు పల్కుతూ తిరుప్పళ్ళియెఴుచ్చి అనే ఈ దివ్యప్రబంధాన్ని పాడి, భగవానునకు కైంకర్యం చేయాలని ఆశపడుతున్నారు.

ఈ ఆఴ్వార్లు అనాదికాలంగా సంసారిగా ఉండి, **"మాఱి మాఱి ప్పల పిఱప్పుమ్ పిఱన్దు"** (తిరువాయ్-2-6-5) (మాటిమాటికి పలు జన్మలను ఎత్తి) అనే రీతిలో పలు జన్మలను ఎత్తి, జీవిస్తూ తమ (జీవ) స్వరూపం ఎటువంటిది? తాము పొందదగిన ప్రయోజనం ఏది ? దానికి ఉపాయం ఏది ? అనే జ్ఞానాన్ని లేనివారై, దేహాన్నే ఆత్మగా భావించి, ఈ దేహంతో అనుభవింపబడే శబ్దస్పర్శ రూపరసగంధాలనే ప్రాకృతవిషయాలలో అభినివేశాన్ని పొంది, తమతో చేరినవారినికూడ తమవలె విషయాంతరప్రావణ్యాన్ని కలవారినిగా చేశారు. ఇపుడు ఈ జన్మలో **"మాదరార్ కయిఱ్కణెన్నుమ్ వలైయుళ్ పట్టు అఴున్దువేనై ప్పోదరే! ఎన్టు శొల్లి ప్పున్దియిల్ పుకున్దు తన్‌పాల్ ఆదరమ్ పెరుకవైత్త అఴకన్"** (తిరుమాలై-16) (స్త్రీల చేపలవంటి కన్నులనే వలలో చిక్కుకొని, లౌకిక భోగాలలో మునిగిన నన్ను, "ఇటు రా'' అని పల్కి నా మనస్సులో ప్రవేశించి తన పట్ల ఆదరాన్ని వృద్ధి చేసిన సుందరుడు) తన రూపసౌందర్యాన్ని దర్శింపజేసి, వీరికి (ఆఴ్వార్లకు) ప్రాకృత విషయాలలో కల్గిన అభినివేశాన్ని పోగొట్టి, తమ శేషత్వస్వరూపానికి తగినట్లు తనపట్ల గొప్ప ఆదరాన్ని కల్గి ఉండేటట్లు చేయగా, ఈ ఆఴ్వార్లుకూడా ఆ ఆనందంవల్ల చేసే కైంకర్యాలను చేయాలని ఆశపడి, శ్రీరంగనాథుని శ్రీచరణాలను ఆశ్రయించారు. అపుడు శ్రీరంగనాథుడు వీరిని తిరునేత్రాలతో చల్లగా

కటాక్షించడం, చేతులను చాచి ఆలింగనం చేసికోవడం, యోగక్షేమాలను విచారించడం, **"యాః క్రియాః సంప్రయుక్తాః స్యుః ఏకాంతగతబుద్ధిభిః తాః సర్వాః శిరసా దేవః ప్రతిగృహ్ణాతి వై స్వయమ్"** (భారత-మోక్ష-171-63) (మఱచిపోయి అయినా ఇతరదేవతలను కొలువని అనన్యభక్తిలో స్థైర్యాన్ని కలవారిచేత ఏయే క్రియలు (కైంకర్యాలు) చక్కగా అనుష్ఠింపబడుతున్నాయో, వాటిని అన్నిటినీ భగవానుడు స్వయంగా శిరస్సుతో (ఆదరంతో) పరిగ్రహిస్తున్నాడు) అనే రీతిలో ఈ ఆழ్వార్లు అలంకరించుకొన్న మాలికలను తలలో ధరించడం మొదలైన కార్యాలను చేయకుండా శయనించి ఉన్నాడు.

దానికి కారణం - శ్రీరంగనాథునకు వీరిపట్ల ఉండే అనాదరమేనని చెప్పడానికి వీలులేదు; ఎందుకు? అంటే, వీరు ఆ స్వామికి మిక్కిలి ఇష్టమైనవారే కదా! శ్రీరంగనాథుడు భుజించిన అన్నం జీర్ణం కానందువల్లనో, తమోగుణం ఆవరించి నందువల్లనో తూగుతున్నాడు- అని కూడా చెప్పడానికి వీలులేదు; ఎందుకు? అంటే, శ్రీరంగనాథుడు శుద్ధసత్వమయమైన తిరుమేనిని కల్గినవాడు కనుక, అతనికి ఈ దోషాలు ఏమీ లేవు. అయితే మఱి దీనికి కారణమేమి ? అని అంటే, **"ఆదలాల్ పిఱవి వేణ్డేన్"** (తిరుమాలై-3) (అందువల్ల జన్మవద్దు) అనే రీతిలో ఆழ్వార్లు దేహసంబంధం తమ స్వరూపానికి తగనిది- అనే జ్ఞానాన్ని కల్గినవారనే విషయాన్ని, **"పోనకమ్ శెయ్ద శేషమ్ తరువరేల్ పునిదమన్ఱే"** (తిరుమాలై-11) (భగవద్భక్తులు తమ భుక్తశేషాన్ని అనుగ్రహిస్తే అది పవిత్రం కదా) అనే రీతిలో అతని భక్తులకు కూడా (శేషమై) దాసులై ఉండాలి అనే పర్యంతం ఆழ్వార్లకు స్వరూపజ్ఞానం కల్గిన రీతిని, **"ఇచ్చువై తవిర యాన్ పోయ్... అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్"** (తిరుమాలై-2) (ఈ లోకంలో భగవదనుభవరసాన్ని కాదని నేను పోయి పరమపదానుభవాన్ని పొందాలని కోరను) అని ప్రకృతి-పురుషులనుగూర్చిన యథార్థజ్ఞానం కల్గిన రీతిని, **"కావలిల్ పులనై వైత్తు"** (తిరుమాలై-1) (ఇంద్రియాలను కావలిలో పెట్టి) అనే రీతిలో ఇంద్రియనిగ్రహం కల్గిన రీతిని, **"కుళిత్తు మూన్ఱనలై యోమ్బుమ్ కుఱికొళ్ అన్దణమై తన్నై"** (తిరుమాలై-25) (నిత్యస్నానాదులు చేసి, త్రేతాగ్నులను ఆరాధిస్తూ, మంత్రలోపాదులు కలుగకుండా రక్షించదగిన బ్రాహ్మణ్యాన్ని) అనే రీతిలో ఉపాయాంతరాలలో సంబంధం లేని రీతిని, **"ఉన్నరుళెన్ను మాశైతన్నాల్ పొయ్యనేన్ వన్దు నిన్ఱేన్"** (తిరుమాలై-33) (నీ అనుగ్రహం కార్యకరం అనే ఆశచేత నీ సన్నిధికి వచ్చి నిలచాను. అన్నివిధాల



అయోగ్యుడనై ఉన్నవాడను) అనే రీతిలో "భగవానుని కరుణయే ఉపాయం" అనే యథార్థజ్ఞానం కల్గిన రీతిని అనుసంధించి, **"శోమ్బరై యుకత్తి పోలుమ్"** (తిరుమాలై-38) (నీ వాకిటిలో నిలచి స్వప్రయత్నాన్ని విరమించిన సోమరులను చూచి నీవు సంతోషిస్తావు.) అనే రీతిలో "పూర్వం ఆ విధంగా ఉన్న ఈ ఆழ్వార్లు ఈవిధంగా సంస్కరింపబడ్డారు కదా!" అనే ఆనందాతిశయంచేత **"ఆత్మమాయామయీం దివ్యాం యోగనిద్రాం సమాశ్రితః, ఆత్మానం వాసుదేవాఖ్యం చింతయన్ మధుసూదనః"** (విష్ణు.పు-6-4-6) (వాసుదేవుడనే పేరును కల్గిన తన స్వరూపాన్ని చింతిస్తూ, తనకు చెందినదైన మూలప్రకృతికి అభిమానదేవత అయిన యోగనిద్రను ఆరోపించుకొన్నవాడయ్యాడు) అనే రీతిలో శ్రీరంగనాథుడు ఆழ్వార్లను ఈ విధంగా చేసిన తన గొప్పతనాన్ని అనుసంధించుకుంటూ, **"నాకమిశై త్తుయిల్వాన్పోల్ ఉలకెల్లామ్ నన్గొడుజ్ఞ యోకణైయాన్"** (తిరువాయ్-4-8-9) (ఆదిశేషుడనే పడుకపై పరుండి యోగనిద్రను చేస్తూ సమస్తలోకాల రక్షణను గూర్చిన ఉపాయచింతను చేసేవాడు) అనే రీతిలో "చేతనులను అందఱిని వీరివలె నాపట్ల అభినివేశాన్ని కలవారుగా చేసే దారి ఏది ?" అనే జగద్రక్షణ చింతలోనే నిమగ్నుడై శయనించి ఉన్నాడు కనుక, ఆழ్వార్లు వచ్చిన సంగతిని గమనించలేదు.

**"మాదరార్ కయిఱ్కణెన్నుమ్ వలైయుళ్"** (తిరుమాలై-16) (స్త్రీల చేపలవంటి కన్నులు అనే వలలో) అనే రీతిలో ఈ ఆழ్వార్లు ఇంద్రియాలకు పశపడి దూరమైన కాలంలో **"అనిద్రస్సతతం రామః సుప్తోఽపి చ నరోత్తమః, సీతేతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతిబుధ్యతే"** (రామా-సుందర-36-44) (సీతను విశ్లేషించిన శ్రీరాముడు ఎల్లప్పుడు నిద్ర లేనివాడుగానే ఉన్నాడు. నరశ్రేష్ఠుడైన అతడు ఒకవేళ నిద్రించినా, "సీతా!" అనే అందమైన మాటను పల్కుతూ మేల్కొంటున్నాడు) అనే రీతిలో నిద్రించకుండా ఉండే పెరియపెరుమాళ్, **"అడియరోర్క్కకలలామే"** (తిరుమాలై-20) (దాసులను విశ్లేషింపవచ్చునా?) అనే రీతిలో ఈ ఆழ్వార్లు తనకు వశమైన తరువాత ఏ బాధలేకుండా గుండెలపై చేయి వేసికొని నిద్రపోయాడు. ఈ ఆழ్వార్లు **"ఎమ్బిరాఱ్కాట్చెయ్యాదే ఎన్శెయ్వాన్ తోన్ఱినేనే"** (తిరుమాలై-28) (భగవానునకు కైంకర్యం చేయకుండా ఏమి చేయడం కోసం పుట్టాను?) అని కైంకర్యం చేయడమే జన్మ ఎత్తినందులకు ప్రయోజనం అని భావించేవారు కనుక, కైంకర్యాన్ని చేయడంలోని వేగంచేత,

**'కౌసల్యాసుప్రజా రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్"** (రామా-బాల-23-2) (కౌసల్యాదేవికి సత్పుత్రుడవైన శ్రీరామా! తూర్పు దిక్కున సంధ్య ప్రవర్తిస్తున్నది. నరులలో శ్రేష్ఠుడైనవాడా ! ప్రాతః కాలంలో దైవారాధనకు సంబంధించిన కర్తవ్యాలను చేయాలి. నిద్రనుండి లే) అనే రీతిలో విశ్వామిత్రుడు నిద్ర లేపినట్లుగా, **"వాయసేన తతస్తేన బలవత్ క్లిశ్యమానయా, స మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః"** (రామా- సుందర-38-25) (తరువాత ఆ కాకాసురునిచేత బలాత్కారంగా బాధింపబడ్డ నాచే, సుఖంగా నిద్రిస్తున్నవాడు, (అందువల్ల శయన) సౌందర్యాన్ని కలవాడు (ఆ స్థితిలోకూడా) శత్రువులను తపింపజేసేవాడు అయిన శ్రీరాముడు మేల్కొలుపబడ్డాడు) అని సీతాదేవి నిద్ర లేపినట్లుగా, **"ఉమ్బర్కోమానే! ఉఱజ్గాదు ఎఴున్దిరాయ్"** (తిరుప్పావై-17) (పరమపదనాథా! నిద్రింపకుండా మేలుకో) అని గోదాదేవి నిద్రలేపినట్లుగా, **"అరజ్గత్తమ్మా! పళ్ళి యెఴున్దరుళాయే"** అని అంటూ వీరుకూడా మేల్కొలుపును పాడి, **"ఉనక్కే నామ్ ఆట్చెయ్వోమ్"** (తిరుప్పావై-17) (నీకే కైంకర్యం చేస్తాము) అని ఆణ్డాళ్ భగవానునకు ప్రీతికరమైన కైంకర్యాన్ని చేయాలని ఆశపడినట్లే, **"తొణ్డరడిప్పొడి ఎన్నుమ్ అడియనై అళియనెన్ఱరుళి ఉన్నడియార్ క్కాట్పడుత్తాయ్"** (తిరుప్పళ్ళి-19) (తొణ్డరడిప్పొడి అనే దాసుని కృపకు తగినవాడని అనుగ్రహించిన దాసులకు శేషభూతునిగా చేశావు.) అని ఈ ఆఴ్వార్లు భగవద్భక్తుల పర్యంతమైన కైంకర్యాన్ని చేయాలని ప్రార్థించేవారై ఈ ప్రబంధాన్ని ముగించారు.

ఇంతేకాక, "ప్రాప్యప్రాపకాలు రెండు భగవానుడే'' అనే నిశ్చయాన్ని పొందితే, ఆ పిమ్మట అతడు మేల్కొనే ప్రకారాన్ని, అందమైన సింహాసనంలో వేంచేసి ఉండే రీతిని దర్శించి ఆనందించి, సన్నిధిలో పూమాలికలను సమర్పించి, దాస్యాన్ని చేయాలని ఆశపడి, ఇదే జీవనయాత్రగా కోరేటట్లుగాకదా భావన కల్గుతుంది. గోదాదేవికి కూడా **"మారిమలై ముఴఞ్జిల్"** (తిరుప్పావై-23) (వర్షాకాలంలో కొండగుహలో) అనే పాశురంలో ఇటువంటి స్థితియేకదా కల్గింది. నమ్మాఴ్వార్లు కూడా **"నెడుమాఱ్కడిమై"** (తిరువాయ్-8-10) అనే దశకంలో పొందే ప్రాప్యం యొక్క పరమావధి భాగవతకైంకర్యమేనని నిశ్చయించి, **"కొణ్డపెణ్డిర్"** (తిరువాయ్-9-1) అనే అనంతర దశకంలో లోకానికి హితోపదేశం చేసి, దానికి పిమ్మట గల దశకంలో **"కిడన్దనాళ్ కిడన్దాయ్ ఎత్తనై కాలమ్ కిడత్తి ?"** (తిరువాయ్-9-2-3) (పరుండినంత కాలం పరుండి ఉన్నావు. ఇక ఎంతకాలం పరుండి ఉంటావు?)



అనే రీతిలో భగవానుని మేల్కొలిపి, కైంకర్యం చేయాలని ఆశపడ్డారుకదా! అందువల్ల వీరు కూడా నమ్మాఴ్వార్లు, గోదాదేవి, విశ్వామిత్రుడు మొదలైనవారివలె శ్రీరంగనాథుడు మేల్కొనేటపుడు ప్రకాశించే అందాన్ని దర్శించి, కైంకర్యం చేయాలని ఆశపడి, తిరుప్పళ్ళియెఴుచ్చిని పాడుతున్నారు.

ఈ ఆఴ్వార్లు, భగవానుని నిర్బంధించి మేల్కొలుపు పాడడానికి కారణమేమి? అంటే, **"ఆమ్బరిశు అఱిన్దు కొణ్డు"** (తిరుమాలై-38) (కైంకర్యమే పరమపురుషార్థమని తెలిసి) అనే రీతిలో "భగవానుడు మెచ్చిన కైంకర్యమే ప్రాప్యం'' అనే సత్యాన్ని తెలిసినవారు కనుక, **"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** (నీవు వైదేహితో పాటుగా పర్వత సానువులలో విహరించేటపుడు నేను మీరిరువురు మేల్కొని ఉన్నపుడు, నిద్రించేటపుడు, మీకు అన్నివిధాలైన కైంకర్యాలను చేస్తాను) అని, **"ఒఴివిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని"** (తిరువాయ్-3-3-1) (విచ్ఛేదం లేకుండా కాలం అంతా స్థిరంగా నిలచి ఉండి) అని చెప్పే రీతిలో సర్వదేశ-సర్వకాల-సర్వావస్థలలోని అన్నివిధాలైన కైంకర్యాలను చేసేటపుడు **"పరవానస్మి కాకుత్స్థ ! త్వయి వర్షశతం స్థితే, స్వయం తు రుచిరే దేశే క్రియతామితి మాం వద"** (రామా-ఆరణ్య-1-57) (కకుత్స్థుని వంశంలో జన్మించిన శ్రీరామా ! నీవు నూఱు సంవత్సరాలు ఉన్నా, నీ ఎదుట నీకు నేను పరతంత్రుడనే. అందువల్ల, నీవే స్వయంగా'' అందమైన చోట పర్ణశాలను నిర్మించు'' అని నన్ను ఆజ్ఞాపించు) అనే ప్రమాణరీతిలో, **"ఎనక్కే ఆట్చెయ్"** (తిరువాయ్-2-9-4) (నాకే సేవ చెయ్యి) అని, **"ముకప్పే కూవి ప్పణి కొళ్ళాయ్"** (తిరువాయ్-8-5-7) (సమక్షంలోకి పిలచి నా సేవను పరిగ్రహించు) అని గల పాశురాలలో తెలుపబడినరీతిలో భగవానుడు నియమించి కైంకర్యాన్ని నానుండి పరిగ్రహించాలి- అని భావించేవారు కనుక, అతని నియమనాన్ని పొందడంకోసం "పొద్దు పొడిచింది'' అనే దానికి కొన్ని చిహ్నాలను పల్కి మేల్కొలుపు పల్కుతున్నారు. కనుక, ఇందులో నిర్బంధం ఏమీ లేదు.

తిరుమాలై ప్రబంధంకంటే తిరుప్పళ్ళిఎఴుచ్చికి గల వైలక్షణ్యం ఏమి? అంటే- **"అనాదిమాయయా సుప్తః యదా జీవః ప్రబుధ్యతే"** (గౌడపాదకారిక) (అనాదియైన మాయచేత నిద్రపోతున్న జీవుడు ఎపుడు మేల్కొంటాడో) అనే ప్రమాణానుసారం అనాదికాలంగా నిదురిస్తున్న వీరిని పెరియపెరుమాళ్

ప్రబోధించారు- తిరుమాలై ప్రబంధంలో. ఈ తిరుప్పళ్ళి ఎழுచ్చి ప్రబంధంలో- ఈ ఆழ்్వార్లపట్ల గల గొప్ప వ్యామోహంవల్ల నిద్రించే శ్రీరంగనాథుని ఆழ்్వార్లు నిద్రలేపుతున్నారు. **"ఇళైయ పున్ కవిత్తైయేలుమ్ ఎమ్బిరాఱ్కు ఇనియవాఱే"** (తిరుమాలై-45) (చిన్న చిన్న పదాలను కల్గినది, దోషాలను కల్గినది అయినా నా కవిత్వం భగవానునకు ఇంపుగా ఉన్నదే ! ఆహా !) అని వాక్కుతో చేసే కైంకర్యాన్ని శ్రీరంగనాథుడు భోగ్యంగా స్వీకరించిన రీతిని తిరుమాలై ప్రబంధంలో పలికారు. **"తొడైయొత్త తుళపముమ్ కూడైయుమ్ పొలిన్దు తోన్ఱియ తోళ్ తొణ్డరడిప్పొడి యెన్నుమ్ అడియనై అళియనెన్ఱరుళి"** (తిరుప్పళ్ళి-10) (చక్కగా కూర్చిన తులసిమాలను, పూలబుట్టను కల్గి ప్రకాశించే బాహువులను కల తొణ్డరడిప్పొడి అనే దాసుని కృపకు యోగ్యుడు అని అనుగ్రహించి) అని పల్కినందువల్ల కాయికంగా చేసే కైంకర్యాన్ని భోగ్యంగా పరిగ్రహించాలని ప్రార్థిస్తున్నారు- ఈ తిరుప్పళ్ళి ఎழுచ్చిప్రబంధంలో. **"ఎమ్బిరాఱ్కినియవాఱే"** (తిరుమాలై-45) (భగవానునకు ఇంపుగా ఉన్నదే! ఆహా!) అని శ్రీరంగనాథుడు ఆనందించే కైంకర్యాన్ని పొందారు- తిరుమాలై ప్రబంధంలో. **"అడియార్ క్కాట్పడుత్తాయ్"** (తిరుప్పళ్ళి-10) (భక్తులకు శేషభూతునిగా చేశావు) అని అతని భక్తులు మెచ్చిన కైంకర్యాన్ని ప్రార్థిస్తున్నారు- ఈతిరుప్పళ్ళి ఎழுచ్చి ప్రబంధంలో. తిరుమాలై ప్రబంధంలో పెరియపెరుమాళ్ పొందాలని వీరు ప్రయత్నించిన రీతి తెలుపబడింది. తిరుప్పళ్ళిఎழுచ్చి ప్రబంధంలో పెరియపెరుమాళ్ ప్రయత్నం ఫలించి అతడు వీరిని పొందిన రీతి తెలుపబడుతున్నది. **"ఎళియతోరరుళుమన్ఱే ఎన్ తిఱత్తు"** (తిరుమాలై-37) (నాపట్ల అతడు చేయవలసినది ఒకసారి కటాక్షించడమే కదా!) అనే రీతిలో తమను కటాక్షించాలిన ఆழ்్వార్లు తిరుమాలై ప్రబంధంలో ప్రార్థించారు. **"అవర్క్కు నాళోలక్కమ్ అరుళ"** (తిరుప్పళ్ళి-9) (వారిని పగటి సభలో అనుగ్రహించడం కోసం) అని ఇతరులను కటాక్షించమని ప్రార్థించే పరిపక్వదశ తమకు కల్గిన రీతి ఆழ்్వార్లు ఈ తిరుప్పళ్ళి ఎழுచ్చిలో పల్కుతున్నారు. ఇవి, తిరుమాలై ప్రబంధం, తిరుప్పళ్ళి ఎழுచ్చి ప్రబంధాల మధ్య ఉండే వైలక్షణ్యాలు.

ఇక, ఈ తిరుప్పళ్ళి ఎழுచ్చి సారార్థం ఏమంటే- "సూర్యుడు ఉదయగిరిపైకి వచ్చాడు. తిరువారాధనకు కావలసిన అన్ని ఉపకరణాలను చేతిలో గ్రహించి, తమను ఆరాధించదగినవారనే (ఆరాధ్యులుగా) అహంకారాన్ని కల్గిన దేవతలు, ప్రభువులు తమ అహంకారం అంతా తీరిపోగా, నీ కటాక్షం సోకడానికి వీలుండే



దక్షిణ దిక్కులో ప్రథమవీక్షణాన్ని పొందడంకోసం "నేను ముందు, నేను ముందు" అని ఒకరికొకరు తీసికొంటూ ముందుకు వచ్చి నిలుచున్నారు. అందఱిని రక్షించేవాడవు, లక్ష్మీనాథుడవు, భక్తులపట్ల గొప్ప ప్రేమను కలవాడవు అందఱిచే ఆరాధించదగినవాడవైన నీవు, 'దాసుడనైన నాకోసం మేల్కొన్నావు' - అనే వైలక్షణ్యాన్ని నాకు కల్గించి, శయ్యపైనుండి నిద్రలేచి దాసులమైన మానుండి కైంకర్యాన్ని నియమించి స్వీకరించాలి." అనేది ఈ ప్రబంధసారం. బిడ్డలను చూపి "మేము బ్రతికే దారిని కల్గించాలి" అని ప్రభువులను వేడే ప్రజలవలె, భగవానునకు ఆరాధనను చేసే దేవతలను పురస్కరించుకొని, తమకు ప్రాప్యమైన కైంకర్యాన్ని ఆழ்్వార్లు ప్రార్థిస్తున్నారు- ఈ దివ్యప్రబంధంలో.

**అవతారిక భావదీపిక వివరణం ముగిసింది.**

శ్రీమతే రామానుజాయ నమః

తొణ్డరడిప్పొడియాళ్వార్ అరుళిచ్చెయ్త

# తిరుప్పళ్ళియెళుచ్చి

1. కతిరవన్ కుణతిశై చ్చికరమ్ వన్దణైన్దాన్
కనవిరుళకన్దతు కాలైయమ్బొళుతాయ్
మతువిరిన్దొళుకిన మామలరెల్లామ్
వానవరరశర్కళ్ వన్దు వన్దీణ్డి
ఎతిర్తిశై నిఱైన్దనర్ ఇవరొడుమ్ పుకున్ద
ఇరుజ్గళిఱ్ఱీట్టముమ్ పిడియొడు మురశుమ్
అతిర్తలిల్ అలైకడల్ పోన్ఱుళతెజ్గుమ్
అరజ్గత్తమ్మా ! పళ్ళి యెళున్దరుళాయే

అరజ్గత్తు అమ్మా = శ్రీరంగంలో ఆదిశేషునిపై శయనించి ఉండే స్వామీ!, కతిరవన్ = సూర్యుడు, కుణ దిశై = తూర్పుదిక్కులో, శికరమ్ = ఉదయాద్రి శిఖరంపై, వన్దు అణైన్దాన్ =వచ్చి చేరాడు, కన ఇరుళ్ = రాత్రివేళలో దట్టంగాఉండే చీకటి, అకన్దదు = తొలగిపోయింది, అమ్ = అందమైన, కాలై పొళుతు ఆయ్= ప్రాతఃకాలం కాగా, మా మలర్ ఎల్లామ్ = గొప్ప పుష్పాలు అన్నీ, విరిన్దు = వికసించి, మతు ఒళు కిన = మకరందం స్రవిస్తున్నవి, వానవర్ = దేవతలు, అరశర్కళ్ = ప్రభువులు, వన్దు వన్దు= ఒకరికంటే ఇంకొకరు ముందంజ వేసి వచ్చి, ఈణ్డు = సమూహంగా చేరి, ఎతిర్ తిశై = నీ కటాక్షం సోకే దక్షిణ దిక్కులో, నిఱైన్దనర్ = గుమిగూడి నిండుగా ఉన్నారు, ఇవరొడుమ్ పుకున్ద = వీరితో పాటు వచ్చిన (వీరి వాహనాలైన), ఇరు కళిఱు ఈట్టముమ్ = గొప్ప మగ ఏనుగుల సమూహాలుకూడ, పిడి యొడు = ఆడ ఏనుగుల గుంపులతో, మురశమ్= గొప్ప వాద్యాలు, అతిర్దల్ ఒలి = శబ్దిస్తూ ఉండగా, ఎజ్గుమ్ = అంతట, అలై =అలలు లేచే, కడల్ పోన్ఱు ఉళదు = సముద్రఘోషవలె ఉన్నది. అందువల్ల, పళ్ళి ఎళున్దరుళాయ్ = (నీవు) శయ్యనుండి నిద్రలేవాలి.

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

*అవతారికై : ముతప్పాట్టు - "యస్యావతారరూపాణి నమస్యన్తి దివౌకసః" ఎన్నుమ్బడియే ఆరాధకరాన దేవజాతికళ్ అవసరప్రతీక్షరాయ్ వన్దు నిన్ఱార్కళ్. తిరుప్పళ్ళి యుణర్న్దరుళ వేణుమ్ - ఎన్గిఱార్.*



*వ్యాఖ్యానమ్ : (కతిరవ నిత్యాది) తన్నుడైయ ఆయిరమ్ కిరణజ్గళాలుమ్ జగత్తిల్ అన్ధకారత్తై నీక్కి వెళిచ్చెఱిప్పై ప్పణ్ణవల్ల ఆదిత్యనానవన్ కిళక్కిలే ఉదయగిరియిలే వన్దు సజ్గతనావాన్. అవనుక్కడుత్తాప్పోలే కోయిలాయిఱ్ఱు క్కాణుమ్. తిరువడికళుమ్ అద్దిక్కిలేయాక ప్పెఱ్ఱతు. అడియిలుమ్ ముడియిలుమ్ ఆదిత్యర్కళ్ వన్దునిఱ్క నడువే కిడన్దు కణ్వళర్న్దరుళుకిఱతెన్? "కతిరాయిరమిరవి కలన్దెరిత్తాలొత్త నీణ్ముడి"యిఱే. "మిక్క శెఞ్జుడర్ ప్పరితి" ఎన్నక్కడవతిఱే.*

*(కనవిరుళకన్దతు) - రాత్రియిల్ మిక్క ఇరుళానతు సవాసనమాక ప్పోయిఱ్ఱు. (కాలైయమ్బొళుతాయ్) ఆరాధకర్ ఆరాధనార్థమాక ఉద్యోగిక్కక్కడవ కాలమాయిఱ్ఱు. (మతు విరిన్దొళుకిన మామలరెల్లామ్) ఉదయఫలమాక ఆరాధనోపకరణమాన పుష్పజ్గళ్ వికసితమాయ్ మధు వెళ్ళమిడానిన్ఱన.*

*(వానవరిత్యాది) దుర్మానికళాన దేవర్కళుమ్, రాజాక్కళుమ్ భగ్నాభిమానరాయ్ తన్దాముడైయ పదసిద్ధిక్కుమ్ ఆపన్నివృత్తిక్కుముడలాక ఒరువర్క్కొరువర్ ముఱ్కోలి త్తిరణ్డనర్కళ్. (ఎతిర్ తిశై యిత్యాది) తిరుక్కణ్ణోక్కాన తెఱ్కుదిక్కిలే వివరమఱ ప్పుకున్దునిన్ఱార్కళ్. (ఇవరొడుమ్ పుకున్ద ఇత్యాది) ఇవర్కళేఱుమ్, వాహనజ్గళాన కళిఱుకళుమ్, పిడికళుమ్ మురశినుడైయ ధ్వనికళుమాయ్ త్తిరణ్డు నెరుజ్గి నిన్ఱు ధ్వనిక్కిఱ ధ్వనియానతు అలై యెఱియానిన్ఱ సముద్రఘోషమ్బోలే ఎజ్గుమ్ ఘోషియానిన్ఱతు.*

*(అరజ్గత్తమ్మా పళ్ళి యెళున్దరుళాయే) - ఉభయవిభూతినాథత్వమ్ తోఱ్ఱ శెజ్గోలుడైయ తిరువరజ్గచ్చెల్వనారాన దేవరీర్ అనన్యగతియాన అడియేనుక్కాక త్తిరుప్పళ్ళి యుణర్న్దరుళి అడిమై కొణ్డరుళవేణుమెన్గిఱార్.*

## పెరియవాచ్చాన్బిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై : ముతప్పాట్టు (కతిరవనిత్యాది) ఆదిత్యనానవన్ తన్ స్వరూపసిద్ధిక్కాక విళక్కాయ్ వన్దు తోఱ్ఱినాన్. అవనై కుశలప్రశ్నమ్ పణ్ణవేణ్డావో? ఎన్గిఱార్. "వెయ్య కతిరోన్ విళక్కాక" ఎన్ఱారిఱే.

నాట్టై యెల్లా మెళుప్పుకిఱ ఆదిత్యన్ ఉదిత్తాల్ ఎజ్గళాదిత్యన్ ఉదిక్క వేణ్డావో? బాహ్యమాన అన్ధకారమిఱే అవనాలే పోక్కలావతు. ఆన్తరమాన అన్ధకారమ్

పోక్కుమ్బోతు దేవరీర్ ఉణర్న్దరుళ వేణ్డావో? ఆదిత్యన్ ఉదయపర్వతత్తై వన్దణై యానిన్ఱాన్. ఇరుళ్ నీఙ్గానిన్ఱతు. సమారాధనోపకరణమాన తిరుప్పడిత్తామఙ్గళ్ వికసితమాకానిన్ఱన. ఆరాధ్యర్ దేవరీరెన్ఱు ఆరాధిప్పారెల్లామ్ తన్దామ్ పరికరఙ్గళోడే వన్దార్కళ్. ఇత్తై యెల్లామడైయ దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళి విశేషకటాక్షమ్ పణ్ణి యరుళవేణుమెన్గిఱార్.

వ్యాఖ్యానమ్ : (కతిరవన్ కుణతిశై చ్చికరమ్ వన్దణైన్దాన్) కణ్వళర్న్దరుళుకిఱ దేవరీర్క్కు ప్రాతఃకాలత్తిలే సన్ధ్యాదీపమ్ కొణ్డువరువారైప్పోలే దినకరనానవన్ తన్ కిరణఙ్గళెల్లావఱ్ఱోడుమ్ కీఴ్దిక్కిల్ ఉదయగిరియై వన్దణైయానిన్ఱాన్.

"కతిరవరవరవర్ కైన్నిరై కాట్టినర్", "నారణన్తమరై క్కణ్డుకన్దు" ఎన్ఱు దేవరీరుడైయార్ అర్చిరాదిగతియే పోమ్బోతు అతివాహికర్ తన్దామ్ పదఙ్గళ్ నిలై నిన్ఱుక్కాక దేవరుడైయార్క్కు త్తరమ్ కొడుత్తు విళక్కుడైయారోపాతి వకుత్త విషయత్తిల్ కిఞ్చిత్కరియాతిరార్కళిఱే. కణ్వళర్న్దరుళుకిఱ దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళువతెప్పోతో? ఎన్ఱు అవసరప్రతీక్షనాయ్ "భీషోదేతి సూర్యః" ఎన్గిఱపడియే కీఴ్దిక్కిల్ ఉదయగిరియిలే వన్దు తోన్ఱినాన్. కున్ఱత్తిట్ట విళక్కాక ఉదయపర్వతత్తిన్ అరుకే ఊరైయుమ్ శోలైయైయుమ్ కణ్వళర్న్దరుళుకిఱ పడియైయుమ్ కాణ్టైయిలుణ్డాన ఆశైప్పాడుతోన్ఱ వన్దుకొడునిన్ఱాన్.

(కనవిరుళకన్ఱతు) ఆదిత్యన్ వరవుక్కు త్తక్కపడియే శెఱిన్ద ఇరుళావతు కుఱైయ వాఙ్గిఱ్ఱు. 'ఇరుళ్ వీఱ్ఱిరున్దతు పార్ ముఴుతుమ్" ఎన్గిఱపడియే రాజాజ్ఞైయై భఙ్గిత్తు వన్నియర్ కుఱుమ్బు శెయ్యుమాపోలే సామ్రాజ్యమ్ పణ్ణిఱ్ఱు. మతిప్పనాన రాజా సపరికరనాయ్ ఎడుత్తువిట్టవాఱే ఒరు పయణమ్ కుఱైయ వాఙ్గుమాపోలే ఇరుట్టుమ్ ఒరు పయణమ్ కుఱైయ వాఙ్గిఱ్ఱు.

(కాలైయమ్ పొఴుతాయ్ మతు విరిన్దొఴుకిన మామలరెల్లామ్) - ఇరుట్టు ప్పోయ్ నిన్ఱవళవిలే "బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ", "శిఱ్ఱమ్ శిఱుకాలే" ఎన్గిఱపడియే సమారాధనయోగ్యమాన అఴకియ కాలమాయ్, అక్కాలత్తిలే దేశాన్తరమ్ పోన బన్ధుక్కళ్ వారానిన్ఱార్కళ్" - ఎన్ఱఱిన్దవాఱే స్వదేశత్తిలిరున్ద బన్ధుక్కళ్ ముకమలరుమాపోలే, ఇవ్వోయిఱ్ఱొఴున్దు తామరైప్పూక్కళై వన్దణ వుమ్బుడియాన కాలవణ్ణిమైయాలే పూక్కళ్ స్మితమ్ పణ్ణినవాఱే పూక్కళినుడైయ శెఱివు నెకిఴ, ఛిద్రఙ్గళాలే పూవిల్ తేన్గళడైయ వొఴుకానిన్ఱన. మామలర్ - పెరియ మలర్. మామలరెల్లా మెన్ఱైయాలే- పుష్పజాతిక్కెల్లా ముపలక్షణమ్.



(మతు విరిన్దొఴుకిన) మధు వెళ్ళమిడానిన్ఱన.

(వానవరిత్యాది) ఆరాధకరాన దేవర్కళుమ్, రాజాక్కళుమ్ తన్దామ్ పదభ్రంశమ్ వారామైక్కు ఇతువే యాత్రైయాకవుమ్, ఆరాధ్యరాన దేవరీరై త్తిరువడి తొఴుకైయిలుణ్డాన త్వరైయాలే ముఱ్పట్టార్ ముఱ్పట్టపడి ఒరువరిరువరాయ్ వన్దు తిరణ్డు దిక్కుక్కళెఙ్గుమ్ నిఱైయ ప్పుకున్దార్కళ్. తిరుక్కణ్ణోక్కిలుమ్ అల్లాత దిక్కుక్కళెఙ్గుమ్ నిఱైన్దార్కళ్ - ఎన్నవుమామ్. దేవరీరుడైయ పరికరమెన్నిల్ ఇఙ్గనే యిరుక్కవేణ్డావో ?

(ఇవరొడు మిత్యాది) ఇవర్కళుడనే వన్ద పెరియ యానైత్తిరళ్కళుమ్ ఇనమ్ పిరియాత పిడికళుమాయ్. శ్రీరఙ్గమిఱే. వాద్యఘోషఙ్గళుమ్. ఇన్ద సముదాయమాక ముఴఙ్గుకిఱ ముఴక్కమానతు, ఉఱఙ్గుకిఱ పిళ్ళైకళై యొరువకైకళాలే యెఴుప్పుమాపోలే, వాద్యఘోషఙ్గళాలే తిరుప్పళ్ళి యుణరుమ్బడి.

(అతిర్తలిల్) ఇప్పడి ఘోషిక్కైయిల్. "కుమిఱు మోశై విఴవొలి" ఎన్నుమాపోలే ఇన్ద సముదాయఘోషమానతు చన్ద్రోదయత్తిల్ కడల్పోలే కిళర్న్దతు. "పెఱుమ్బుఱక్కడలాన" దేవరీర్ ఉణరవేణ్డావో? ఉభయవిభూతియుక్తరాన దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళి ఇవర్కళుక్కు ముకఙ్గొడుత్తరుళి అడిమై కొణ్డరుళ వేణుమెన్ఱు కరుత్తు.

*అరు : ముతఱ్పాట్టు (కతిరవనిత్యాది) ఆదిత్యనుక్కు ఉదయాస్తమనమ్ స్వభావమన్ఱో ? నమక్కు కిఞ్చిత్కరిక్కైక్కు ఎన్గిఱతు ఎప్పడి? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (కతిరవరవరిత్యాది) (తరమ్) బహుమానమ్ (విళక్కుడైయార్) కైవిళక్కు ప్పిడిక్కిఱవర్కళ్. (అణ్ణిమై) సామీప్యమ్. "ఎతిర్ తిశై" ఎన్ఱు ముఴుచ్చొల్లాయ్, దిక్కుక్కళెఙ్గు మెన్నుతల్. అనైకళ్ పిడికళోడు వరువానెన్? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (శ్రీరఙ్గమిఱే) ఎన్ఱు. పిరాట్టి యిరుక్కిఱ స్థలమాకైయాలే అవైకళుమ్ పిడికళోడే వరుకిన్ఱన - ఎన్ఱపడి. "అరఙ్గత్తమ్మా" ఎన్ఱు ఇఙ్గుత్తైక్కు నిర్వాహమ్.*

## భావదీపిక వివరణం

మొదటి పాశురం - అవతారిక : "సూర్యుడు తాను సత్తను పొందడంకోసం బాహ్యాంధకారాన్ని పోగొట్టే దీపమై వచ్చి ఉదయించాడు. నీ దాసుడైన అతని క్షేమాన్ని విచారించవద్దా!" అని అంటున్నారు. "వెయ్య కదిరోన్ విళక్కాక" (ముదల్ తిరు-1) (వేడిని కల సూర్యుడు దీపంగా) అని పొయ్కై ఆఴ్వార్లుకూడా సూర్యుని

దీపంగా పలికారు కదా! "లోకాన్ని అంతటిని నిద్రలేపే సూర్యుడు ఉదయిస్తే, మమ్మలను నిద్ర లేపే రామదివాకరుడవై, అచ్యుతభానుడవై ఉండే నీవు ఉదయించవద్దా ! బాహ్యాంధకారాన్నికదా అతడు పోగొట్టగలడు. మా మనస్సులలోని చీకటిని పోగొట్టడానికి నీవు నిద్ర లేవవద్దా? సూర్యుడు ఉదయగిరిపై ఉదయించాడు. చీకటి తొలగిపోయింది. నిన్ను ఆరాధించడానికి తగిన అందమైన పూవులు వికసించాయి. **"యస్యావతారరూపాణి నమస్యంతి దివౌకసః, అపశ్యంతః పరం రూపమ్"** (ఏ పరమపురుషుని యొక్క పరవాసుదేవ రూపాన్ని చూడలేక దేవతలు అతని అవతారరూపాలను నమస్కరిస్తున్నారో) అనే రీతిలో నిన్ను ఆరాధించే దేవతలు, ఆరాధింపబడేవాడవు నీవే కనుక, తమ పరిజనులు వాహనాలు, వాద్యాలు మొదలైనవానితో వచ్చారు. నీవు మేల్కొని వీటిని అన్నిటిని కటాక్షించాలి- అని అంటున్నారు- ఈ మొదటి పాశురంలో.

వ్యాఖ్యానమ్ : **(కతిరవన్ కుణదిశైచ్చికరమ్ వన్దెడున్దాన్)** నిద్రించే నీకు ప్రాతఃకాలంలో సంధ్యాదీపాన్ని తీసికొనివచ్చేవారివలె, వేయి కిరణాలను కల సూర్యుడు తన కిరణాలతో లోకంలోని చీకటిని పోగొడుతూ తూర్పున ఉదయగిరిలో ఉదయించాడు. అతడు నీ శ్రీచరణాలవద్ద అంతరంగకైంకర్యాన్ని చేయడంకోసం వచ్చినట్లుగా ఉన్నది. **"కదిరవరవరవర్ కైన్నిరై కాట్టినర్"** (తిరువాయ్-10-9-4) (ఆతివాహికులైన ఆదిత్యులు తమ చేతులతో ముక్తులకు దారిని చూపించారు) **"నారణన్తమరై క్కణ్డుకన్దు"** (తిరువాయ్-10-9-2) (శ్రీమన్నారాయణుని దాసులను చూచి ఆనందించి) అనే రీతిలో నీ దాసులు అర్చిరాదిగదిలో పయనించేటపుడు ఆదిత్యుడు మొదలైన ఆతివాహకులు తమ పదవులు నిలుకడగా నిలచి ఉండడంకోసం నీ దాసులకు (భక్తులకు) దీపాన్ని పట్టుకోవడం కోసం నియమింపబడినవారివలె కైంకర్యం చేస్తూ ఉంటారుకదా. అదేవిధంగా, **"భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమః"** (తైత్తి-ఆనంద-8-1) (ఈ పరమపురుషునివల్ల భయం పొందిన కారణంగా వాయువు వీస్తున్నది, ఇతనివద్దగల భయంచేత సూర్యుడు ఉదయిస్తున్నాడు. అగ్ని, ఇంద్రుడు, అయిదవవాడైన మృత్యువు ఇతనివల్ల గల భయంచేత తమ తమ కార్యాలను చేస్తున్నారు) అనే రీతిలో స్వామివి అయిన నీవు నిద్ర లేచే సమయాన్ని ఎదురు చూస్తూ తూర్పు దిక్కులోని ఉదయగిరిలో సూర్యుడు వచ్చి ఉదయించాడు. పర్వతం పైపెట్టిన దీపంవలె ఉదయపర్వతం



సమీపంలో ఉండే శ్రీరంగదివ్యాలయాన్ని, తోటలను, నీవు నిద్రించే అందాన్ని దర్శించడంలో గల తన ఆశ వ్యక్తమయేటట్లుగా వచ్చి నిలుచున్నాడు. **"కదిరాయిరమిరవి కలన్దెరిత్తా లొత్త నీణ్ముడి"** (పెరియాழ்వార్-తిరు-4-1-1) (వేయి సూర్యుల కిరణాల కాంతితో సమానంగా వెలిగే ఉన్నతమైన కిరీటం) అని, **"మిక్క శెఙ్జుడర్ పరిది శూడి"** (తిరువాశిరియమ్-1) (మిక్కిలి ఎఱ్ఱని కాంతిని కల సూర్యుని కిరీటంగా అలంకరించుకొని) అనే రీతిలో కిరీటం వేయి సూర్యుల కాంతిని కల కిరీటమనే ఆదిత్యుడు వచ్చి నిలువగా, మధ్యలో ఈవిధంగా నిద్రించవచ్చుకదా ! అని నంజీయర్వ్యాఖ్య.

**(కనవిరుళ్ అకన్దదు)** - రాత్రి వేళ మిక్కిలిగా ఉండే చీకటి పూర్తిగా పోయింది. చాలా దట్టంగా ఉండే చీకటి సూర్యుడు ఉదయించడం ఆరంభం కాగానే తగ్గిపోవడం ఆరంభించింది- అని కూడా చెప్పవచ్చు. **"ఇరుళ్ వీఌఱిరున్దదు పార్ ముழுదుమ్"** (తిరువిరుత్తమ్-13) (ఈ భూమి అంతటా చీకటి వ్యాపించింది) అనే రీతిలో ప్రభువుల ఆజ్ఞను ఉల్లంఘించి, ప్రభువుకు విరోధులైన వారు తగని పనులను చేసేటట్లే, తన పాలనను సాగిస్తూ వచ్చిన (అధికారాన్ని చెలాయిస్తూ ఉండే) చీకటి, బలం కల్గిన ప్రభువు తన సేనలతో దండెత్తిరాగానే దుష్కార్యాలు చేసేవారు వెనుకంజవేసేటట్లే, చీకటికూడా వెనుకంజ వేస్తున్నది - అని భావం.

**(కాలై యమ్ పొழுదాయ్)** - ఆరాధించేవారు తమ ఆరాధనను ప్రారంభించే కాలం వచ్చింది.

**(మతు విరిన్దొழுకిన మామలరెల్లామ్)** - సూర్యోదయంయొక్క ఫలంగా ఆరాధించడానికి ఉపయోగించే పూలు వికసించి మధుప్రవాహాన్ని స్రవిస్తున్నవి.

**(కాలైయమ్ పొழுదాయ్ మతు విరిన్దొழுకిన మామలరెల్లామ్)** - చీకటి పోగానే, **"బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ చింతయేదాత్మనో హితమ్, హరిర్హరిర్హరి రితి వ్యాహరేత్ వైష్ణవః పుమాన్"** (పరాశరస్మృతి) (వైష్ణవుడైన పురుషుడు తెల్లవారు జామువనే లేచి తన హితాన్నిగూర్చి చింతించాలి. "హరిః హరిః హరిః" అని మూడుమార్లు పలకాలి) అని, **"శిఌఱమ్ శిఱుకాలే"** (తిరుప్పావై-29) (చాలా ప్రాతఃకాలంలో) అని చెప్పబడిన రీతిలో భగవానునకు తిరువారాధనను చేయడానికి అందమైన కాలమై, ఆ కాలంలో, వేఱు ఊరికి పోయిన బంధువులు తిరిగి రావడాన్ని

గూర్చి తెలియగానే ఊరిలో ఉండే బంధువుల ముఖం వికసించేటట్లుగా, ముందు దినాన అస్తమించిన సూర్యుని కిరణాలు తామరపూవులను తిరిగి చేరగానే అపుడే ఆ పూవులు చిఱునవ్వు నవ్వినట్లుగా, వికసించాయి. ముడుచుకొన్న పూవులు వికసించగానే వాటి సందులలోనుండి ఆ పూలలో ఉండే మకరందం ప్రవిస్తున్నది- అని భావం. **"మామలర్"**- పెద్ద పూలు. **"మామలరెల్లామ్"** అని అన్నందువల్ల మొల్ల, మల్లె, సంపెంగ, ఇరువాట్చి మొదలైన అన్ని విధాలైన పూలను ఉపలక్షణప్రక్రియలో ఈ ప్రయోగం సూచిస్తున్నది.

**(మతు విరిన్దొழுకిన్ఱ)** - మధుప్రవాహాన్ని బహిర్గతం చేస్తున్నవి.

**(వానవర్ అరశర్కళ్ వన్దు వన్దీణ్డి)** - తాము ఆరాధించదగినవారమనే అహంకారాన్ని కల్గిన దేవతలు, ప్రభువులు ఆ అహంకారం తీరగా, తమ పదవులు పోకుండా ఉండడంకోసం, తమ కోరికలు తీరడంకోసం, ఆపదలు తీరడంకోసం తగినట్లుగా "వీరికి ఇదే పనియా !" అని తోచేటట్లుగా, ఆరాధ్యుడవైన నిన్ను నమస్కరించడంలో గల త్వరచేత ఒకరికంటే ఇంకొకరు ముందుకు గెంటుకొని, ఒక్కొక్కరుగా వచ్చి కలసి అన్ని దిక్కులలో నిండేటట్లుగా ప్రవేశించారు. **"ఎదిర్ దిశై"** అనే పదాన్ని కటాక్షానికి విషయమైన దక్షిణదిక్కు- అనే అర్థాన్ని తెల్పుతున్నట్లుగా కూడా గ్రహించవచ్చు. ఒకదానికి ఇంకొకటి ఎదురైన అన్ని దిక్కులను తెల్పుతున్నదిగా కూడా చెప్పవచ్చు. సర్వలోకచక్రవర్తి అయిన భగవానుని పరిజనాలు కనుక అన్ని దిక్కులలోను నిండి ఉన్నారు- అనే అర్థం చెప్పకుండానే ఇక్కడ స్ఫురిస్తుంది.

**(ఇవరొడుమ్ పుకున్ద ఇరుజ్కళిఱ్ఱీట్టముమ్ పిడియొడు)** వీరితో వచ్చిన వీరి వాహనాల, సేనల రూపంలో ఉండే గొప్ప మగ ఏనుగుల గుంపులు, వాటిని విడచి ఉండలేని ఆడఏనుగుల గుంపులు- అని భావం. శ్రీరంగనాథుని ఏనాడూ విశ్లేషించని "శ్రీః" అయిన శ్రీరంగనాయకి నివసించే శ్రీరంగంకదా ఇది. (అందువల్ల గజాలు కూడా ఆడ ఏనుగులతో కలసి వచ్చాయి.)

**(పిడియొడు మురశుమ్ అదిర్తలిల్)** - ఈ ఏనుగుల ఘీంకారాలు, మృదంగాల ధ్వనులు ఒకదానితో ఇంకొకటి కలిసి ప్రతిధ్వనించడం చూస్తే, నిద్రించే పిల్లలకు పాట పాడి నిద్ర లేపేటట్లుగా, శ్రీరంగనాథునికూడా ఈ ధ్వనులతో మేల్కొలుపుతున్నట్లున్నది.



**(అతిర్తలిల్ అలైకడల్ పోన్ఱుళదెజ్గుమ్)** - ఈ విధంగా శబ్దించినందువల్ల **"కుముఱుమోశై విழுవాలి"** (తిరువాయ్-6-5-2) అనే రీతిలో ఈ ఏనుగుల ఘోషలు, మృదంగాల శబ్దాలు కలిసి చంద్రుడు ఉదయించగానే సముద్రం ఉప్పొంగి ఘోషించేటట్లుగా ఉన్నవి. **"పెఱుమ్ పుఱక్కడల్"** (పెరియతిరు-7-10-1) అని చెప్పబడే నీవు ఈ ఘోషను విని మేల్కొనవద్దా !

**(అరజ్గత్తమ్మా ! పళ్ళి యెழுన్దరుళాయే)** - **"పొజ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అజ్గాదుమ్ శోరామే ఆళ్కిన్ఱ ఎమ్బెరుమాన్ శెజ్గోలుడైయ తిరువరజ్గచ్చెల్వనార్"** (నాచ్చి.తిరు-11-3) (పొంగే సముద్రం చేత పరివేష్ఠితమైన భూమి, పరమపదాలలో ఏమీ జారిపోకుండా పాలించే స్వామి, ఆజ్ఞా దండాన్ని కల శ్రీరంగనాథుడు) అనే రీతిలో ఇక్కడనే ఉంటూ ఉభయ విభూతులను పాలించే నీవు వేఱు ఏ గతి లేని దాసుని ప్రార్థనకోసం మేల్కొని, వీరిని కటాక్షించి కైంకర్యాన్ని స్వీకరించాలి- అని భావం.

**2.** **కొழுజ్గొడి ముల్లైయిన్ కొழு మలరణవి**
**క్కూర్న్దతు కుణతిశై మారుత మితువో**
**ఎழுన్దన మలరణై ప్పళ్ళికొళ్ళన్నమ్**
**ఈన్పని ననైన్ద తమిరుమ్ శిఱకుతఱి**
**విழுజ్గియ ముతలైయిన్ పిలమ్బురై పేழ்వాయ్**
**వెళ్ళెయిఱుఱ అతన్ విడత్తినుక్కనుజ్గి**
**అழுజ్గియ వానైయిన్ అరున్దుయర్ కెడుత్త**
**అరజ్గత్తమ్మా! పళ్ళి యెழுన్దరుళాయే**

కుణ తిశై మారుతమ్ = తూర్పుదిశలోని గాలి, కొழு కొడి =బాగా బలిసిన తీగలను కల, ముల్లైయిన్ = మల్లెచెట్టుయొక్క, కొழு మలర్ = అందమైన (ఏపుగా ఉండే) పూలను, అణైవి = స్పృశించి, ఇదువో = ఇదిగో, కూర్న్దదు = మిక్కిలి వీస్తున్నది, మలర్ అణై = పూల సెజ్జపై, పళ్ళికొళ్ = పరుండి ఉండే, అన్నమ్ = హంసలు, ఈన్ పని ననైన్ద = (వర్షంవలె) కురుస్తున్న మంచుతో తడసిన, తమ్ = తమయొక్క, ఇరు శిఱకు = అందమైన రెక్కలను, ఉదఱి = విదల్చుకొని, ఎழுన్దన = నిద్రను విడిచి లేచాయి, విழுజ్గియ = (తన కాలును) మింగిన, ముదలైయిన్ = మొసలియొక్క, పిలమ్బురై = బలంవంటి, పేழ் వాయ్=

పెద్ద నోటిలో ఉండే, వెళ్ ఎయిఱు ఉఱ = తెల్లని కోఱపళ్ళను ఊనిన, అదన్ = ఆ మొసలియొక్క, విడత్తినుక్కు = పంటి విషంతో, అనుజ్గి అழுన్దియ = మిక్కిలి బాధపడిన, ఆనైయిన్ = గజేంద్రాழ்వాన్ యొక్క, అరు తుయర్ = గొప్ప దుఃఖాన్ని, కెడుత్త = పోగొట్టిన, అరజ్గత్తమ్మా = శ్రీరంగనాథా, పళ్ళి ఎழுన్దరుళాయే= మేల్కొనాలి.

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

*అవతారికై :- ఇరణ్డామ్పాట్టు. పోతు విడిన్దమైక్కడైయాళమాన కీழ் క్కాற்றుమ్, పుష్పశాయికళాన అన్నజ్గళినుడైయ ప్రబోధనము ముణ్డాయిற்று. ఆశ్రితవత్సలరాన దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళ వేణు మెన్గిఱార్.*

*వ్యాఖ్యానమ్ : (కొழுజ్గొడియిత్యాది) శ్రద్దైయై యుడైత్తాన ముల్లైచ్చెవ్వి మలరిన్ పరిమళత్తై యళైన్దుకొణ్డు విడియఱ్కాற்றావతు, "నీజ్గళుఱజ్గుకిఱతెన్?" ఎన్ఱు ఉణర్త్తువారైప్పోలే శూழ்న్దుకొణ్డు ముకజ్గళిలే అలై యెఱియానిన్ఱతు; కాలై ప్పిడిత్తు ఉణర్త్తుకిఱపడి.*

*(ఎழுన్దన విత్యాది) తామరైప్పూవాకిఱ పడుక్కైయిలే పనియై మఱియాతే పడుక్కైవాయ్ప్పాలే ఉఱజ్గుమ్ హంసమిథునజ్గళానవై కాలముణర్త్త ఉణర్న్దన, ఇత్తాల్, అరుమఱై పయన్ద అన్నత్తోడు సజాతీయమాన అన్న మెழுన్దన. నీయు మెழுన్దిరాయ్- ఎన్ఱపడి. (తమిరుమ్ శిఱకిత్యాది) పనియిలే ననైన్ద శిఱకుకళై యుతఱి నిన్ఱతు.*

*(విழுజ్గియ విత్యాది) "పరమాపదమాపన్నః" ఎన్ఱు స్వశక్తి మాళుమ్బడి బిలద్వారమెన్ఱు శొల్లలామ్బడి యిరుక్కిఱ పెరియ వరప్పైయుడైయ ముతలైవాయిలే అకప్పట్టు, అతినెయిற்றాలే నెరుక్కుణ్డు మికవుమ్ నోవు పట్టు తుతిక్కై ముழுకుమ్బడియాన దశైయిలే పెరియ ఆపత్తై త్తీర్త్తు, "కైమ్మా తున్బమ్ కడిన్ద పిరాన్" ఎన్ఱు ఉపకారస్మృతియాలే కృతజ్ఞర్ ఈడుపడుమ్బడియాన కైయిల్ పూవిన్ శెవ్వి యழிయామే తిరువడికళిలే యిడువిత్తుక్కొణ్డు అవనై యడిమైకొణ్డ మహోపకారకరాయ్, పిఱ్పాడర్క్కు ఉతవుకైక్కాక క్కోయిలిలే నిత్యసన్నిధిపణ్ణుకిఱ దేవరీర్ ఉణర్న్దరుళుమ్పోతై అழுకు కాణ ఆశైప్పట్ట అడియోజ్గళుడైయ ఆర్తి యెల్లామ్ తీరుమ్బడి యుణర్న్దరుళ వేణుమెన్గిఱార్.*



## పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై : ఇరణ్డామ్పాట్టు (కొழுజ్గొడి యిత్యాది) ముల్లైయిన్ పరిమళత్తై ముకన్దుకొణ్డు కీழ்కాற்று వన్దతు. తామరైప్పూవిల్ కిడన్దుఱజ్గుకిఱ హంసమిథునజ్గళుమ్ కిళమ్బిற்றిన. శ్రీగజేన్ద్రాழ்వానుడైయ విరోధియై యఱుక్క అరై కులైయ త్తలై కులైయ వన్దు రక్షిత్తరుళిన దేవరీర్ కణ్వళర్న్దరుళుకిఱతెన్ ? తిరుప్పళ్ళి యుణర్న్దరుళీర్ -ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (కొழுజ్గొడి యిత్యాది) సశ్రద్ధమాన ముల్లైయినుడైయ సశ్రద్ధమాన పూవై యణవి. అల్లియుమ్ తాతు మరుమ్బుమాన కన్దల్ పడామే అరుమితియాన మణత్తై వాజ్గిక్కొణ్డు, "పుతుమాతవి మీతణవి" ఎన్నుమాపోలే కీழ் దిక్కిల్ కాற்றావతు కూర్న్దతు- విఞ్జిற்று. కూరుకైయావతు- మికుకై.

ఆదిత్యనుక్కు నేరే యుఱవాన తామరై ప్పూవినుడైయ వికాసమేయన్ఱియే, నిలత్తిల్ పూవాన ముల్లైప్పూవుమ్ వికసిత్తు, అతిన్ మణత్తైక్కొణ్డు దేవరీరై త్తిరుప్పళ్ళి యుణర్త్తుమాపోలే వన్దుకొడునిన్ఱతు. "ఇతువో" ఎన్ఱతు- రాజాక్కళుక్కు అన్తరజ్గరానవర్కళ్ వన్దవర్కళై క్కాట్టుమాపోలే "పార్త్తరుళీర్" ఎన్గిఱార్. స్పర్శేన్ద్రియ గ్రాహ్యమానతై "ఇతువో" ఎన్నైయాలే కాற்றుక్కు సతతగతిత్వమ్ తవిర్న్దు నిన్ఱాప్పోలే యిరుక్కిఱతు.

(ఎழுన్దన మలరణైయిత్యాది) ఇక్కాற்று వీశినవాఱే "విడిన్దతాకాతే" యెన్ఱు మలరాకిఱ పడుక్కైయిలే పళ్ళికొళ్ళుకిఱ హంసమిథునజ్గళ్ ఉణర్న్దన. "పళ్ళికొళ్" ఎన్గిఱతు- ఉకన్దరుళిన నిలత్తిలే యుళ్ళవైయాకైయాలే ఉపచారమాక వల్లతు శొల్లారిఱే. "నమ్మిల్ శిఱియార్ ఇజ్గు వర్తిప్పారిల్లై" ఎన్గిరుప్పర్కళే. పూమ్పడుక్కై ఎన్నైయాలే, తనిప్పడుక్కై తణలోడొక్కుమాకైయాలే మిథున మాయల్లతు శయియామై తోற்றుకిఱతు. "మెన్మలర్ప్పళ్ళి వెమ్ పళ్ళి"యామే.

(ఈన్ పని ననైన్ద) ఉణ్డాన పనియాలే ననైన్ద -ఎన్నుతల్. శొరికిఱ పని- ఎన్నుతల్. "ఒழுకు నుణ్ పనిక్కొడుజ్గియ" ఇత్యాది.

(ఇరువ్మ్ శిఱకుతఱి) పెరియ శిఱకై యుతఱిక్కొణ్డు. పేడైయై చ్చిఱకుక్కుళ్ళే వళర్త్తి తన్ శిఱకై యిట్టు క్కవిత్తు క్కొణ్డాయిற்று కిడప్పతు. నాడోడియాన అన్నజ్గళెల్లా ముణర్న్దన. "అన్నమాయ్ అన్ఱజ్గు అరుమఱై పయన్ద" దేవరీర్ తిరుప్పళ్ళి యుణరవేణ్డావో ?

**(విழுజ్గియ ఇత్యాది)** ముతలైయిన్ కైయిలే యానై యకప్పట్టతెన్టాలో దేవరీర్ అరై కులైయ త్తలై కులైయ ప్పుఅప్పడలావతు ? కాలిలే ముతలై కడిక్క, 'విழுజ్గియ' ఎన్గిఱార్; పశల్కళ్ కిణ*ఱ్ఱి*నరుకే పోయి*ఱ్ఱె*న్టాల్, 'ఇని యిழுన్దేన్' ఎన్బారైప్పోలే,

**(పిలమ్పురై పేழ்వాయ్)** బిలద్వారత్తోడొత్తిరుక్కిఱ పెరియ వాయిన్.

**(వెళ్ళెయిఱుఱ)** అజ్గ ఆమిషమిల్లామైయాలే మణలైయిటే భక్షిప్పతు. ఆకైయాలే శాణైయిలిట్ట శస్త్రమ్బోలే కాణుమిరుప్పతు.

**(అతన్ విడత్తినుక్కనుజ్గియ వానైయి నరున్దుయర్ కెడుత్త)** ఆనైయినుడైయ కాలై ప్ప*ఱ్ఱి*న ముతలైయినుడైయ పల్లిన్ విషత్తాలే యనుజ్గి నోవుపట్ట ఆనైయుడైయ. అழுజ్గియ- నోవుపట్ట.

**(అరున్దుయర్ కెడుత్త)** "అతన్ద్రితచమూపతిప్రహితహస్తమ్" ఇత్యాది.

**(అరున్దుయర్)** ఇని యవ్వరుకిల్లై ఎన్నుమ్బడియాన క్లేశమెన్నవుమామ్. పెఱుతఱ్కరియ తుయరెన్నవుమామ్. సర్వేశ్వరనై వన్దు విழப్పణ్ణిన నోవిఱే.

**(అరజ్గత్తమ్మా ఇత్యాది)** ఇప్పడి ఆర్తరానార్ కూక్కురల్ కేట్కిఱ విడత్తిలే యుఱజ్గుమత్తనైయో? ఒరు ముదలై పిడిత్తాలో ఉతవలావతు? సంసారమాకిఱ పెరుజ్గడలిలే యాழவిழுన్దు, ఇన్ద్రియజ్గళాకిఱ ముతలైకళైన్దిన్ వాయిలే విழுన్దు అకప్పట్టారై యుణర్న్దరుళి రక్షిక్కవేణ్డావో?

*అరు : ఇరణ్డామ్బాట్టు. (కొழுజ్గొడి యిత్యాది) (కన్దల్) కల్మషమ్. అన్నమెన్నా నిఱ్క మిథునత్తుక్కు వాచకమెజ్గనే? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (పూమ్బుడుక్కై యిత్యాది) పని శొరియుమో? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (ఒழுకు నుణ్ పని యెన్టు). (అనుక్కమ్) నోవు. అழுజ్గియ- అழுన్దియ. నోవిలే అழுన్దిన- ఎన్టపడి. దుఃఖ తైప్పోక్కినానో? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (అతన్ద్రితేత్యాది).*

## భావదీపిక వివరణం

**రెండవ పాశురం - అవతారిక :** "మల్లెపూల సువాసనను మోసికొని తూర్పు గాలి వచ్చి వీస్తున్నది. తామరపూవులో నిద్రించే హంస మిథునాలను ఈగాలి నిద్రలేపింది. పొద్దు పొడిచిన విషయాన్ని తెలిపే గుర్తులైన ఇవి సంభవించిన తరువాతకూడా, చాలా వేగంగా వచ్చి గజేంద్రుని కాపాడిన నీవు నిద్రించవచ్చునా మేలుకో'' అని అంటున్నారు.



వ్యాఖ్యానమ్ : **(కొழுజ్కొడి ముల్లైయిన్ కొழுమలర్ అణైవి క్కూర్న్దదు కుణతిశైమారుత మిదువో)** బలిష్ఠంగా ఉండే మల్లెచెట్లలో బాగా ఏపుగా పూచిన మల్లెపూలను స్పృశించిన ప్రాతఃకాలిక వాయువు ఆ పూల రేకులు, మొగ్గలు పుప్పొడి అనే అసారమైనవానిని విడచి, దాని సారమైన సువాసనను మాత్రం మోసికొని, **"పుతు మాదవి మీదణవి"** (తిరువాయ్-5-8-2) (నూతనమైన జాజిపూలను స్పృశించి) అనే రీతిలో తూర్పుదిక్కునుండి మెల్లగా వీస్తున్నది. ఇంకా నిద్రించ వచ్చునా? అని ప్రబోధించేవారివలె పాదాలను పట్టుకొని మేల్కొలుపుతున్నది. **"కూర్న్దదు"** మిక్కిలిగా ఉన్నది- అని అర్థం. గడచిన పాశురంలో పల్కిన రీతిలో సూర్యునకు సాక్షాత్ బంధువైన, నీటిలో పూచే తామరపూవుయొక్క వికాసమే కాకుండా, స్థలప్రదేశంలో పూచే మల్లెపూలుకూడా వికసించగా, వాటి సువాసనను గ్రహించి వచ్చి నిన్ను మేల్కొలుపుతున్నట్లుగా తూర్పుగాలి వీస్తున్నది. **"ఇదువో"** అని అంటూ ప్రభువులకు చాలా సన్నిహితులైన మంత్రులు మొదలైనవారు ప్రభువులను చూడడానికి వచ్చినవారిని చూపించేటట్లే, ''ఈ వాయువును కటాక్షించండి'' అని చూపుతున్నారు. స్పర్శజ్ఞానాన్ని కల్గించే త్వగింద్రియంతో తెలియబడే గాలిని ఉద్దేశించి "ఇదుగో'' అని అన్నందువల్ల, గాలి ఎల్లపుడు సంచరించే తన స్వభావాన్ని విడచి శ్రీరంగనాథునకు కైంకర్యం చేయడంకోసం స్థిరంగా ఎదురుగా నిలచినట్లుగా ఉన్నది.

**(ఎழுన్దన మలరణై ప్పళ్ళికొళ్ళన్నమ్)** - తామరపూవు అనే పడుకలో ప్రాతః కాలంలో కురిసే మంచునుకూడ లెక్కపెట్టకుండా, పడుకలో మెత్తనిదనం, సువాసన మొదలైనవానిని అనుభవిస్తూ నిద్రించే ఆడమగ జంటలుగా ఉండే హంసలు ఈ తూర్పుదిక్కులోని గాలి వీచగానే, పొద్దు పొడిచిన విషయాన్ని గమనించి మేలుకొన్నాయి. సాధారణ తిర్యక్కు అయిన హంసలే నిద్ర లేచినపుడు, **"అరుమఱై పయన్ద అన్నమ్"** (అరుదైన వేదాలను ఉపదేశించిన హంస) అయిన నీవు మేలుకొనవద్దా! అని భావం. **"అన్నమాయ్ అన్టజ్గు అరుమఱై పయన్దాన్ అరజ్గమానకర్ అమర్న్దానే!"** (పెరియతిరు-5-7-3) (హంసరూపియై ఆనాడు అక్కడ అరుదైన వేదాలను అనుగ్రహించిన శ్రీరంగంలో వేంచేసి ఉన్నవాడా!) అని తిరుమజ్గైయాழ்వార్లు కూడా శ్రీరంగనాథుని హంసగా పలికారుకదా. **"మలరణై త్తుయిలుమ్"** (పూల పడుకలో శయనించి) అని పలుకకుండా **"మలరణై ప్పళ్ళికొళ్"** అని పలుకడం- భగవానుడు అభిమానించిన భూలోకవైకుంఠంలో ఉన్నది కనుక, గౌరవంగా పలుకాలి - అనే ఉద్దేశ్యంతో ఈవిధంగా అనబడింది. "అహ్రాతసహజ

దాస్యాః సూరయః ప్రస్తబంధాః విమలచరమదేహా ఇత్యమీ రంగధామ, మహిత మనుజతిర్యక్ స్థావరత్వాః శ్రయంతే సునియతమితి హ స్మ ప్రాహురేభ్యో నమస్తాత్" (శ్రీరంగరాజస్తవం-పూర్వ-33) (సహజమైన శేషత్వాన్ని ఏనాడూ కోల్పోని నిత్య సూరులు, సంసారబంధంనుండి విముక్తులైన ముక్తులు, అందమైన చరమదేహంలో ఉండే ముముక్షువులు- అనే వీరు శ్రీరంగంలో మహానుభావులైన మానవులుగా, తిర్యక్కులుగా, స్థావరాలు మొదలైనవిగా జన్మలను పొంది ఉజ్జీవిస్తున్నారు- అనేది నిశ్చయం- అని విజ్ఞులు అంటున్నారు. వారికి నమస్కారం) అని పూర్వాచార్యులు శ్రీరంగంలో జీవించే పక్షులు, మొదలైనవానిని నిత్య ముక్తులుగా అనుసంధించారు కదా! పెరియతిరుమలనంబి "నన్ను పిలుచుకొని రావడం కోసం ఒక చిన్నవానిని ఎవనిని అయినా పంపి ఉండకూడదా! మీరే స్వయంగా రావాలా?'' అని అడిగిన భగవద్రామానుజులతో, "తిరుమలలో నాకంటే చిన్నవారెవ్వరూ లేరు'' అని అన్నారు కదా! **"ఎழுన్దన"** అని బహువచనంలో పల్కినందువల్ల **"అన్నమ్"** అనే పదం జంటతో కూడిన మగహంసను నిర్దేశిస్తున్నదని తెలుస్తున్నది కనుక, ఒంటరిగా శయనిస్తే నిప్పువలె కాలుతుంది కనుక, ఆడ-మగ కలిసి జంటగానే శయనిస్తాయి- అని తెలుపబడుతున్నది. **"మెన్మలర్ పళ్ళి వెమ్ పళ్ళియాలో"** (తిరువాయ్-9-9-4) (మెత్తని పూల పడుక వేడిగా ఉండే పడుక అయినదే! అయ్యో!) అని అంటూ పరాంకుశనాయకికూడా విశ్లేషంలో మెత్తని పూలపడుక వేడిగా ఉన్నదని పల్కిందికదా!

**(ఈన్ పని ననైన్ద)** - ఇది రెక్కలకు విశేషణం. **"ఈన్ పని"** అనే పదం "ప్రాతఃకాలంలో కురిసిన మంచు'' అనిగాని, "వర్షంవలె కురుస్తున్న మంచు'' అని గాని అర్థాన్ని ఇస్తుంది. **"ఒழுకు నుణ్ పనిక్కొడుఙ్గియ పేడైయై అడఙ్గ అఞ్జిఱై కోలి"** (పెరియతిరు-8-5-8) (సూక్ష్మంగా చిన్న కణాలుగా కురిసే మంచుకు ఒదిగి ఉండే పెంటి హంసను అందమైన తన రెక్కలతో కప్పాలని తలచి) అనే రీతిలో పరకాలనాయకికూడా (తిరుమంగై ఆழ்వార్లు) మంచుకు భయపడి ఒదిగి ఉండే ఆడుహంసను మగహంస తన ఱెక్కలతో కప్పి, నిద్రిస్తున్నట్లుగా పలికిందికదా.

**(ఇరుమ్ శిఱకుదఱి)** - పెద్ద రెక్కలను విదల్చుకుంటూ -అని అర్థం. పూర్వం ప్రస్తావించిన పరకాలనాయకి సూక్తి క్రమంలో, ఆడహంసను ఱెక్కల లోపల పెట్టుకొని నిదురించే మగహంస ఆ ఱెక్కలను విదల్చుకొని మేలుకోవడాన్ని ఈ ప్రయోగం తెల్పుతున్నది.



**(విழுఙ్గియ ముదలైయిన్... కెడుత్త)** "పరమాపదమాపన్నో మనసాஉ చింతయద్ధరిమ్, స తు నాగపరః శ్రీమాన్ నారాయణపరాయణః" (విష్ణు.ధర్మ-69-47) (పెద్ద ఆపదను పొందినవాడు, కైంకర్యసిరిని కలవాడు, నారాయణుడే గొప్ప గతిగా కలవాడు అయిన ఆ గజేంద్రుడు మనస్సులో హరిని ధ్యానించాడు) అనే రీతిలో తన శక్తి అంతా నశించేటట్లు గుహద్వారంవలె ఉండే మిక్కిలి వైశాల్యాన్ని కల మొసలి నోటిలో చిక్కుకొని, దాని తెల్లని కోఱలచే కఱువబడి, మిక్కిలి క్లేశాన్ని పొంది, తొండం పూర్తిగా మునిగిపోయే స్థితిని గజేంద్రాழ்వాన్ పొందగానే, అతనికి కల్గిన ఆ పెద్ద ఆపదను తీర్చి, **"కైమ్మా తున్బమ్ కడిన్ద పిరానే !"** (తిరువాయ్-2-9-1) (గొప్ప తొండాన్ని కల గజేంద్రుని క్లేశాన్ని తీర్చిన స్వామీ !) అని నమ్మాழ்వార్లవంటివారు తమకు చేసిన ఉపకారంగా భావించి అభినివేశాన్ని పొందేటట్లుగా, గజేంద్రుని తొండంలోని పూవు వాడడానికి ముందే దానిని తన శ్రీచరణాలలో సమర్పించేటట్లు చేసి, అతని కైంకర్యాన్ని గ్రహించి, అతని గొప్ప దుఃఖాన్ని పోగొట్టిన వృత్తాంతాన్ని పల్కుతున్నారు.

ఈ వృత్తాంతాన్ని ఇక్కడ అనుసంధించినందువల్ల, "మొసలి నోటిలో ఏనుగు చిక్కుకొన్నప్పుడే నీవు **"అరై కులైయ తలై కులైయ"** (నడుమున వస్త్రం జారిపోగా, జుట్టుముడి వీడిపోగా) అనే రీతిలో మహావేగంగా పరుగెత్తివస్తావా ? మా వంటి సంసారులు సంసారసాగరంలో చిక్కుకొని తల్లడిల్లడం చూచినా రావా ?'' అనే హార్దభావం స్ఫురిస్తున్నది.

**(విழுఙ్గియ)** -మొసలి గజేంద్రుని కాలిలో కఱచి నీటిలోకి లాగింది-అని పౌరాణిక వృత్తాంతంలో తెలుపబడగా, **"విழுఙ్గియ"** (మింగిన) అని ఆழ்వార్లు పల్కడం- బిడ్డ బావికి దగ్గరగా పోయేటపుడే "అయ్యో ! బిడ్డ బావిలో పడిపోయాడే!'' అని ప్రేమాధిక్యంచేత ఆక్రందించే తల్లి కృత్యంవంటిది.

**(పిలమ్బురై పేழ்వాయ్)** - గుహద్వారంతో సాటి వచ్చే పెద్ద నోటిలోని,

**(వెళ్ళెయిற்ఱు)** - మొసలికి ఆ మడుగులో మాంసం లభించడం అరుదు కనుక, ఇసుకనే మాటిమాటికి పళ్ళతో కఱుస్తూ తినే అలవాటువల్ల కోఱలు సానపై పదును పెట్టిన ఆయుధావలె తెల్లగా, వాడిగా ఉన్నాయి- అని భావం.

**(అదన్ విడత్తినుక్కనుఙ్గి అழுన్దియ ఆనైయిన్ అరుమ్తుయర్ కెడుత్త)**- గజేంద్రునియొక్క కాలును పట్టుకొన్న మొసలి కోఱపళ్ళలోని విషంవల్ల మిక్కిలి

బాధ కల్గి చాలా క్లేశాన్ని పొందిన ఆ గజేంద్రునియొక్క బాధను తీర్చిన- అని అర్థం. **"అనుజ్గీ అఴున్దియ"** అని అన్నందువల్ల గజేంద్రుడు చాలా బాధపడిన విషయం తెలుపబడింది.

**(అరున్తుయర్ కెడుత్త) - "అతంత్రితచమూపతిప్రహితహస్త మస్వీకృత ప్రణీతమణిపాదుకమ్, కిమితి చాకులాంతఃపురమ్, అవాహనపరిష్క్రియం పతగాగరాజమారోహతః కరిప్రవరబృంహితే భగవతస్త్వరాయై నమః"** (శ్రీరంగ రాజస్తవమ్-ఉత్తర-57) (గజేంద్రుని ఆక్రందన చెవిలో పడగానే, విష్వక్సేనుడు అందించిన కైదండను లెక్కజేయకుండా, తీసికొనిరాబడిన రత్న పాదుకలను ధరించకుండా, 'ఇదేమి! ఇదేమి!'' అని దివ్యదేవేరులు తికమక పడుతూ ఉండగా, ఏ వాహనాలంకారం లేని గరుడుని పైకి ఎక్కే భగవానుని ఆ భక్తరక్షణత్వరకు నమస్కారం) అని పరాశరభట్టర్ ఇతడు (భగవానుడు) **"అరై కులైయ తలై కులైయ"** వేగంగా పరుగెత్తి వచ్చి గజేంద్రుని గొప్ప దుఃఖాన్ని తీర్చిన రీతినిగూర్చి పలికారు కదా.

**(అరున్తుయర్)** - "దీనికి మించిన గొప్ప ఆపద ఇంకొకటి లేదు'' అనే రీతిలోని గొప్ప దుఃఖం- అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. లేక, ఎవరికి పొందడానికి సాధ్యం కాని అరుదైన భాగ్యం అనదగిన దుఃఖం- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. భగవానుడే స్వయంగా పరుగెత్తివచ్చేటట్లుగా చేసిన ఆపద కనుక ఇది గొప్ప భాగ్యం అనదగిన దుఃఖంకదా ! వీరు **"అరున్తుయర్"** అని పల్కినట్లే ఋషికూడా **"పరమాపదమ్"** (విష్ణుధర్మం-69-47) అని అన్నారు.

**(అరఙ్గత్తమ్మా ! పళ్ళి ఎఴున్దరుళాయే)** ఈ రీతిలో సంసారంలో **"కొణ్డపెణ్డిర్ మక్కళుఱ్ఱార్"** మొదలైన పలు మొసళ్ళచేత బాధింపబడినవారిని రక్షించడం కోసమే కదా శ్రీరంగంలో శయనించి ఉండడం. ఒక మొసలి పట్టుకొంటేనే రక్షించాలా! సంసారమనే గొప్ప సముద్రంలో తీరాన్ని చేరలేని రీతిలో మునిగి, ఇంద్రియాలు అనే అయిదు మొసళ్ళ నోటిలో చిక్కుకొని క్లేశపడేవారిని గ్రహించి రక్షించవద్దా! "నీవు మేల్కొనే సమయంలోని సౌందర్యాన్ని దర్శించాలని ఆశపడిన మా దుఃఖం తీరేటట్లు మేల్కొనాలి'' అనికూడా అర్థాన్ని చెప్పవచ్చు.

3. శుడరొళి పరన్దన శూఴ్ తిశై యెల్లామ్
    తున్నియ తారకై మిన్నొళి శురుఙ్గి
పడరొళి పశుత్తనన్ పనిమతి యివనో
    పాయిరుళకన్దతు పైమ్బొఴిఱ్కముకిన్



మడలిడై క్కీఱి వణ్ పాళైకళ్ నాఱ
    వైకఱై కూర్న్దతు మారుత మితువో
అడలొళి తికఴ్తరు తికిరియమ్ తడక్కై
    అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెఴున్దరుళాయే

శూఴ్ తిశై ఎల్లామ్ = చుట్టూ కనబడే దిక్కులలో అంతటా, శుడర్ ఒళి= సూర్యుని కిరణాలు, పరన్దన = వ్యాపించాయి, తున్నియ = (ఆకాశంలో) దట్టంగా ఉండే, తారకై = నక్షత్రాల, మిన్ ఒళి = మెఱిసే గొప్ప కాంతి, శురుఙ్గి = మసకబారినది, పడర్ ఒళి = వ్యాపించిన కాంతిని కల, పని మతి ఇవన్ = ఈ చల్లని చంద్రుడు కూడా, పశుత్తనన్ = కాంతివిహీనుడయ్యాడు, పాయ్ ఇరుళ్ = విస్తరించిన చీకటి, అకన్దతు = తొలగిపోయింది, వైకఱై మారుతమ్ ఇతు = ఈ ప్రాతఃకాలంలోని ఈ వాయువు, పై = పచ్చదనాన్ని కల, పొఴిల్ = తోటలలోని, కముకిన్ = పోకచెట్లయొక్క, మడలిడై కీఱి = మట్టలను గీఱినందువల్ల, వణ్ పాళైకళ్ నాఱ = అందమైన లేతమట్టలు (పాళై-కొబ్బరి, పోక, తాటివంటి చెట్లపూలను ఆవరించి ఉండే లేత మట్ట) సువాసనలను వెదజల్లగా (ఆ పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ), కూర్న్దతు = వీస్తున్నది, అడల్ = గొప్ప బలాన్ని కల్గినదై, ఒళి తికఴ్ తరు = తేజస్సును ప్రకాశింపజేస్తున్న, తికిరి = శ్రీసుదర్శనాన్ని, అమ్ తడ కై =అందమైన, విశాలమైన బాహువులో కల, అరఙ్గత్తమ్మా = శ్రీరంగనాథా !, పళ్ళి ఎఴున్దరుళాయే = మేలుకో.

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

*అవతారికై : మూన్ఱామ్పాట్టు. నక్షత్రాదికళ్ ఒళిమఴుఙ్గుమ్బడి ఆదిత్యనుదిత్తాన్. కైయుమ్ తిరువాఴియుమాన అఴకై యనుభవిక్కుమ్బడి తిరుప్పళ్ళి యుణర్న్దరుళ వేణుమెన్గిఱార్.*

*వ్యాఖ్యానమ్ : (శుడరిత్యాది) పార్త్త పార్త్త విడమెఙ్గుమ్ ఆదిత్య కిరణఙ్గళ్ పరమ్బిఱ్ఱు. అత్తాలే నక్షత్రాదికళుడైయ తేజస్సు తోఱ్ఱాతపడియాయిఱ్ఱు. అవ్వళవన్ఱిక్కే. (పడరొళి యిత్యాది) ఇరవెల్లామ్ సామ్రాజ్యమ్ పణ్ణిన చన్ద్రనుమ్ ఒళి మఴుఙ్గినాన్. (పాయిరుళకన్దతు) అన్ద చన్ద్రనుక్కు వికాసహేతువాయ్ ప్పరమ్బిన ఇరుళానతు, మహారాజాక్కళ్ తోఱ్ఱినాల్ కృత్రిమర్ ఒళిక్కుమాపోల మఱైన్దతు. (పైమ్బొఴిల్ కముకినిత్యాది) పశుమైయై యుడైత్తాన*

శోలైక్కముకుకళిన్ పాళైకళానవై విరియ, అతిన్ పరిమళత్తై ముకన్దుకొణ్డు విడివోఱై క్కాఱ్ఱానతు ఎఙ్గుమ్ వ్యాపియానిన్ఱతు.

*(అడలొళి యిత్యాది) తిరువాழிయాలే ప్రతిపక్షత్తై ప్పోక్కినాప్పోలే కైయుమ్ తిరువాழிయుమాన అழకై క్కాట్టి, సహజశత్రువాన ఇన్ద్రియపారవశ్యత్తైయై ప్పోక్కి దేవరీరழకై యనుభవిక్కుమ్బడి తిరుప్పళ్ళి యుణర్న్దరుళ వేణుమెన్గిఱార్.*

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై : మూన్ఱామ్పాట్టు. (శుడరొళి యిత్యాది) ఆదిత్యకిరణఙ్గళ్ ఎఙ్గుమ్ పరన్దన. నక్షత్రాధిపతియాన చన్ద్రనుమ్ వివర్ణనానాన్. తిరుచ్చోలైయిల్ మడల్ విరిన్ద పాళైయిన్ మణత్తై క్కొణ్డు విడికాఱ్ఱానతు వన్దతు. కైయుమ్ తిరువాழிయుమాన అழకైక్కొణ్డు ఉణర్న్దరుళవేణు మెన్గిఱార్. ముతల్పాట్టిల్- కీழ் దిక్కిల్ ఉదయగిరియిలే వన్దణైన్దానెన్ఱతు; ఇతిల్ - నేరాక ఉదిత్తు, తన్నుడైయ తేజస్సై ఎఙ్గుమ్ పరప్పిక్కొణ్డువన్దు తోన్ఱినాన్ -ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ : (శుడరొళి పరన్దన శూழ் తిశై యెల్లామ్) శూழ்న్ద దిక్కుక్కళెఙ్గుమ్ శుడరొళియానతు- ఆదిత్యనుడైయ తేజస్సానతు- విస్తృతమాయిఱ్ఱు. "తేజసాం రాశిమూర్జితమ్" ఎన్ఱుమ్, "పయిలుమ్ శుడరొళి" ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే దేవరీరుడైయ తిరుమేని యొళియానతు ఎఙ్గుమొక్క విస్తృతమామ్బడియాక ఉణర్న్దరుళలాకాతో ? ఎన్ఱు కరుత్తు.

(తున్నియ ఇత్యాది) నెరుఙ్గిన నక్షత్రఙ్గళినుడైయ పరమ్ శెయ్కిఱ తేజస్సానతు సఙ్కుచితమాయ్ విస్తృతమాన వెళియైయుడైయ కుళిర్న్ద చన్ద్రనుమ్,

(పశుత్తనన్) - వివర్ణనానాన్. కరుకినానెన్ఱు కరుత్తు. "తారకైయిన్ పుఱమ్ తడవి యప్పాల్ మిక్కు" ఎన్ఱుమ్, "చన్ద్రకాన్తాననం రామమ్" ఎన్ఱుమ్ సర్వపదార్థఙ్గళైయుమ్ ధరిప్పిక్కప్పణ్ణుమ్ తిరువడికళైయుడైయరాయ్, సకలకలాపరిపూర్ణరాయ్, నిష్కళఙ్కనాన చన్ద్రనైప్పోలే యిరుక్కిఱ కుళిర్న్ద తిరుముఖత్తై యుడైయ దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళలాకాతో? ఆకాశప్పరప్పెల్లామ్ ముప్పల్ (ముత్తుప్పన్దల్) విరిత్తాప్పోలే యిరుక్కిఱ నక్షత్రఙ్గళినుడైయ దీప్తియుమ్ మఱైన్దు, ఇవఱ్ఱుక్కు నిర్వాహకనాన చన్ద్రనుడైయ పరన్ద దీప్తియుమ్ పోయిఱ్ఱు; దేవరీర్ అమలఙ్గళాక విழிత్తరుళామైయాలే చన్ద్రన్ తన్పరికరముమ్ తానుమ్ వేఱ్ఱురు క్కొణ్డాన్.

(పాయిరుళ్) వ్యాపిత్త ఇరుళ్.

(అకన్ఱతు) నిరస్తమాయిఱ్ఱు.

(పైవెమ్బుழிలిత్యాది) కలక్కమ్ తెళిన్దాల్ తన్దాముడైయ భోగమ్ ఒరుక్కువారైప్పోలే.

(మడలిడై క్కీఱి వణ్పాళైకళ్ నాఱ) పాళైక్కు వణ్మైయావతు- కాఱ్ఱుక్కుత్తన్ పక్కలుళ్ళతై క్కొడుక్కైయిఱే. (వైకఱై) ఎన్ఱు- విడియఱ్కాలమ్. (మారుతమ్) కాఱ్ఱు. విడికాఱ్ఱు వరుకైయుమ్, కముకిలుణ్డాన పాళైకళ్ వికసితమాకైయుమ్, ఇతిలుణ్డానమణత్తై క్కాఱ్ఱు కొణ్డువరుకైయాలే నాఱ్ఱమ్ విఞ్జిఱ్ఱు. కూరుకైయావతు- మికుకై. "మన్ఱాడు తెన్ఱలులా" ఎన్ఱు పాతువాన కాఱ్ఱన్ఱియే విడిన్దమైక్కడైయాళమ్ తెరియ క్కాఱ్ఱు వరచ్చెయ్తేయుమ్ కణ్వళర్న్దరుళ వేణుమో?

(అడలొళి యిత్యాది) ఆదిత్యకిరణఙ్గళ్ మిన్మినియామ్బడియిఱే తిరువాழிయాழ்వానొళి. పెరియ మిడుక్కైయుడైత్తాయ్, ఒళి తికழானిఱ్పతాయ్, తేజస్సు విళఙ్గానిన్ఱుళ్ళ తికిరియైయుడైత్తాయ్, వెఱుమ్ పుఱత్తిలే ఆలత్తివழிక్క వేణ్డుమ్బడియాన అழకైయుముడైయ తిరుక్కైయిలే.

(తడక్కై) తిరువాழிయాழ்వానుక్కు ఇడమ్ పోరుమ్బడియాన తిరుక్కై.

(అరఙ్గత్తమ్మా) ఆర్తరానార్క్కు ముకమ్ కొడుక్క వన్ద విడత్తే కిడన్దు ఉఙ్గుమత్తనైయో ? దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళ వేణుమెన్గిఱార్.

*అరు : మూన్ఱామ్పాట్టు. (పరమ్ శెయ్కిఱ) ఆకాశత్తుక్కు పరభాగమ్ శెయ్కిఱ. (ముత్తుప్పన్దల్) ముత్తు క్కట్టిన మేఱ్కట్టి.*

భావదీపిక వివరణం

మూడవ పాశురం - అవతారిక : "సూర్యుని కిరణాలు అంతటా వ్యాపించాయి. కాంతిని కల్గిన నక్షత్రాలకు నాథుడైన చంద్రుడుకూడా కాంతిని కోల్పోయాడు. శ్రీరంగంలోని తోటలలో పోకచెట్ల పూలగుత్తుల సువాసనను గ్రహించి, ప్రాతఃకాలంలోని వాయువు వచ్చి వీస్తున్నది. చేతిలో శ్రీసుదర్శనాన్ని ధరించిన అందాన్ని భక్తులకు దర్శింపజేస్తూ నీవు మేల్కొనాలి" అని ఇందులో

అంటున్నారు మొదటి పాశురంలో - "తూర్పు దిక్కులో ఉదయగిరిపై సూర్యుడు ఉదయించాడు'' అని అన్నారు. ఈ పాశురంలో - "ఆ పిమ్మట, చక్కగా ఉదయించి, తన కాంతిని అన్నిచోట్ల వ్యాపింపజేస్తూ ప్రకాశిస్తున్నాడు'' - అని అంటున్నారు.

వ్యాఖ్యానమ్ : **(శుడరొళి పరన్దన శూழ் తిశై యెల్లామ్)** కనబడిన చోట అంతట సూర్యుని కిరణాల కాంతి వ్యాపించింది. **"తం దృష్ట్వా తే తదా దేవాః శంఖచక్రగదాధరమ్, అపూర్వరూపసంస్థానం తేజసాం రాశిమూర్జితమ్"** (విష్ణు.పు-1-9-67) (శంఖచక్రగదాధరుడై, అపూర్వమైన తిరుమేని పొందికను (సన్నివేశాన్ని) కలవాడై, గొప్ప తేజోరాశి అయిన ఆ భగవానుని దర్శించిన దేవతలు అపుడు స్తుతించడానికి ఆరంభించారు) అని, **"పయిలుమ్ శుడరొళి"** (తిరువాయ్-3-7-1) (వ్యాపించే ప్రకాశించే కాంతి) అని పలికే రీతిలో కోటి సూర్యుల ప్రకాశాన్ని కల్గిన నీ తిరుమేనికాంతి అన్నిచోట్ల వ్యాపించేటట్లుగా కటాక్షించవద్దా !- అని భావం.

**(తున్నియ తారకై మిన్నొళి శురుజ్గి)**- దట్టంగా ఉండే నక్షత్రాల నిబిడమైన కాంతి సూర్యకిరణాలచేత మఱుగుపడి కాంతిహీనమై పోయింది.

**(శుడరొళి పశుత్తనన్ పనిమది ఇవనో)** -రాత్రిలో వ్యాపించిన కాంతిని కల చల్లని చంద్రుడుకూడా కాంతిని కోల్పోయాడు. నక్షత్రాల కాంతినివలె నక్షత్ర నాథుని కాంతికూడా వెలవెల పోయింది- భావం. **"ఇరువిశుమ్బినూడు పోయ్ ఎழுన్దు మేలై త్తణ్మదియమ్ కదిరవనుమ్ తవిర వోడి, తారకైయిన్ పుఱమ్ తడవి అప్పాల్ మిక్కు మణ్ముழுతుమ్ అకప్పడుత్తు నిన్ఱ ఎన్దై"** (తిరునెడు-5) (గొప్ప ఆకాశాన్ని అతిక్రమించి దాటిపోయి సూర్యమండలాన్ని, దానికి పైన ఉండే చంద్రమండలాన్ని దాటి వెడలిపోయి, ఆవైపు బ్రహ్మలోకంవరకు వ్యాపించి నిలువగా, భూలోకం మొదలైన పదునాల్గు లోకాలను స్వాధీనం చేసికొన్న స్వామి) అనే రీతిలో అన్ని వస్తువులలో వ్యాపించి, వాటిని ధరించేటట్లుగా చేసే శ్రీచరణాలను కల్గినవాడు కనుక, నక్షత్రాలు మొదలైన అన్నివస్తువులకు నాయకుడై, **"చంద్రకాంతాననం రామమతీవ ప్రియదర్శనమ్"** (రామా.అయో.3-29) (చంద్రునివంటి మిక్కిలి అందమైన ముఖాన్ని కలవాడై, మిక్కిలి మధురమైన రూపాన్ని కలవాడైన శ్రీరాముని దశరథుడు చూచాడు) అనే రీతిలో తగ్గి హెచ్చే



కళలను కలవాడై, కళంకాన్ని కలవాడైన చంద్రునివలె కాకుండా, అన్ని కళలు నిండినవాడవై, కళంకం లేని చంద్రునివలె ఉన్నందువల్ల చంద్రుని కంటే అందమైనవాడవై, చల్లని ముఖాన్ని కల నీవు పడుకనుండి మేల్కొన వద్దా ? అని భావం. ఆకాశంలో ముత్యపు పందిరి విస్తరించినట్లుగా ఉండే నక్షత్రాల కాంతికూడా మఱుగుపడింది. వాటి నాయకుడైన చంద్రుని విస్తరించిన కాంతికూడా తఱిగిపోయింది. **"అవన్ కణ్కళాలే అమలజ్గళాక విழிక్కుమ్"** (తిరువాయ్-1-9-9) (అతడు తన నేత్రాలతో పవిత్రం అయేటట్లు కటాక్షిస్తాడు) అనే రీతిలో నీవు మేల్కొని కటాక్షించినందువల్ల చంద్రుడుకూడా తన సహచరులైన నక్షత్రాలతోపాటు రూపుమాఱి పోయాడు- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

**(పాయిరుళ్)**- రాత్రివేళలో అంతటా వ్యాపించిన చీకటి- అని భావం. ఆ చంద్రుని ప్రకాశానికి కారణమై వ్యాపించిన చీకటి.

**(అకన్ఱతు)** -మహారాజులు బయటికి వస్తే దొంగలు మఱుగుపడేటట్లుగా, (దాగుకొన్నట్లు), సూర్యుడు ఉదయించగానే చీకటి మఱుగుపడింది.

**(పైమ్బొழிల్ కముకిన్. మారుతమిదువో)**- కలత తీరగానే తమ అనుభవంతో అభినివేశాన్ని పొందేవారివలె ప్రాతఃకాలంలోని వాయువు, చీకటి తొలగిపోగానే, పచ్చగా శోభిల్లే తోటలలోని పోకచెట్ల పూల గుత్తులు విరియగా, వాటి సువాసనను మోసికొంటూ అంతటా వీస్తున్నది.

**(మడలిడై క్కీఱి వణ్పాళైకళ్ నాఱ)** అనే చోట పూలగుత్తులకు విశేషణమైన **"వణ్"** అనేపదంయొక్క అర్థమేమంటే- వాయువుకు తన దగ్గర ఉండే సుగంధాన్ని ఇవ్వడమే.

**(వైకఱై)** - అనే పదం ప్రాతఃకాలాన్ని తెల్పుతుంది. ప్రాతఃకాలంలోని గాలి వీచగానే పోకచెట్లలో ఉండే పూలగుత్తులు వికసించి పగులగా, వాటినుండి వెలువడే సుగంధాన్ని వాయువు మోసికొని వస్తున్నందున దానిని సువాసన మెండుగా ఉన్నది. **"కూర్న్దదు"** -మిక్కిలిగా ఉన్నది- అని అర్థం. **"మన్నూడు తెన్ఱలులామ్ మదిళరజ్గమ్"** (పెరియ్ழ్వార్ తిరు-4-8-9) అనే రీతిలో శ్రీరంగంలో ఎల్లప్పుడు వీచే గాలి కాదు ఇది. ప్రభాతానికి చిహ్నమైన సుగంధం మిక్కిలిగా ఉండే ఈ వాయువు వీచినా ఇంకా నిద్రించవచ్చునా ?

**(అడలొళి... పళ్ళి ఎழுన్దరుళాయే)** - శ్రీసుదర్శనాழ்వాన్‌ను ఉపయోగించి శత్రువులను నిర్జించినట్లుగా, శ్రీహస్తంలో శ్రీసుదర్శనం ధరించిన సన్నివేశంలోని అందాన్ని దర్శింపజేసి, మా శరీరంలోని శత్రువులైన ఇంద్రియాలకు వశపడి ఉండే స్వభావాన్ని పోగొట్టి, నీ అందాన్ని మేము అనుభవించేటట్లుగా నీవు మేల్కొనాలి-అని అంటున్నారు.

**(అడలొళి తికழ் తరు తికిరి)** - సూర్యకిరణాలు మిణుగురుపురుగులవలె కాంతివిహీనం అయే రీతిలో ఉన్నదికదా శ్రీసుదర్శనాழ்వాన్ కాంతి. అందువల్ల దానిని “అడలొళి” అని అంటున్నారు.

**(అడలొళి తికழ் తరు తికిరి అమ్‌తడక్కై)** - శత్రువులను అణచగల్గిన గొప్పబలాన్ని కల్గినదై, గొప్ప కాంతిని కల్గి ప్రకాశిస్తున్నదై, మిగిలిన కాంతులను అణిచే (మించి ఉండే) తేజస్సుతో గొప్పదైన శ్రీసుదర్శనాన్ని శ్రీహస్తంలో కలవాడనై, శ్రీసుదర్శనాన్ని ధరించకపోయినా, హారతి ఇచ్చి మంగళాశాసనం చేయవలసిన రీతిలోని అందాన్ని కల్గిన గొప్ప బాహువులో చాలా గొప్పవాడైన సుదర్శనుని ధరించడానికి అవకాశం చాలి ఉండే రీతిలోని విశాలమైన గొప్ప శ్రీహస్తాన్ని కల్గిన-వాడవైన అని భావం.

**(అరఙ్గత్తమ్మా ! పళ్ళి ఎழுన్దరుళాయే)** - సంసారదుఃఖాలతో క్లేశపడేవారికి ముఖాన్ని చూపించడంకోసం (దర్శనమివ్వడం కోసం) వచ్చి శ్రీరంగంలో పడరాని పాట్లు పడుతున్న నీవు నిద్రించవచ్చునా? నీవు ఇక పడుకునుండి నిద్రలేవాలి-అని అంటున్నారు.

**4.** మేట్టిళ మేతికళ్ తళైవిడుమాయర్‌కళ్
　　వేయ్‌ఙ్గుழలోశైయుమ్ విడైమణి క్కురలుమ్
ఈట్టి విశైతిశై పరన్దన వయలుళ్
　　ఇరిన్దన శురుమ్బినమ్ ఇలఙ్గైయర్‌కులత్తై
వాట్టియ వరిశిల వానవరేఱే !
　　మామునివేళ్వియై క్కాత్తు అవపిరతమ్
ఆట్టియ వడుతిఱ లయోత్తి యెమ్మరశే !
　　అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెழுన్దరుళాయే ॥



మేడు ఇళ మేతికళ్ = ఎత్తును, చిన్న వయస్సును కల ఎనుములను (గేదెలను), తళై విడుమ్ = (మేయడంకోసం) కట్టు విప్పి విడచిపెట్టే, ఆయర్‌కళ్= గొల్లలు (ఊదే), వేయ్‌ఙ్గుழల్ ఓశైయుమ్ = పిల్లనగ్రోవిధ్వని, విడై = ఎద్దుల (మెడలో కట్టిన), మణి= గంటల, కురలుమ్ = సవ్వడి (అనే), ఈట్టియ ఇశై = ఈ రెండు కలిసిన ధ్వని, తిశై పరన్దన = దిక్కులలో అంతా వ్యాపించింది, వయలుళ్= సస్యక్షేత్రాలలోని, శురుమ్బు ఇనమ్ = తుమ్మెదల గుంపులు, ఇరిన్దన= ఝుంకారాలను చేస్తూ పైకి లేచాయి, ఇలఙ్గైయర్ కులత్తై = రాక్షసవర్గాన్ని, వాట్టియ= రూపుమాపిన, వరి శిలై = అందమైన, శార్‌ఙ్గమనే వింటిని కల, వానవర్ ఏఱే = దేవాధిదేవా ! మా ముని = విశ్వామిత్రమునియొక్క, వేళ్వియై = యాగాన్ని, కాత్తు = రక్షించి, అవపిరతమ్ ఆట్టియ = అతనిచే అవబృథస్నానాన్ని చేయించి, పూర్తిచేసిన, అడు తిఱల్ = (విరోధులను) సంహరించగల్గిన బలాన్ని కలవాడవై, అయోత్తి ఎమ్ అరశే = అయోధ్యానగరాన్ని పాలించడంవల్ల మాకు స్వామి అయినవాడా!, అరఙ్గత్తమ్మా పళ్ళి ఎழுన్దరుళాయే = శ్రీరంగనాథా ! పడుకనుండి నిద్రలే.

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

*అవ : నాలామ్పాట్టు. చక్రవర్తి త్తిరుమకనాయ్ అవతరిత్తరుళి విరోధినిరసన పూర్వకమాక ఆశ్రితసంరక్షణమ్ పణ్ణి యరుళినాప్పోలే, త్వదనుభవవిరోధియై ప్పోక్కి అనుభవిక్క త్తిరుప్పళ్ళి యుణర్‌న్దరుళ వేణుమెన్గిఱార్.*

*వ్యా : నాలామ్పాట్టు. (మేట్టిళ మేతికళిత్యాది) కొమ్బుకళ్ అఙ్కురి యానిన్ఱుళ్ళ ఇళైయతాన ఎరుమైకళుమ్, అవఱ్ఱై నియమిక్కక్కడవ ఇడైయర్ ఊతుకిఱ కుழలోశైయుమ్, అతుక్కు మేలే మేయ పుఱప్పట్ట పశుక్కళిన్ నడువిల్ ఋషభఙ్గళిన్ కழுత్తిల్ మణిధ్వనియుమాయ్, ఇశైపోలే తిరణ్డ ధ్వని ఎల్లా దిక్కుక్కళిలుళ్ళ వయలెల్లామ్ పరన్దన (ఇరిన్దన శురుమ్బినమ్) అలరుకిఱ కాలపుష్పఙ్గళిల్ మధువై ప్పానమ్ పణ్ణిన వణ్డుకళానవై శబ్దిక్క తొడఙ్గిఱ్ఱిన.*

*(ఇలఙ్గైయరిత్యాది) దుర్వర్గత్తుక్కెల్లామ్ పుకలిడమాన లఙ్కైక్కు నిర్వాహక నాన రావణనుడైయ కులత్తై సపరికరమాక మాయ్‌త్త శ్రీశార్‌ఙ్గత్తై యుడైయరాయ్, బ్రహ్మాదికళుడైయ అపేక్షితమ్ శెయ్యప్పెఱ్ఱోమెన్నుమ్ మేనాణిప్పై యుముడై యవనే! (మాముని యిత్యాది) విశ్వామిత్రభగవానుడైయ యాగత్తుక్కు*

విఘ్నకర్తాక్కళుమాయ్, రావణవధత్తుక్కడియాన తాటకాతాటకేయరై నిరసిత్తు. (అవపిరతమాట్టియ) సమారాధనరూపమాన కర్తవ్యమ్ తలైక్కట్టి శత్రుపక్షమ్ మణ్ణుణ్ణుమ్బడియాన మిడుక్కైయుడైయరాయ్, తిరువయోధ్యైక్కు నిర్వాహకరాయ్ వైత్తు, అవ్వవతారత్తుక్కు ప్పిఱ్పాడరుమిழக్క వేణ్డాతపడి తిరువయోధ్యై- యిలుజ్గాట్టిల్ కోయిలై విరుమ్బిన సర్వాధికరాన దేవరీరుణర్న్దరుళి అడిమై కొణ్డరుళ వేణుమెన్గిఱార్.

## పెరియవాచ్చాన్బిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై : నాన్గామ్బాట్టు. (మేట్టిళ మేతికళిత్యాది) "ఎరుమై శిఱు వీడు" ఎన్గిఱపడియే శిఱు వీడిట్టియే, పెరు వీడుమ్ విడుమ్బడియాయ్, ఇళజ్గన్టు మేయ్క్క పెరుప్పట్టు తళైవిడుకిఱ ఆయర్ ఊతుకిఱ కుழలినోశైయుమ్, "కార్మణియి నావాడల్" ఎన్గిఱపడియే నాకిన్మేలే శెరుక్కి యోడుకిఱ విడైయినుడైయ కழుత్తిల్ మణియోశైయుమ్ దిక్కుక్కళెజ్గుమ్ పరన్దతు. మధుపానమ్ పణ్ణిన వణ్డుకళ్ ఆరవారిత్తుక్కొణ్డు కిళమ్బిற్று. ఇవற்றిన్ ఆర్ప్పరవమ్ అఱప్పోయ్ అతిక్రమిత్తు చ్చెల్లానిన్ఱతు. విరోధినిరసనశీలరాయ్ సర్వరక్షకరాన దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళ వేణుమెన్గిఱార్.

వ్యాఖ్యానమ్ : (మేట్టిళ మేతికళ్) ఇళజ్గన్టాయిరుక్కచ్చెయ్తే ఓజ్గి యిరుప్పనవాన ఎరుమైక్కన్టుకళ్. ఇవற்றినుడైయ

(తళై విడుమాయర్కళ్) తళైవిడుకైయావతు- కట్టువిడుకై. శిఱువీడన్టియే విడిన్దు మేయ్కైయాలే పరాక్కற்று మేయుమే. పిన్బు అవర్కళుక్కు పరాక్కற்ற పడియాలే కుழలూతుమిత్తనైయిఱే.

(విడై మణిక్కురలుమ్) పశుక్కళుమ్ విట్టు ఇవற்றుక్కు క్కడవతాన విడైమణి యోశైయుమ్, "జ్ఞానేన హీనః పశుభిస్సమానః" ఎన్నక్కడవతిఱే. ఇప్పడిక్కొత్త జ్ఞానహీనమాన పదార్థజ్గళుమ్ విట్టు సఞ్చరియానిన్ఱన. సర్వజ్ఞరాన దేవరీర్ ఉణర్న్దరుళవేణ్డావో? ఇప్పడిప్పట్ట కుழలోశైయాలుమ్, మణియోశైయాలుమ్

(ఈట్టియ విశై తిశై పరన్దన) తిరణ్డ ధ్వనికళానవై దిక్కుక్కళెజ్గుమ్, పరన్దన- విస్తృతమాయిற்று.



(వయలుళ్ ఇరిన్దన శురుమ్బినమ్) శోలైక్కుళ్ళిల్ అన్టియే వెళినిలమాన వయలిల్ తటాకజ్గళిలుణ్డాన తామరై శెజ్గழునీరిలే మధుపానమ్బణ్ణి వణ్డుకళానవై ఆరవారిత్తుక్కొణ్డు శితఱిற்றిన.

(ఇలజ్గైయర్ కులత్తై వాట్టియ) లజ్కైయిలుణ్డాన రావణసన్తానత్తై వాట్టియ. వాట్టుకై యావతు- నిశ్శేసమాక ముడిక్కై. కరియాక్కుకై. "వాట్టియ" ఎన్టాల్ కరియాక్కుమో? ఎన్నిల్, వీరపత్నియాకైయాలే "కిళ్ళిక్కళైన్దానై" ఎన్నుమాపోలే, ఇవరుమ్ తమ్ముడైయ వైయాత్యత్తాలే విరోధిత్తార్ శొల్లుమ్బడియే అనాయాసమాక చ్చెయ్త పడియైక్కొణ్డు వాట్టియ ఎన్టతిత్తనై. ఇవై ఎరిశి తఱుమ్ శరమాకైయాలే, దీప్తపావకసఙ్కాశజ్గళ్; ఆకైయాలే అవైకళై క్కరియాక్కి యల్లతువిడాతే. "నేయ మస్తి" యిఱే "సీతాయా స్తేజసా దగ్ధా"విఱే.

(వరిశిలై వానవరేఱే) "కాఞ్చనభూషణైః" ఎన్నుమ్బడియే, దర్శనీయమాన విల్లైయుడైయ వానవరేఱే! రాక్షసరై నిరసిత్తు అనుకూలనాన శ్రీవిభీషణాழ்వానై వైత్తాప్పోలే, ఇన్ద్రనుడైయ అమరావతియై ధరిప్పిత్తు ఇన్ద్రనుక్కు స్వర్గలోకత్తైయుమ్ కొడుత్తపడి.

(మాముని యిత్యాది) మునికళాకిఱార్- మననశీలరిఱే. "నినైన్దిరున్దే శిరమమ్ తీర్న్దేన్", "ఏహి పశ్య శరీరాణి" ఇత్యాది. ఎజ్గళ్ పక్కలుళ్ళతెల్లామ్ కుఱైచ్చరక్కు. ఉన్నమ్బు పార్త్తిరున్దో" మెన్నవల్లవర్కళిఱే. అప్పడిప్పట్ట ఋషికళ్ వన్దాలో పోకలావతు.

(మామునివేళ్ళియై క్కాత్తు) లజ్కైయై యழிక్కైక్కడియాన వీరత్తై చ్చొల్లుకిఱార్. తన్దామ్ కార్యజ్గళై తాన్దామే మననమ్ పణ్ణుమవర్కళ్ మునికళ్. ఇవనుక్కు మామునిత్వమావతు- తన్నుడైయ తపస్సై యழிయమాఱి, అవర్కళై శపిత్తు, తన్నుడైయ పారతన్త్ర్యత్తైయుమழிత్తు, భగవత్స్వాతన్త్ర్యత్తైయు మழிయాతే చక్రవర్తితిరుమకనై క్కొణ్డే కార్యమ్ తలైక్కట్టి క్కొళ్ళుకై. అధ్వరపరిత్రాణమ్ పణ్ణి అవరై క్కొణ్డే అవభృథస్నానమ్ పణ్ణి, అతుక్కీడాన ప్రతిపక్షత్తై ముడిక్కైక్కడియాన తిఱలై యుడైయ- పరాభిభవన సామర్థ్యత్తైయుడైయరుమాయ్, "దశ వర్షసహస్రాణి" ఎన్టాప్పోలే తీర్థమ్ ప్రసాదిక్కై యన్టిక్కే పిఱ్పాడరానారుమ్ పెఱుమ్బడియాక క్కోయిలిలే కణ్వళర్న్దరుళుకిఱ ఇతుక్కు ప్రయోజనమ్ వేణ్డావో? విరోధినిరసనమ్ పణ్ణినోమాకిల్ ఇని ఎన్ ? ఎన్టు కిడక్కలామో? అప్పడియే రాక్షసరాలే పీడితరాన

**దేవజాతికళ్ వన్దాల్ "ఉజ్గళుక్కు నాన్ శెయ్‌తపడి అழுకితో ?" ఎన్ఱు వినవి యరుళ వేణ్డావో? ఎన్గిఱార్? "ఉత్తిష్ఠ నరశార్దూల!" ఎన్ఱు కొణ్డు పణ్డే యెழுప్పిన ఋషికళ్ వన్దెழுప్పినాలో దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళ ప్పార్క్కిఱతు? అడియోజ్గళై రక్షిక్కైక్కాక ఎழுన్దిరున్దాలాకాతో?**

*అరు : నాలామ్బాట్టు. (ఇరిన్దన) శితఱిన్ఱిన. శబ్దమ్ "వాట్టియ" ఎన్ఱు శొల్లానిఱ్కు, దగ్ధమాకవెన్ఱు అర్థమ్ కొళ్ళుమ్బోతు. ఇప్పడి ఒన్ఱై ఒన్ఱాకచ్చొన్న ఇడముణ్డో? ఎన్న, అజ్ఞ్యేయుమ్ రావణును మిరుక్క ఇల్లై ఎన్ఱు తిరువడి శొన్నాన్ - ఎన్గిఱార్ (నేయ మస్తి యిఱే) ఎన్ఱు. దగ్ధమానతుక్కు ప్రమాణమరుళిచ్చెయ్‌కిఱార్ (సీతాయా ఇత్యాది) "కాఞ్చనభూషణైః" ఎన్ఱు అమ్బుకళ్ అழுకాయిరుక్కుమాపోలే "వరిశిలై" యెన్ఱు విల్లుమ్ అழுకాయిరుక్కు మెన్ఱపడి. (అమరావతి) ఇన్ద్రనుడైయ నగరమ్. (నినైతిరుక్కై) రక్షకనాక నినైక్కై. రక్షకనాక నినైత్తిరుప్పార్కళో? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (ఏహి పశ్యేత్యాది). (అవరై క్కొణ్డు) ఎన్ఱతు- పెరుమాళుడైయ తిఱలానతు- పెరుమాళై క్కొణ్డు అవనై అవభృథస్నానమ్ పణ్ణువిత్తతెన్ఱు తిఱలుక్కు విశేషణమ్. అప్పడిప్పట్ట తిఱలై యుడైయవన్- ఎన్ఱపడి.*

## భావదీపిక వివరణం

నాల్గవ పాశురం - అవతారిక : "ఎఱుమై శిఱు వీడు" (తిరుప్పావై-8) అనే రీతిలో ప్రాతఃకాలవేళలో కొంచెం సేపు మేయడంకోసం విడిచిపెట్టే శిఱుబీడు (చిన్న పచ్చికబయలు) కాకుండా, ఎనుములు పూర్తిగా మేయడంకోసం పెద్దబీడులో విడిచే కాలమై, లేగదూడలను మేపడం ఆరంభించి, వాటిని కట్టునుండి విడిచి పెట్టే గొల్లలు ఊదే పిల్లనగ్రోవిధ్వని, ఆవులను వెంబడించి పరుగెత్తే ఎద్దుల మెడలోని గంటలమోత - ఇవిఅన్ని దిక్కులలోను వ్యాపించాయి. శ్రీరాముడవై అవతరించి, భక్తులు నిన్ను అనుభవించడంలో విరోధులను నాశనం చేసి, వారిని రక్షించినట్లే, మేము నిన్ను అనుభవించడానికి అడ్డుగా ఉండేవానిని పోగొట్టి, మమ్మలను నిన్ను దర్శించి ఆనందించేటట్లుగా చేయడంకోసం పడుకనుండి నిద్రలేవాలి- అని అంటున్నారు.

వ్యాఖ్యానమ్ : **(మేట్టిళ మేదికళ్)** **"మేడు"** అనే పదం ఎత్తును, **"ఇళ"** అనే పదం చిన్న వయస్సును తెల్పుతున్నాయి. చిన్నవయస్సులో ఉన్నా, ఎత్తుగా ఎదిగిన



లేగదూడలు - అని భావం. **"కన్ఱుక్కఱవై"** (తిరుప్పావై-11) అని గోదాదేవి అనుగ్రహించినట్లే, ఇదికూడా.

**(మేట్టిళ మేదికళ్)** - కొమ్ములు మొలిచే లేతవయస్సులోని ఎనుములు- అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(తళై విడుమ్ ఆయర్‌కళ్)** - ఈ ఎనుముల యొక్క బంధాలను విడదీసే గొల్లలు. "ఎఱుమై శిఱు వీడు" (తిరుప్పావై-8) అని ఆణ్డాళ్ అనుగ్రహించినట్లే, చిన్నబీడు కాకుండా, పెద్దబీడులో మేసే ఈ గేదెలు.

**(వేయ్‌జ్కుழలోశైయుమ్)** - అవి ఇష్టం వచ్చినట్లు తిరుగకుండా, ఒక రీతిలో మేస్తున్నందువల్ల, వాటిని మేపడంకోసం వచ్చిన గొల్లలు పొద్దుపోవడంకోసం పిల్లనగోవిని మోగించడాన్ని తెలుపుతున్నది- ఈ ప్రయోగం.

**(విడమణి క్కురలుమ్)** - మేస్తూ ఉండే గోవులమధ్య ఆ గోవులతో పాటు సంబంధాన్ని కల్గిన ఆబోతులు వాటిని వెంబడిస్తూ పరుగెత్తినందువల్ల, వాటి మెడలలో కట్టిన గంటల చప్పుడు పిల్లనగోవి ధ్వనితో కలసి వినబడుతున్నది. **"ఆహారనిద్రాభయమైథునాని తుల్యాని ఖల్వత్ర సమస్తజంతోః, జ్ఞానాద్విశిష్టో హి నరః పరేభ్యో జ్ఞానేన హీనః పశుభిః సమానః"** (నరసింహపురాణమ్ - 16-13) (ఆహారం, నిద్ర, భయం, స్త్రీపురుష సంగం- అనేవి ఇక్కడ ఉండే అందఱి ప్రాణులకు సమానం. మిగిలినవానికంటే మానవుడు జ్ఞానంతో గొప్పవాడు. జ్ఞానం లేనివాడు పశువులతో సమానుడు) అని జ్ఞానం లేనివారికి ఉదాహరణంగా చెప్పబడ్డ పశువులు, వాటి వెంట తిరిగే గొల్లలుకూడా బయటకు వచ్చేటపుడు అన్నిటిని తెలిసిన నీవు నిద్రలేవవద్దా ! -అని భావం.

**(ఈట్టియ తిశై తిశై పరన్దన)** - ముందు పల్కిన పిల్లనగోవిధ్వని, గంటల చప్పుడు ఒకటిగా చేరి సంగీతధ్వనివలె అన్ని దిక్కులలోను వ్యాపించాయి. **"పరన్దన"** వ్యాపించాయి- అని అర్థం.

**(వయలుళ్ ఇరిన్దన శురుమ్బినమ్)** - పూర్వం తెలిపిన ధ్వనులు తోటలలో పుట్టినవి. తోటలకు బయట ఉండే పంట పొలాలలో గల జలాశయాలలో వికసించిన తామరలు, ఎఱ్ఱ కలువలు మొదలైన ప్రాతఃకాలంలో పూచే పూలలో గల తేనెను తాగిన తుమ్మెదలు ఝుంకారం చేస్తూ ఎగురుతున్నాయి.

**(ఇలజ్జైయర్ కులత్తై వాట్టియ వరిశిలై వానవరేఱే !)**- దుర్మార్గులు అందఱు చేరే చోటు అయిన లంకకు అధిపతి అయిన రావణుని కులాన్ని అతని బంధువులతో, ఆత్మీయులతోపాటు నశింపజేసిన శార్ఙ్గమనే వింటిని కలవాడవై, "బ్రహ్మ మొదలైన దేవతల ప్రార్థనను నెరవేర్చగలిగాముకదా'' అనే ఆనందంతో వెలుగుతున్నవాడా!

**(ఇలజ్జైయర్కులత్తై వాట్టియ)** లంకంలో ఉండే రావణుని కులాన్ని రూపుమాపిన- అని భావం. **"వాట్టియ"** అంటే -పూర్తిగా నశింపజేయడం- అంటే- బూడిద చేయడం. భస్మం చేయడానికి **"వాట్టియ"** అని అంటే చాలునా ? అని ప్రశ్నిస్తే, **"పొల్లా అరక్కనై క్కిళ్ళి క్కళైన్దానై"** (తిరుప్పావై-13) (దుష్ట రాక్షసుని గిల్లిపారవేసిన) అని అంటూ గోదాదేవి రావణసంహారాన్నిగూర్చి పలికేటపుడు, వీరపత్ని కనుక శ్రీరాముడు అనాయాసంగా రావణాదులను సంహరించిన విషయాన్ని తెలుపడంకోసం **"కిళ్ళి క్కళైన్దానై"** అని పల్కినట్లు, రావణాదులను ఎదిర్చిన శ్రీరాముడు తన వీరత్వాన్ని సుగ్రీవునకు వ్యక్తం చేసేటపుడు **"అంగుళ్యగ్రేణ తాన్ హన్యామ్"** (రామా-యుద్ధ-18-24) (ఆ దుష్టులను అందఱిని కాలివేలి అగ్రభాగంతో సంహరించగలను) అని తాను లీలగా శత్రువులను సంహరించగల్గిన వాడు- అని పల్కి, ఆ రీతిలో చేసినట్లుగా, ఈ ఆழ்వార్లు కూడా **"వాట్టియ"** అని అన్నారు. శ్రీరాముని బాణాలు **"ఎఱి శిదఱుమ్ శరమ్"** (పెరియా-తిరు-4-3-8) (నిప్పులను వెదజల్లే బాణాలు) అని, **"దీప్తపావకసంకాశైః"** (రామా-యుద్ధ-16-22) అని పలికే రీతిలో అగ్నిని వెలువరించే బాణాలు కనుక, శత్రువులను బూడిదచేసి తీరుతాయికదా! **"నేయ మస్తి పురీ లంకా న యూయం న చ రావణః, యస్మాదిక్ష్వాకునాథేన బద్ధం వైరం మహాత్మనా"** (రామా-సుంద-43-25)- (మహాపురుషుడు, ఇక్ష్వాకునాథుడు అయిన రాఘవునితో విరోధం ఏర్పరచుకొన్నందువల్ల ఈ లంకానగరం, మీరు, రావణుడు లేకుండా పోయారు) అని రావణుడు లంకలో ఉండగానే అతడు లేడు - అని హనుమానుడు పల్కినట్లుగా ఇక్కడ **"వాట్టియ"** అనే పదానికికూడా "నశింపజేసిన'' అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"సీతాయా స్తేజసా దగ్ధాం రామకోపప్రపీడితామ్, దహ్యమానా మిమాం పశ్య పురీం సాట్టప్రతోళికామ్"** (రామా-సుంద-51-37) (సీతయొక్క తేజస్సుతో దహింప బడినది, రావణుని కోపంతో బాగా పీడింపబడినది అయిన ఈ నగరం మేడలతో, వీథులతో దహింపబడుతున్న దానినిగా గమనించు) అని హనుమంతుడే లంక



దహింపబడబోతున్నట్లు పలికాడుకదా! **"దీప్తపావకసంకాశైః శితైః కాంచనభూషణైః, న త్వామిచ్ఛామ్యహం ద్రష్టుం రామేణ నిహతం శరైః"** (రామా-యుద్ధ-16-22) (జ్వలించే అగ్నివంటివి, పదునైనవి, బంగారుతో అలంకరింప బడినవి అయిన బాణాలతో రామునిచే నీవు వధింపబడడాన్ని నేను చూడాలని అనుకోవడంలేదు) అని విభీషణుడుకూడా మండే నిప్పువంటి బాణాలచేత రావణుడు నశించబోవడాన్ని అతనికి తెలియజేశాడుకదా !

**(వరిశిలై వానవరేఱే !)** - అందమైన వింటిని కల నిత్యసూరినాథా ! రాక్షసులను వధించి, నీకు మిత్రమైన విభీషణునకు పట్టాభిషేకాన్ని జరిపించినట్లే ఇంద్రునకు కూడా, పాడుపడిన అతని రాజధాని అమరావతిని పునరుద్ధరణం చేసి, అతనికి స్వర్గలోకాన్ని అనుగ్రహించిన వృత్తాంతాన్ని **"వానవరేఱే !"** అనే పదంతో తెలుపుతున్నారు.

**(మామునివేళ్వియై క్కాత్తు)** - మహాముని అయిన విశ్వామిత్రునియొక్క యాగాన్ని రక్షించి- అని భావం. **"మునివర్"** అనే పదం ఎల్లప్పుడు మననం చేసేవానిని తెలుపుతుంది. **"నినైన్దిరున్దే శిరమమ్ తీర్న్దేన్"** (పెరియాழ்వార్ తిరు-5-4-8) (మననం చేస్తూ శ్రమను తీరినవాడనయ్యాను) అనే రీతిలో భగవానునే మననం చేసి, అతనిచే తమ తాపాలను ఉపశమింపజేసికొనేవారు **"మామునులు"** (మహర్షులు) అవుతున్నారు. **"ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనామ్, హతానాం రాక్షసైర్ఘోరైః బహూనాం బహుధా వనే"** (రామా-ఆర-6-16) (శ్రీరామా! ఇక్కడకు రా. పరమాత్మను ధ్యానం చేసేవారు, వనంలో భయంకరులైన రాక్షసులచే పలు రీతులలో హింసింపబడినవారు అయిన పలు మునివరుల శరీరాలను చూడు) అనే రీతిలో "మాకు మమ్ములను రక్షించుకొనే శక్తి లేదు. నీ బాణాలతోనే మమ్ములనురక్షించ గోరుతున్నాము'' అని పలికేవారే మహర్షులు అవుతున్నారు. "అటువంటి మహర్షులు వచ్చినపుడే పడుకనుండి లేచి వస్తావా'' అని భావం.

**(మామునివేళ్వియై క్కాత్తు)** - లంకను నశింపజేయడంకోసం కారణమైన వీరి శ్రద్ధనుగూర్చి పల్కుతున్నారు. తమ కార్యాలను తామే తలచి చేసేవారు మునులు. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కావడానికి ముందు తన తపస్సును అంతటినీ వ్యయం చేసి, తన విరోధులకు శాపమిచ్చి, తన భగవత్పారతంత్ర్యాన్ని పోగొట్టుకొని, భగవానుని స్వాతంత్ర్యాన్ని పోగొట్టిన మునిగానే ఉన్నాడు. బ్రహ్మర్షి అయిన

తరువాత ఈ రీతిలో చేయకుండా శ్రీరాముని పురస్కరించుకొనియే తన కార్యాలను నెఱవేర్చుకొన్నవాడయ్యాడు. అందువల్ల అతడు ఇక్కడ **"మాముని"** అని చెప్పబడ్డాడు.

**(వేళ్వియై క్కాత్తు అవపిరతమాట్టియ అయోత్తియెమ్మరశే !)**- ఆ మహామునియొక్క యాగాన్ని రక్షించి, ఆయనను పురస్కరించుకొని యాగానికి అవబృథస్నానాన్ని చేసే రీతిలో రక్షణను నిర్వహించి, దానికి తగినట్లుగా శత్రువులను నిరసించడానికి అనువైన **"పరాభిభవనసామర్థ్యమ్"** (శత్రువులను అణచే సామర్థ్యం) అనబడే బలాన్ని కలవాడవై, **"దశ వర్షసహస్రాణి దశ వర్షశతాని చ, రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి"** (రామా-బాల- 1-97) (పదకొండువేల సంవత్సరాల పాటు శ్రీరాముడు రాజ్యాన్ని పాలించి బ్రహ్మలోకమనడే తన లోకాన్ని చేరగలడు) అనే రీతిలో చిరకాలం రాజ్యపాలనను చేసిన స్వామీ ! మహాముని యాగాన్ని రక్షించడం, అవబృథస్నానాన్ని చేయించడం మొదలైనవానిని బలం యొక్కకార్యాలుగా కూడా చెప్పవచ్చు. (**"అవరైక్కొణ్డే"** అని పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించినదానికి 'శ్రీరాముని పురస్కరించుకొని'' అని **"పెరుమాళైక్కొణ్డు"** అని అరుంబద వివరణంలో వివరింపబడింది.) **"ఎమ్ అరశే !"** అని ప్రయోగింపబడినందువల్ల ఆ శ్రీరామునివలె ఒక సమయంలో అవతారాన్ని పరిసమాప్తి చేసికొని పరమపదానికి వేంచేయకుండా, తరువాతి కాలానికి చెందిన నావంటివారుకూడా దర్శించి అనుభవించే రీతిలో శ్రీరంగాలయంలో శయనించి ఉన్నదానికి ప్రయోజనం ఉండవద్దా ?'' విరోధులైన రాక్షసులను నశింపజేశాను. ఇక చేయవలసినదేదీ లేదు'' అని శయనించవచ్చునా ? అపుడు రాక్షసులవల్ల క్లేశాన్ని పొందిన దేవతలు వచ్చినపుడు ''మీ విరోధులను నేను చక్కగా నశింపజేశాను కదా !'' అని అడుగవద్దా! అనే అర్థాలు తెలుపబడ్డాయి.

**(అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెழுన్దరుళాయే)** -**"కౌసల్యాసుప్రజా ! రామ ! పూర్వా సంధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల ! కర్తవ్యం దైవమాహ్నికమ్"** (రామా-బాల) అనే ప్రమాణానుసారం పూర్వం నిద్ర లేపిన విశ్వామిత్రునివంటి మహర్షులు వచ్చి నిద్ర లేపినపుడే నిద్రనుండి లేస్తావా ? దాసులమైన మమ్ములను రక్షించడానికి నిద్రనుండి లేపకూడదా? అని ఇచటి రస్యభావం. **"అయోత్తియెమ్మరశే! అరఙ్గత్తమ్మా !"** అనే ప్రయోగానికి "అయోధ్యకంటే శ్రీరంగాన్ని అభిమానించిన మా స్వామీ !'' అనే అర్థాన్ని నంజీయర్ తమ వ్యాఖ్యలో అనుగ్రహించారు.



**5. పులమ్బిన పుట్కళుమ్ పూమ్బొழிల్‌కళిన్ వాయ్**
**పోయిற்று క్కఙ్గుల్ పుకున్దతు పులరి**
**కలన్దతు కుణతిశై క్కనైకడలరవమ్**
**కళివణ్డు మిழற்றియ కలమ్బకమ్ పునైన్ద**
**అలఙ్గలమ్ తొడైయల్ కొణ్డు అడియిణై పణివాన్**
**అమరర్‌కళ్ పుకున్దనర్ ఆతలిలమ్మా !**
**ఇలఙ్గైయర్‌కోన్ వழிపాడు శెయ్ కోయిల్**
**ఎమ్బెరుమాన్ ! పళ్ళి యెழுన్దరుళాయే**

పూ = పూచిన, పొழிల్ కణిన్ వాయ్ = తోటలలో ఉండే, పుట్కళుమ్ = పక్షులుకూడా, పులమ్బిన = (నిద్రలేచి) కిలకిలారావాలు చేస్తున్నవి, కఙ్గుల్ = రాత్రి, పోయిற்று = గడచిపోయింది, పులరి = ఉదయకాలం, పుకున్దదు = ప్రవేశించింది (వచ్చింది), కుణ దిశై = తూర్పుదిక్కులో, కనై =ఘోషను చేస్తున్న, కడల్ = సముద్రంయొక్క, అరవమ్= ధ్వని, కలన్దదు = వ్యాపించింది, కళి = తేనెను తాగి మత్తెక్కిన, వణ్డు = తుమ్మెదలు, మిழற்றియ = శబ్దిస్తున్నవై, కలమ్బకమ్ పునైన్ద = పలువిధాలైన పూలతో కూర్పబడినవై, అమ్= అందమైన, అలఙ్గల్ తొడైయల్ కొణ్డు = పూలమాలికలను ధరించి, అమరర్‌కళ్ = దేవతలు, అడియిణై పణివాన్ = నీ శ్రీచరణాలను సేవించడం కోసం, పుకున్దనర్ = వచ్చి నిలచారు, ఆదలిల్ = అందువల్ల, అమ్మా = సర్వస్వామీ !, ఇలఙ్గైయర్ కోన్ వழிపాడు శెయ్ కోయిల్ = లంకకు ప్రభువైన విభీషణాழ்వాన్ కైంకర్యాన్ని చేసే కోవెలలో, (శయనించే), ఎమ్ పెరుమాన్ = మాస్వామీ !, పళ్ళి ఎழுన్దరుళాయే = నిద్రలే !

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

*అవతారికై : అఙ్గామ్బాట్టు. దేవజాతియానతు కల్పకఙ్గళిల్ పూక్కళెల్లామ్ తొడుత్తు మన్త్రపుష్పమ్ పణ్ణి ప్పరిమాఱుక్కైక్కాక, "అరుళ్ పాడిడువతు ఎప్పోతో?" ఎన్ఱు అవసరప్రతీక్షరాయ్ వన్దు నిన్ఱార్‌కళ్. జన్మాదికళిల్ తాழ்వు ఏற்றమ్ పారాతే అడిమై కొణ్డరుళుమ్ దేవరీర్ ఉణర్న్దరుళి అడిమైక్కొణ్డరుళ వేణుమెన్గిఱార్.*

*వ్యాఖ్యానమ్ : (పులమ్బిన ఇత్యాది) తిరుచ్చోలైయిల్ పక్షికళానవై ఉణర్న్దు ఆరవారియానిన్ఱన. (పోయిற்று క్కఙ్గులిత్యాది) సర్వరైయు మనుభవిక్కక్కడవ*

*తమస్సుక్కాశ్రయమాన రాత్రియావతు వాసనైయోడే పోయిఱ్ఱు. (పుకున్దతు పులరి) సత్త్వోత్తరమాకైయాలే ఆరాధనయోగ్యమాన కాలముమ్ సన్నిహిత మాయిఱ్ఱు. (కలన్దతిత్యాది) కీఴై దిక్కిలే ఘోషిక్కైయే స్వభావమాన సముద్రఘోషమ్ ఎఙ్గుమ్ వ్యాపిత్తతు.*

*(కళివణ్డిత్యాది)* మధుపానమ్ పణ్ణి క్కళిక్కిఱ వణ్డుకళోడేకూడిన నానావిధ పుష్పఙ్గళై త్తొడుత్తు అన్ద మాలైకళై యేన్దిక్కొణ్డు దేవర్కళడైయ ఎల్లారుక్కుమ్ నాథనాన దేవరీర్ తిరువడికళిలే శాత్తుకైక్కు *"అరుళ్ పాడిడువతెప్పోతో ?"* ఎన్ఱు పుకున్దు నిన్ఱార్కళ్.

*(అతలిల్) ఆకైయాలే, పరావరేశరాన దేవరీర్. (ఇలఙ్గైయర్కోన్ ఇత్యాది) రావణానుజనెన్ఱు పారాతే లఙ్కాధిపతియాన శ్రీవిభీషణాఴ్వానాలే కొణ్డాడప్పట్ట కోయిలిలే అస్మదాదికళుక్కు ముకమ్ తర ఇరుక్కిఱ దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళ వేణుమెన్గిఱార్. అథవా, శ్రీవిభీషణాఴ్వానై అడిమై కొణ్డాప్పోలే అడియోఙ్గళైయుమ్ అడిమై కొణ్డరుళవేణు మెన్గిఱారాకవుమామ్.*

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై : అఞ్జామ్పాట్టు (పులమ్బిన ఇత్యాది) మున్నిల్ పాట్టిలే- "వయలుళ్ ఇరిన్దన శురుమ్బినమ్" ఎన్ఱతు. ఇప్పాట్టిలే -పోతు వైకినాల్ ఉణరక్కడవతాన పక్షికళుముణర్న్దన ఎన్గిఱతు. మున్నిల్ పాట్టిల్ ఉణర్న్దవఱ్ఱుక్కుమ్ ఇప్పాట్టిల్ ఉణర్న్దవఱ్ఱుక్కుమ్, భగవత్ప్రవణర్క్కుమ్ సంసారికళుక్కుముళ్ళ వాశి పోరుఙ్గాణుమ్, వయలిలుళ్ళవైపోలన్ఱిఱే, శోలైయాయ్ అతిలే పూమ్బొఴిలా యిరుక్కచ్చెయ్తే ఉణరుకిఱనవిఱే. పోతు వైకినపడి.

వ్యా : (పులమ్బిన పుట్కళుమ్) "వణ్డిన మురలుమ్ శోలై మయిలిన మాలుమ్ శోలై కొణ్డల్ మీతణవుమ్ శోలై" ఎన్ఱారిఱే. అవై యెల్లామ్ ప్రీతిప్రకర్షత్తాలే శిలర్ పాడ శిలర్ నృత్తగీతవాద్యఙ్గళ్ పణ్ణ, అతుక్కు ఇశైయ చ్చిలరాడ, శిలర్ కొణ్డాడ విరున్దతిఱే - అఙ్గు; ఇఙ్గు, - శిలర్ "పెరియ పెరుమాళ్ పోతు వైకవుమ్ పళ్ళికొళ్వతే" ఎన్ఱు కూప్పిడుమాపోలే యిరుక్కిఱతు.

(పోయిఱ్ఱు క్కఙ్గుల్) మున్బుపోలే అకన్ఱమాత్రమే యన్ఱిక్కే రాత్రియానతు నిశ్శేషమాయ్త్తు.



(పుకున్దతు పులరి) తమస్సు నేరాక ప్పోనాల్ పిన్బు సత్త్వమేయాయిరుక్కుమాపోలే; ఆకైయాలిఱే, "పకఱ్కణ్డేన్" ఎన్ఱతు.

(కలన్దతు కుణతిశై క్కనైకడలరవమ్) ఘోషమాత్రమన్ఱిక్కే ఎఙ్గుమొక్క వ్యాపిత్తతు.

(కళివణ్డిత్యాది) ఉఱవు ముఱైయార్ప్పైట్టిని విట్టు విరున్దాణారై క్కాలుమ్ కలముమ్ వైత్తూట్టువారైప్పోలేయిఱే దేవరీర్పడి. ప్రయోజనాన్తరపరరాన దేవర్కళ్, తన్దామ్ పదభ్రంశమ్ వారామైక్కాక, నన్ఱాయ్ చ్చెఱిన్ద వణ్డుకళ్ మధుపానమ్ పణ్ణి క్కళిత్తు ప్పాడిక్కొణ్డు సేవియానిఱ్పతాయ్, కలమ్బకనా యిరున్దుళ్ళ అన్ద త్తొడైయలఙ్గల్కళ్ కొణ్డువన్దార్కళ్. అవర్కళుక్కాకిలుమ్ ముకమ్ కొడుత్తరుళీరో? ఎన్గిఱార్.

(ఆతలిలమ్మా) ఎన్ మాలై శాత్తాతపోతుమ్ "ఎన్నాయనన్ఱు" ఎన్నవొణ్ణాతిఱే. ఇప్పడి విణ్ణప్పమ్ శెయ్యు మివర్ పేచ్చు ఇనితాయిరున్దవాఱే పళ్ళికొణ్డరుళ.

(ఇలఙ్గైయర్కోన్ వఴిపాడు శెయ్ కోయిల్) పళ్ళికొణ్డరుళవేణుమెన్ఱవన్ తానే వన్దు "ఎఴున్దిరుమ్" ఎన్ఱాలో తిరుప్పళ్ళి యుణర్న్దరుళువతు. వఴిపాడు శెయ్కైయావతు- తిరువుళ్ళక్కరుత్తఱిన్దు అడిమై శెయ్కైయిఱే.

(ఇలఙ్గైయర్కోన్ వఴిపాడు శెయ్ కోయిల్) ఇతువుమోరేఱ్ఱమిఱే ఇఙ్గుత్తైక్కు.

(ఎమ్బెరుమాన్) ఆశ్రితపరాధీనరాన దేవరీర్ తిరుప్పళ్ళి ఎఴున్దరుళ వేణు మెన్గిఱార్.

*అరు :- అఞ్జామ్పాట్టు. (పులరి) - విడివు. విడివెన్ఱాల్ జ్ఞానత్తై క్కాట్టుమో? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (అకైయాలిఱే యిత్యాది) సముద్రమ్ మికవుమ్ ధ్వనిక్కై విడివుక్కు అడయాళమ్. తమక్కు ముఖమ్ కొడామల్ ప్రయోజనాన్తరపరర్క్కు ముఖమ్ కొడుక్కైయై పఱ్ఱ అరుళిచ్చెయ్కిఱార్ (ఉఱవుముఱైయారిత్యాది) (కాల్) - తాల క్కాల్; అమ్మానాతల్. అమ్మానాకైయాలే మాలై శాత్తవేణుమ్.*

## భావదీపిక వివరణం

అయిదవ పాశురం - అవతారిక : "దేవతలు కల్పవృక్షాలలోని పూలతో మాలికలను కూర్చి వాటిని వేదమంత్రాలను ఉచ్చరిస్తూ నీకు అలంకరించడంకోసం,

“భగవానుడు మనలను ఎపుడు ఆజ్ఞాపిస్తాడో!'' అని ఎదురు చూస్తూ వచ్చి నిలచారు. దేవతలు, రాక్షసులు, మానవులు- అనే తారతమ్యాలను గమనించకుండా అందఱినుండి కైంకర్యాన్ని స్వీకరించే నీవు శయనంనుండి లేచి, మాకైంకర్యాన్ని స్వీకరించాలి - అని ప్రార్థిస్తున్నారు. గత పాశురంలో - **“వయలుళ్ ఇరిన్దన శురుమ్బినమ్”** అని అంటూ క్షేత్రాలలోని తుమ్మెదలు నిద్రలేవడాన్ని సూచించారు. ఇందులో - క్షేత్రాల లోపల ఉండే తోటలలో సుఖంగా నిద్రిస్తున్నవై, పొద్దు పొడిచిన తరువాతే నిద్ర లేచే పక్షులు కూడా నిద్రలేచాయి- అని అంటున్నారు. గడచిన పాశురంలో నిద్ర లేచినవానికి, ఈ పాశురంలో నిద్ర లేచినవానికిగల తారతమ్యం- భగవానుని పట్ల అభినివేశాన్ని కలవారికి, శబ్దాదివిషయాలలో అభినివేశాన్ని పొందిన సంసారులకు గల తారతమ్యం వంటిది. తుమ్మెదలు పొలాలలో నిద్రిస్తున్నవి కనుక సూర్యుడు ఉదయించగానే నిద్రలేస్తాయి. తోటలలోను, అందులోను, పూదోటలలో ఉండే పక్షులు పొద్దు పొడిచిన తరువాతనే నిద్ర లేస్తాయి. (అంటే- కొంత ఆలస్యంగా నిద్రలేస్తాయి).

వ్యాఖ్యానమ్ : **(పులమ్బిన పుట్కళుమ్)** - **“వణ్డిన మురలుమ్ శోలై మయిలిన మాలుమ్ శోలై కొణ్డల్ మీదణవుమ్ శోలై కుయిలినమ్ కూవుమ్ శోలై”** (తిరుమాలై-14) (తుమ్మెదల గుంపు ధ్వనించే తోట, నెమళ్ళగుంపులు నృత్యం చేసే తోట, మేఘాలు పైన సంచరించే తోట, కోయిల గుంపులు కూసే తోట) అని ఈ ఆழ்వార్లు తిరుమాలై ప్రబంధంలో పల్కిన రీతిలో శ్రీరంగంలో అన్ని కాలాలలోను తుమ్మెదలు గొప్ప ఆనందంతో పాడేటట్లు, నెమళ్ళు దానికి అనురూపంగా నాట్యమాడేటట్లు మేఘాలు తూర్యధ్వనిని చేసేటట్లు, కోయిలలు పొగడేటట్లు ఉంటుంది. ఇక్కడ ఇపుడు పక్షులు మాయడం “పెరియపెరుమాళ్ ఈవిధంగా ఉదయమైన తరువాతకూడా పరుండి ఉండవచ్చునా !'' అని కూస్తున్నట్లున్నది.

**(పోయిற்று క్కఙ్గుల్)** - అందఱిని నిద్రలోకి తీసికొని పోయే చీకటి ఆశ్రయమైన రాత్రి **“పాయిరుళ్ అకన్దదు”** అని మూడవ పాశురంలో పల్కిన రీతిలో తొలగిపోవడమే కాకుండా, పూర్తిగా నశించింది.

**(పుకున్దదు పులరి)** - తమోగుణాన్ని వృద్ధి చేసే చీకటి పూర్తిగా పోయినపుడు తరువాత సత్త్వగుణాన్ని వృద్ధి చేసే ఉదయకాలం రావడం సహజంకదా !



**“పకఱ్కణ్డేన్ నారణనై క్కణ్డేన్”** (ఇరణ్డామ్ తిరు-81) (పగలును చూచాను; నారాయణుని చూచాను) అని సత్త్వగుణంవల్ల కలిగే భగవత్సాక్షాత్కారం **“పకల్”** అని అనబడుతున్నది కదా ! నీ తిరువారాధనకు తగినదిగా ఉండే ఉదయకాలం వచ్చింది- అని భావం.

**(కలన్దదు కుణతిశై కనైకడలరవమ్)** - తూర్పు దిక్కులో ఘోషించడమే స్వభావంగా కల తూర్పుసముద్రం యొక్క ధ్వని కేవలం ఘోషగా కాకుండా, నీకు సుప్రభాతం పాడేటట్లుగా అంతటా వ్యాపించింది.

**(కలివణ్డు మిழற்றియ... అమరర్కళ్ పుకున్దనర్)**- తేనెను తాగి మత్తెక్కిన తుమ్మెదలతో కూడినవి, పలు విధాలైన, దేవలోకంలోని పుష్పాలతో కూర్పబడ్డ కదంబమాలలను మోసికొని దేవతలు అందఱు దేవాధిదేవుడవైన నీ శ్రీచరణాలలో సమర్పించడంకోసం నీ ఆజ్ఞను ఎదురుచూస్తూ వచ్చి నిలుచున్నారు. ఇంట్లో ఉండే ఆడపిల్లలు ఆకలితో ఉన్నా (ఉపవాసంతో ఉన్నా), అతిథులకు ఆతిథ్యమిచ్చి, తాంబూలం మొదలైనవానిని ఇచ్చి ఉపకారం చేసేవారి స్వభావంవంటి స్వభావాన్ని కలవాడవుకదా నీవు! మాకోసం కాకపోయినా, అతిథులైన ఆ దేవతలకోసం అయినా నీ దర్శనాన్ని అనుగ్రహించాలి. ప్రయోజనాంతరాలను ఆశించేవారై, తమ పదవులను కోల్పోకుండా ఉండడంకోసం వచ్చి సేవ చేసేవారుకదా, దేవతలు.

**(ఆదలిల్ అమ్మా !)** - అందువల్ల అందఱికి స్వామి అయిన నీవు నేను కూర్చిన మాలికను స్వీకరించకపోయినా, నీవు నా స్వామివి కాదని చెప్పడానికి వీలులేదే ! (“స్వామి'' అనియే వ్యాఖ్యానించినందువల్ల **“అమ్మాన్”**, **“అరఙ్గత్తమ్మాన్”** అనే పాఠం తగినది.) ఈ విధంగా విన్నపించే వీరి మాటలు చాలా ప్రియంగా ఉన్నందువల్ల దానిని వింటూ, కన్ను తెఱవకుండా ఉన్నాడు శ్రీరంగనాథుడు. ఆ కారణంవల్ల విన్నపిస్తున్నారు.

**(ఇలఙ్గైయర్కోన్ వழிపాడు శెయ్ కోయిల్)** - రావణుని తమ్ముడు అనే తక్కువదనాన్ని గమనించకుండా, నీచేత లంకకు ప్రభువుగా నియమింపబడి, నిన్ను ఇక్కడకు తీసికొనివచ్చి “శయనించాలి'' అని ప్రార్థించిన విభీషణుడు తానే స్వయంగా వచ్చి “నిద్రనుండి లేవాలి'' అని ప్రార్థిస్తేనే నిద్రనుండి లేస్తావా ?- **“వழிపాడు”** చేయడం అంటే -భగవానుని అభిప్రాయాన్ని గమనించి కైంకర్యాన్ని చేయడమే కదా ! “శ్రీరామునివద్దనుండి కులధనంగా నిన్ను పొంది, లంకకు

తీసికొనిపోవడం కోసంగా వెళ్ళే విభీషణుని అభిప్రాయాన్ని మార్చి, ఇక్కడనే శయనించడానికి కారణం మావంటి వారికి కృపజేయడం కోసమే కదా ! నిద్రనుండి లేచి, మాకు అనుగ్రహం చూపాలి" అని భావం. విభీషణాఴ్వాన్ చేసే కైంకర్యాన్ని స్వీకరించేటట్లే మమ్ములను కూడా దాసులనుగా స్వీకరించాలి -అని నంజీయర్ వ్యాఖ్య.

**(ఎమ్బెరుమాన్ పళ్ళి యెఴున్దరుళాయే)** - (శ్రీరంగమాహాత్మ్యన్నిబట్టి) విభీషణుడనే దాసునకు వశుడవైన నీవు దాసులమైన మా ప్రార్థనను స్వీకరించి, నిద్రనుండి లేవాలి- అని అంటున్నారు.

**6.** ఇరవియర్ మణినెడుమ్ తేరొడుమివరో
ఇఱైయవర్ పతినొరు విడైయరు మివరో
మరువియ మయిలినన్ అఱుముకనివనో
మరుతరుమ్ వశుక్కళుమ్ వన్దు వన్దీణ్డి
పురవియోడాడలుమ్ పాడలుమ్ తేరుమ్
కుమరదణ్డమ్ పుకున్దీణ్డియ వెళ్ళమ్
అరువరై యనైయ నిన్ కోయిల్మున్నివరో
అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెఴున్దరుళాయే

మణి = (మణివలె) గొప్పదై, నెడు = పెద్దది అయిన, తేరొడుమ్ = రథంతో కూడ, ఇరవియర్ = పన్నెండుమంది ఆదిత్యులు, ఇఱైయవర్ = సంసారులకు నిర్వాహకులైన (ప్రభువులైన) పదినొరు విడైయరుమ్ = ఏకాదశరుద్రులు, మరువియ = పొందికగా ఉండే, మయిలినన్ = నెమలిని వాహనంగా కల్గిన, అఱు ముకన్ = షణ్ముఖుడు, మరుతరుమ్ = మరుద్గణాలు అనే **49** మంది, వశుక్కళుమ్ = అష్టవసువులు, వన్దు వన్దు = ఒకరికంటే ఒకరు ముందుగా వచ్చి, ఈణ్డి = నిబిడంగా గుమిగూడి ఉండగా, (వీరివాహనమైన), పురవియోడు తేరుమ్ =గుఱ్ఱాలను పూన్చిన రథాలు, పాడలుమ్ ఆడలుమ్ = గీతాలు, నృత్యాలై, కుమర తణ్డమ్ పుకున్దు = దేవసేనామూహాలువచ్చి ప్రవేశించి, ఈణ్డియ వెళ్ళమ్= చాలా సమ్మర్దంగా ఉండే సమూహం, అరు వరై అనైయ = పెద్ద పర్వతం అనే రీతిలో, కోయిల్ =శ్రీరంగాలయంలో, నిన్ మున్ = నీ కంటిముందు, ఇవరో, ఇవరో = ఇదిగో నిలచి ఉన్నారు, అరఙ్గత్తమ్మా = శ్రీరంగంలోని స్వామీ, పళ్ళి ఎఴున్దరుళాయే = శయ్యనుండి లేవాలి.



నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

అవతారికై : ఆఱామ్బాట్టు. దేవసేనాపతియోడేకూడ జగత్తుక్కు నిర్వాహకరాన సకలదేవతైకళుమ్ సపరికరరాయ్క్కొణ్డు స్వాభిమతసిద్ధ్యర్థమాక ఆశ్రయిక్క వన్దు నిన్ఱార్కళ్. దేవరీర్ ఉణర్న్దరుళి విశేషకటాక్షమ్ పణ్ణి యరుళవేణుమెన్గిఱార్.

*వ్యాఖ్యానమ్ : (ఇరవియరిత్యాది) ద్వాదశాదిత్యర్కళ్, తఙ్గళుడైయ విలక్షణ మాయ్ ప్పెరితాన తేరోడే వన్దార్కళ్. (ఇఱైయవరిత్యాది) జగత్తుక్కు నిర్వాహకరాన ఏకాదశ రుద్రర్కళ్ తఙ్గళుడైయ వాహనఙ్గళాన ఋషభఙ్గళుమ్ తాఙ్గళుమాక వన్దు నిన్ఱార్కళ్. (మరువియ ఇత్యాది) దేవసేనాపతియాన సుబ్రహ్మణ్యన్ తన్ వాహనమాన మయిలుమ్ తానుమాయ్ వన్దు నిన్ఱాన్. (మరుతరు మిత్యాది) దేవతావిశేషమాన మరుద్గణఙ్గళ్ నాఱ్పత్తొన్బతిన్మరుమ్ అష్టవసుక్కళుమ్, ఒరువర్క్కొరువర్ ముఱ్కోలి క్కొణ్డువన్దు తిరణ్డనర్.*

*(పురవియోడిత్యాది) దేవర్కళుడైయ వాహనమాన పురవి పూణ్డ తేరుమ్, పాట్టుక్కళుమ్ ఆట్టముమాయ్, దేవసేనాపతియాన సుబ్రహ్మణ్యనోడే తిరణ్డు, పరిచ్ఛేదిక్కవొణ్ణాతపడి తిరళాయ్క్కొణ్డు మహామేరువై యొత్తిరున్దుళ్ళ కోయిలిల్ తిరుక్కణ్ణోక్కత్తిలే ప్రథమకటాక్షత్తుక్కాక వన్దు నిన్ఱార్కళ్. ప్రయోజనాన్తరపరరోడు అనన్యప్రయోజనరోడు వాశియఱ సర్వనిర్వాహకరాయ్క్కొణ్డు కోయిలిలే కణ్వళర్న్దరుళుకిఱ దేవరీర్ ఉణర్న్దరుళి విశేషకటాక్షమ్ పణ్ణి యరుళవేణు మెన్గిఱార్.*

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్

వ్యాఖ్యానమ్ : ఆఱామ్బాట్టు (ఇరవియరిత్యాది) దేవరీర్ పణిక్కడైత్త ఆదిత్యనేయన్ఱిక్కే, మఱ్ఱుమ్ శోమ్బియిరుక్కిఱ ఆదిత్యర్కళుమ్ వన్దార్కళ్.

(ఇఱైయవరిత్యాది) "పశూనామధిపతిః" ఎన్గిఱపడియే పశుసమరా యిరుప్పార్క్కు నాన్ కడవేనాక వేణుమెన్ఱానితే

(మరువియ మయిలినన్) అవర్కళ్ తేర్కళినిన్ఱుమ్ ఋషభఙ్గళినిన్ఱుమ్ ఇఴిగియవుమ్ కూడుమ్. "ఇవనై మయిలోడేకూడ క్కరుప్పిడిత్తతు" ఎన్నుమ్బడి

యాయిరుక్కై. దేవసేనాపతియిఱే. **(మరుతరుమ్ వశుక్కళుమ్ వన్దు వన్దీణ్డి)** మరుద్దేవతైకళుమ్, అష్టవసుక్కళుమ్ ముఱ్పట్టార్ ముఱ్పట్టపడియే వన్దు తిరణ్డు.

**(పురవియోడిత్యాది)** తేర్ ప్రస్తుతమాకైయాలే తేర్ పూణ్డ పురవి ఎన్నవుమామ్. అన్ఱియే, అవ్వవరేఱి వన్ద వాహనమెన్నవుమామ్.

**(కుమరదణ్డమ్ పుకున్దీణ్డియ వెళ్ళమ్)** "దేవసేనాపతి" ఎన్ఱు మున్నే శొల్లుకైయాలే, "కుమరన్" ఎన్ఱు - అవన్ పేరాయ్, "తణ్డమ్" ఎన్ఱు - దణ్డుక్కు ప్పేరాయ్, ఇత్తాల్ - దేవసేనాసమూహత్తుక్కు ప్పేరాయ్, సేనాపతి వన్దాల్ సేనైయుమ్ వరక్కడవతిఱే. అజ్గనన్ఱియే, దేవజాతియాకైయాలే షోడశవయస్కరా యిరుప్పర్కళిఱే. ఇని "దణ్డమ్" ఎన్గిఱతు- అవ్వవరాయుధభేదజ్గళై ఎన్నవుమామ్.

**(ఈణ్డియ వెళ్ళమ్)** నాల్వరిరువరో ? వెళ్ళమాయన్ఱో కిడక్కిఱతు.

**(అరువరై యిత్యాది)** "అణియినార్ శెమ్బొనాయ అరువరై యనైయ" కోయిలిఱే. ద్వాదశాదిత్యర్కళ్; ఏకాదశరుద్రర్కళ్, దేవసేనాపతియాన సుబ్రహ్మణ్యన్, మరుత్తుక్కళాకిఱ దేవతైకళ్, అష్టవసుక్కళ్, మఱ్ఱుమ్ శొల్లి చ్చొల్లాత దేవతైకళడైయ సపరికరరాయ్, దేవరీర్ తిరుపళ్ళి యుణర్న్దరుళుమ్బోతిల్ ప్రథమకటాక్షత్తై నినైత్తు "నాన్ ముఱ్పడ, నాన్ ముఱ్పడ" ఎన్ఱు ఎల్లారుమ్ తిరణ్డు వన్దునిన్ఱార్కళ్. తిరుప్పళ్ళి యుణర్న్దరుళి కటాక్షిత్తరుళ వేణుమెన్గిఱార్.

*అరు : ఆఱామ్బాట్టు. ఇఱైయవర్ ఎన్బానేన్ ? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్. (పశూనా మిత్యాది), (తణ్డమ్) సమూహమాతల్; ఆయుధమాతల్.*

## భావదీపిక వివరణం

ఆఱవ పాశురం - అవతారిక : "దేవసేనాపతి అయిన షణ్ముఖునితో కలసి లోకాన్ని రక్షించే దేవతలందఱు తమ తమ వాహనాలు మొదలైన పరికరాలతోకూడ తమ మనోరథాలు నెరవేరడంకోసం నిన్ను ఆశ్రయించాలని వచ్చి నిలుచున్నారు. నీవు నిద్రలేచి, వారికి విశేషకటాక్షాన్ని అనుగ్రహించాలి'' -అని అంటున్నారు.

వ్యాఖ్యానమ్ : **(ఇరవియర్ మణినెడుమ్ తేరొడుమ్ ఇవరో)** "కదిరవన్ కుణతిశై చ్చికరమ్ వన్దెడున్దాన్" (తిరుప్పళ్ళి-1) అని నీచే నియమింపబడి ఉదయించి అస్తమించే సూర్యుడు మాత్రమే కాకుండా, తామసం చేసే మిగిలిన ఆదిత్యులు కూడా వచ్చారు. ఇంకా పరుండి ఉండవచ్చునా ? అని భావం.



**(ఇఱైయవర్ పదినొడు విడైయరుమివరో)** - లోకాన్ని నిర్వహించే ఏకాదశరుద్రులు తమ వాహనాలతోకూడా వచ్చి నిలచారు. "విడైయర్" వృషభవాహనుడు- రుద్రుడు.

**(ఇఱైయవర్)** - **"సోஉబ్రవీత్ వరం వృణా అహమేవ పశూనామధిపతి రసానీతి, తస్మాత్ రుద్రః పశూనా మధిపతిః"** (యజు-సంహి-6-2-3) (తానే పశువులవంటి సంసారులకు అధిపతిగా ఉండాలనే వరాన్ని నేను దేవతలైన మీవద్ద కోరుతున్నాను- అని ఆ రుద్రుడు పలికాడు) అనే రీతిలో "తాను పశువులతో సాటి వచ్చేవారికి పతిగా కావాలి'' అని దేవతలవద్ద వరాన్ని వేడాడు కదా రుద్రుడు.

**(మరువియ మయలినన్ అఱుముకనివనో)** - దేవసేనాధిపతి అయిన రుద్రుడు తన వాహనమైన నెమలి, తాను కలసి వచ్చి నిలచాడు. "మరువియ" అని అన్నందువల్ల ఆదిత్యులు తాము రథాలపై నుండి రుద్రుడు వృషభవాహనంపై నుండి దిగినా, షణ్ముఖుడు నెమలిని విడచి కిందకు దిగనందువల్ల 'నెమలితో పాటుగా కలసి జన్మించాడా!'' అని తోస్తున్నది - అనే అర్థస్వారస్యం ఇక్కడ స్ఫురిస్తున్నది.

**(మరుతరుమ్ వశుక్కళుమ్ వన్దు వన్దీణ్డి)** - దేవతలలో ఒక తెగవారైన మరుద్గణాలు **49**మంది, ఎనిమిదిమంది వసువులు ఒకరికంటె ఇంకొకరు ముందు రావాలనే వేగంతో వచ్చి గుమిగూడారు.

**(పురవియోడు ఆడలుమ్ పాడలుమ్ తేరుమ్) - "పురవియోడు తేరుమ్"** అనే ప్రయోగం దేవతలకు వాహనాలైన గుఱ్ఱాలను, రథాలను సూచిస్తున్నదని గ్రహించవచ్చు. లేక, గుఱ్ఱాలను పూన్చిన తేరును సూచిస్తున్నదని కూడా చెప్పవచ్చు. భోగాలను కోరే దేవతలు కనుక ఆడుతూ, పాడుతూ వచ్చి నిలిచారు.

**(కుమరతణ్డమ్ పుకున్దీణ్డియ వెళ్ళమ్) - "అఱుముకన్"** అని (షణ్ముఖుడు) పూర్వపాదంలో ప్రస్తావించినందున **"కుమరన్"** అనే పదం అతనియొక్క నామాంతరమై, **"తణ్డమ్"** అనేది అతని సేనను తెల్పుతున్నదై, దేవసేనాపతి అయిన అతనితోకూడ లెక్కించలేనంత సంఖ్యలో దేవసేనాగణం వచ్చింది- అని భావం. లేక, **"కుమర"** అనే పదం ఎప్పటికీ పదహాఱు సంవత్సరాలను కలవారై ఉండే దేవతలను అందఱిని సూచిస్తున్నదై, **"తణ్డుమ్"** అనే పదం వారి గొప్పగణాన్ని గాని, లేక వేఱ్వేఱు ఆయుధాలనుగాని సూచిస్తున్నదని కూడా చెప్పవచ్చు.

**(ఈణ్డియ వెళ్ళమ్)** - నల్గురు, ఇద్దరా ? కాదుకదా ! లెక్కించలేనంతమంది ప్రవాహం కదా గుమిగూడి ఉన్నారు.

**(అరువరై యనైయ నిన్ కోయిల్)- "అణియినార్ శెమ్బొనాయ అరువరై యనైయ కోయిల్"** (తిరుమాలై-21) (అందమైన, బంగారంతో నిర్మింపబడిన మేరు పర్వతంవంటి కోవెల) అని వీరే (ఈ ఆఴ్వార్లే) తిరుమాలై ప్రబంధంలో అనుగ్రహించిన రీతిలో గొప్ప మేరుపర్వతంవంటి శ్రీరంగదివ్యాలయాన్ని తెల్పుతున్నది, ఈ పదం.

**(కోయిల్మున్నివరో)** ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, దేవసేనాధిపతి షణ్ముఖుడు, మరుద్గణాలనే దేవతలు, ఎనిమిదిమంది వసువులు, వీరి కంటే వేఱయిన పలువురు దేవతలు- అనే అందఱు వాహనాలు మొదలైన తమ పరికరాలతో కూడి నీవు శయనంనుండి నిద్రలేచేటపుడు ప్రథమకటాక్షాన్ని పొందాలి- అని ఆశపడి "నేను ముందు, నేను ముందు'' అనే తొందరతో గుమిగూడి వచ్చి నీ ఆలయం ముందు ఇదుగో నిలుచున్నారు.

**(అరఙ్గత్తమ్మా! పళ్ళి ఎఴున్దరుళాయే)** - ప్రయోజనాంతరాలను (పరమ పురుషార్థంకంటే వేఱయిన క్షుద్రపురుషార్థాన్ని) ఆశించేవారు, అనన్యప్రయోజనులు (నిన్ను తప్ప ఇంకొక పురుషార్థాన్ని కోరనివారు) అనే అందఱికి స్వామివై, కోవెలలో శయనించి ఉండే నీవు శయ్యనుండి లేచి వీరిని గొప్పగా కటాక్షించాలి'' అని అంటున్నారు.

7. అన్దరత్తమరర్కళ్ కూట్టఙ్గళివైయో
 అరున్దవ మునివరుమ్ మరుతరు మివరో
 ఇన్దిరనానైయుమ్ తానుమ్ వన్దివనో
 ఎమ్బెరుమాన్ ఉన కోయిలిన్ వాశల్
 శున్దరర్ నెరుక్క విచ్చాతరర్ నూక్క
 ఇయక్కరుమ్ మయఙ్గినర్ తిరువడి త్తొఴువాన్
 అన్దరమ్ పారిడమిల్లై మఱ్ఱితువో
 అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెఴున్దరుళాయే

ఎమ్ పెరుమాన్ = నాకు స్వామి అయినవాడా !, ఉన్ కోయిలిన్ వాశల్ = నీ కోవెల వాకిటిలో, ఇన్దిరన్ తానుమ్ = దేవేంద్రుడును, ఆనైయుమ్ = అతని వాహనమైన ఐరావతమనే ఏనుగు, వన్దు = వచ్చి (అంతమాత్రమేకాక), అన్దరత్తు అమరర్కళ్ = బ్రహ్మాండతర్వర్తులైన దేవతలు, కూట్టఙ్గళ్ = వీరి పరివారగణాలు, అరు తవమ్ మునివరుమ్ = గొప్ప తాపసులైన సనకాదిమహర్షులు, మరుతరుమ్ = మరుద్గణాలు, ఇయక్కరుమ్ = యక్షులు, కన్దర్ నెరుక్క = గంధర్వులు గుమిగూడగా, విచ్చాతరర్ నూక్క= విద్యాధరులు ఒకరినొకరు గెంటుకోగా, తిరువడి తొఴువాన్ మయఙ్గినార్ = నీ శ్రీచరణాలను సేవించడంకోసం వచ్చి భ్రమించి నిలచారు, అన్దరమ్ = ఆకాశం, పార్ = భూమి, ఇడమ్ ఇల్లై = మధ్యలో ఎక్కడా చోటు లేదు, అరఙ్గత్తమ్మా పళ్ళి ఎఴున్దరుళాయే = శ్రీరంగనాథా ! నీవు శయ్యనుండి నిద్రలేవాలి.

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

అవతారికై : *ఏఴామ్బాట్టు. ముతఱ్పాట్టిల్ సఙ్గ్రహేణ శొన్నతై ఇప్పాట్టు త్తొడఙ్గి మేలిఱ్పాట్టుక్కళాలుమాక విస్తరిక్కిఱార్. కీఴ్ చ్చొన్న దేవతైకళుక్కు నిర్వాహకనాన ఇన్ద్రనుమ్, విద్యాప్రవర్తకరాన సప్తర్షికళుమ్. తిరుప్పళ్ళియెఴుచ్చి తిరువడి త్తొఴ సపరికరరాక ఆకాశావకాశమ్ ఇడమఱ్ఱైయుమ్బడివన్దు పుకున్దార్కళ్. తిరుప్పళ్ళి యుణర్న్దరుళి ఇవర్కళై అడిమై కొణ్డరుళ వేణుమెన్గిఱార్.*

వ్యాఖ్యానమ్ : *(అన్దరమిత్యాది) అభిమానికళాన ఆన్తరజాతికళడైయ తఙ్గళుడైయ పరికరముమ్ తాఙ్గళుమ్ భగ్నాభిమానరాయ్ త్తిరణ్డు వన్దు నిన్ఱార్కళ్. ఇత్తాల్- కీఴ్ చ్చొన్న అధికారికళాన దేవతైకళై యొఴియ అనుక్తమాన దేవతాగణత్తై అరుళిచ్చెయ్కిఱార్.*

*(అరున్దవ మిత్యాది) ఒరుత్తరాలుమ్ శెయ్తు ముడిక్కవొణ్ణాత తపస్సై యుడైయ సనకాదికళుమ్, ఇన్ద్రాదికళుక్కు ప్రత్యాసన్నరాన మరుద్గణఙ్గళుమ్ వన్దు నిన్ఱార్కళ్. (ఇన్దిరనిత్యాది) సర్వాధ్యక్షనాన దేవేన్ద్రన్ తన్ వాహనమాన ఐరావతముమ్ తానుమాయ్ వన్దు నిన్ఱాన్.*

*(ఎమ్బెరుమానిత్యాది) సర్వేశ్వరరాన దేవరీరుడైయ కోయిలిన్ తిరువాశలిల్. (శున్దరర్ నెరుక్క మిత్యాది) గన్ధర్వర్కళ్ నెరుక్క, అవర్కళుడనే విద్యాధరరుమ్ నూక్క, యక్షరుమొన్ఱాక త్తిరుప్పళ్ళి యుణర్న్దరుళుమ్బోతై యఴకు కణ్డు తిరువడి త్తొఴుతు తిరుప్పల్లాణ్డు పాడుకైక్కుణ్డాన ఆశైయాలే ఒరువర్క్కొరువర్ ముఱ్కోలి మేన్మేలెన నెరుక్కుణ్డు మోహియానిన్ఱార్కళ్.*

*(అన్దరమిత్యాది) ఆకాశత్తిలుమ్ భూమియిలుమ్ ఇడమిల్లాత పడియాయ్‌త్తు; ద్వారాధ్యక్షరాలుమ్ నిఱ్ఱై యరితామ్బడి నెరుక్కుప్పడానిన్ఱార్‌కళ్. సర్వస్వామియాన దేవరీర్ ఉణర్‌న్దరుళి అడిమైకొణ్డరుళవేణుమెన్గిఱార్.*

## పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై : ఏఴామ్పాట్టు. (అన్దరమిత్యాది) మున్నిల్ పాట్టిల్- దేవసేనాపతి యానవన్ తన్‌వాహనత్తోడుమ్ పరికరఙ్గళోడుమ్ వన్దమై శొల్లిఱ్ఱు. ఇప్పాట్టిల్- దేవజాతిక్కు నిర్వాహకనాన ఇన్ద్రన్ తన్ వాహనత్తోడే సపరికరనాయ్ వన్దపడి శొల్లుకిఱతు. దేవజాతియైమెయ్ క్కాట్టుక్కొళ్ళ దేవరీరిట్ట వకై శెయ్‌వానాయ్ వన్దానెన్గిఱతు; “భీషాఽస్మాత్” ఇత్యాదిప్పడియే.

వ్యాఖ్యానమ్ : “ఇన్దిరనానైయుమ్ తానుమ్ వన్దివనో” ఎన్గిఱ పదమ్ అర్థక్రమత్తాలే ముతలాకక్కడవతు. ఇప్పడియామో? ఎన్నిల్, ఇప్పాట్టుక్కు తాత్పర్యమ్ ఇన్ద్రన్ వన్దపడి శొల్లుకైయాలే ముతలాకక్కడవతు. “అగ్న్యాహితర్” ఎన్నక్కడవతా యిరుక్కచ్చెయ్‌తే శబ్దశేర్‌త్తి అర్థశేర్‌త్తిక్కాక “ఆహితాగ్నియార్” ఎన్నతిఱే. ప్రణవమ్, శబ్దతః ఆత్మస్వరూపత్తై శొల్లిఱ్ఱేయాకిలుమ్ అర్థతః భగవత్స్వరూపమిఱే శొల్లుకిఱతు; రాజపురుషనెన్ఱాల్, పురుషన్ విశేషణమాయ్ రాజావిన్బక్కలిలే ప్రాధాన్యమ్ కిడక్కుమాపోలే.

(అన్దరత్తమరర్‌కళ్ కూట్టఙ్గళివైయో) అన్దరమెన్ఱుమ్, అణ్డమెన్ఱుమ్, ఆకాశమెన్ఱుమ్ దేవలోకత్తుక్కు ప్పేర్. “కేశవన్‌తమర్” ఎన్గిఱతల్లవే. అవర్‌కళ్ వర్తిక్కిఱ దేశత్తైయిట్టు చ్చొల్లుమిత్తనైయిఱే- దేవర్‌కళై, పన్మై- కూట్టఙ్గళిన్ పన్మై.

(అరున్దవమునివర్) సప్తర్షికళాకవుమామ్. పెఱుతఱ్కరియ తపస్సై ప్పణ్ణి విరోధి నివృత్తిపణ్ణి నినైక్కిఱవర్‌కళెన్నవుమామ్.

(మరుతరుమివరో) మరుద్దేవతైకళ్. “కూట్టఙ్గళ్” ఎన్గిఱత్తై మూన్ఱిడత్తిలుమ్ వైత్తుక్కొళ్ళలామ్.

(ఎమ్బెరుమానున కోయిలిన్ వాశల్) - అణైన్దార్‌కళ్, వన్దార్‌కళ్ ఎన్గిఱవళవల్ల, తిరువాశలిలే వన్దార్‌కళ్; పార్‌త్తరుళీర్. “పిన్నిట్ట శడైయానుమ్ పిరమను మిన్దిరనుమ్ తున్నిట్టు ప్పుకలరియ” ఎన్నక్కడవతిఱే.



(శున్దరర్ నెరుక్క) దేవజాతియిలే ఒరు భేదమ్. శున్దరమెన్ఱు అఴకాయ్, అత్తాలే పాడువారెన్నవుమామ్, శున్దరరెన్ఱు గన్ధర్వర్.

(విచ్చాతరర్ నూక్క) అతిలే మున్ కైవలియారాయిరుప్పార్ శిలర్.

(ఇయక్కరుమ్ మయఙ్గినర్) యక్షరెన్ఱుకొణ్డు మృదుప్రకృతికళా యిరుప్పార్ శిలర్.

(మయఙ్గినర్) నెరుక్కమ్ పొఱుక్కమాట్టా మైయాలే మోహిత్తార్‌కళ్. ఇవర్‌కళ్ ఇఙ్గనే పడవేణుమో? ఎన్ఱాల్,

(తిరువడిత్తొఴు వాన్) దేవరీరై త్తిరువడిత్తొఴుకైయిలుళ్ళ నశై యిరున్దపడి. ఉళ్ నెరుక్కత్తై కణ్డో మెన్ఱాల్, పుఱమ్బుతాన్ నెరుక్కమఱ్ఱిరుక్కిఱతో? ఎన్గిఱార్ మేల్.

(అన్దరమిత్యాది) ఆకాశత్తోడు భూమియోడు వాశియఱ వివరమఱ నెరుఙ్గిఱ్ఱు. తిరుప్పళ్ళి యుణర్‌న్దరుళి క్కటాక్షిత్తరుళీర్ -ఎన్గిఱార్.

*అరు : ఏఴామ్పాట్టు. అర్థమ్ వ్యుత్క్రమమాయిరుక్క, శబ్దమ్ శేర్‌న్ద విడముణ్డో? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (అగ్న్యాహితేత్యాది) శబ్దమొన్ఱాయిరుక్క, అర్థప్రాధాన్యమాక చ్చొన్న విడముణ్డో? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (ప్రణవమిత్యాది) (విచ్చాతరర్) విద్యాధరర్. “అన్దరమ్-పార్-మఱ్ఱు- ఇడమిల్లై” ఎన్ఱన్వయమ్.*

## భావదీపిక వివరణం

ఏడవ పాశురం - అవతారిక : మొదటి పాశురంలో సంగ్రహంగా చెప్పబడిన విషయాన్నే ఈ పాశురంలోను, తరువాతి పాశురంలోను విస్తృతంగా తెలుపుతున్నారు. గత పాశురంలో - దేవసేనాపతి షణ్ముఖుడు తన వాహనంతో, పరివారగణంతో వచ్చాడని తెలుపబడింది. ఈ పాశురంలో - దేవతలు అందఱికి నాయకుడైన ఇంద్రుడు తన వాహనంతో, పరికరాలతో వచ్చిన రీతిని తెలుపు తున్నారు. దేవతలను పాలించడంకోసం నీవు నియమించిన రీతిలో కార్యాలను చేసేవాడైన ఇంద్రుడుకూడా వచ్చాడు- అని తెలుపబడుతున్నది. “భీషాస్మాద్వాతః పవతే భీషోఽదేతి సూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమ ఇతి” (తైత్తి-ఆనంద-8-1) (ఈ పరమాత్మవల్ల గల భయంచేత వాయువు వీస్తున్నది,

ఇతనివల్ల భయంచేత సూర్యుడు ఉదయిస్తున్నాడు, అగ్ని, ఇంద్రుడు, అయిదవ వాడైన మృత్యువు ఇతనివల్ల భయంచేత తమ తమ కార్యాలను చేస్తున్నారు)అని ఇంద్రుడు పరమపురుషుని నియమనంతో కార్యాన్ని చేస్తాడు - అని చెప్పబడుతున్నది కదా!

వ్యాఖ్యానమ్ : అర్థాన్ని గమనించినపుడు, దేవతలకు ప్రభువైన ఇంద్రుని తెలిపే మూడవ పాదాన్ని అతని పరిజనాలైన దేవతలను, ఋషులను తెలిపే మొదటి, రెండవ పాదాలకు ముందుగా అన్వయించి, అర్థాన్ని చెప్పాలి. ఈ రీతిలో అర్థాన్ని చెప్పవచ్చునా? అని అంటే, ఈ పాశురానికి తాత్పర్యార్థం ఇంద్రుని రాకను తెలుపడమే కనుక, మూడవ పాదాన్నే మొదట గ్రహించాలి. అగ్నిలో ఎల్లప్పుడు హోమం చేస్తూ ఉండే బ్రాహ్మణులను **"అగ్న్యాహితులు"** అని చెప్పవలసి ఉన్నా, ముందు వెనుకలుగా మార్చి **"ఆహితాగ్నులు"** అని చెప్పడంవంటిదే. ఇక్కడ పాశురంలోని పాదాలను ముందు వెనుకలుగా అన్వయించే క్రమం. "అకారవాచ్యునకే శేషభూతుడై ఉండేవాడు మకారవాచ్యుడైన జీవుడు'' అనే అర్థాన్ని కల ప్రణవంలోని పదాలను గమనించినపుడు, అది జీవుని తెలుపుతున్నట్లుగా తోచినా, "అకారవాచ్యుడైన పరమపురుషునకే శేషభూతుడు జీవుడు'' అనే అర్థాన్ని గమనిస్తే భగవత్స్వరూపమే అందులో ప్రధానంగా చెప్పబడుతున్నదని తేలుతున్నది కదా ! అదే రీతిలో ఇక్కడ కూడా అర్థానికే ప్రాధాన్యాన్ని గ్రహించాలి.**"రాజపురుషః"** అనే పదాన్ని గమనించినపుడు, పురుషశబ్దం విశేష్యమై, రాజశబ్దం విశేషణమై ఉన్నందువల్ల పురుషునకే ప్రాధాన్యం స్ఫురిస్తుంది. అయితే, "రాజుకు శేషభూతుడైన పురుషుడు'' అని దాని అర్థాన్ని చూచినపుడు పురుషుడు అప్రధానుడుగాను, రాజు ప్రధానుడుగాను వ్యక్తం కావడం ఇక్కడ ఉదాహరణంగా గ్రహించవచ్చు.

**(ఇన్దిరనాన్యైయుమ్ తానుమ్ వన్దివనో)** - "దేవతలకు ప్రభువైన ఇంద్రుడు అతని వాహనమైన ఐరావతమనే ఏనుగుతో వచ్చి ఇడుగో నీముందు నిలచి ఉన్నాడు''- అని భావం.

**(అన్దరత్తు అమరర్కళ్ కూట్టజ్గళ్ ఇవైయో)- "అన్దరమ్, అణ్డమ్, ఆకాశమ్"** అనే శబ్దాలు దేవలోకాన్ని నిర్దేశిస్తాయి. తమను గొప్పవారిగా అభిమానించే **"అన్తర"** జాతికి చెందిన దేవతలందఱు వారి పరివారాలతో పాటు అభిమానాన్ని వీడి, దేవాధిదేవుడవైన నీ కోవెలముందు గుమిగూడి నిలుచున్నారు. ముందు పాశురంలో



అధికారులైన దేవతలు చెప్పబడ్డారు. ఇక్కడ మిగిలిన దేవతలు చెప్పబడుతున్నారు. స్వరూపానికి తగిన స్వామిత్వం ఉంటే **"కేశవర్తమర్"** అని భాగవతులను (భక్తులను) తెలిపేట్లే, వీరిని కూడా ఇంద్రుని భక్తులు (ఇంద్రునకు చెందినవాడు) అని చెప్పవచ్చు. ఇక్కడ ఆవిధంగా కాకుండా, **"అన్దరత్తమరర్కళ్"** అని అంటూ వారి నివసించే చోటును పురస్కరించుకొని నిర్దేశింపబడుతున్నారు. **"కూట్టజ్గళ్"** అని పలు సమూహాలు ఉన్నాయని తెలుపబడడంచేత ముందు చెప్పబడ్డ ఒక్కొక్క అధికారికి లోబడినవారు పలువురు ఉన్నారు- అని తోస్తున్నది.

**(అరున్దవ మునివర్)** - ఈ పదం ఇంద్రునకు అధీనులైన సప్తర్షులను తెలుతున్నట్లుకూడా భావించవచ్చు. ఎవరికి సాధ్యం కాని తపస్సును చేసి, తమ ఇంద్రియాలను నియంత్రించుకొనే సనకసనందనాదులను తెలుపుతున్నదని కూడా చెప్పవచ్చు.

**(మరుతరుమివరో)** - ఇంద్రునకు దగ్గరివారైన మరుత్తులు అనబడే దేవతలు. ముందు పాశురంలో **"మరుతర్"** అని తెలుపబడినవారికి లోబడి ఉండేవారు తెలుపబడినట్లుగాకూడా చెప్పవచ్చు. **"కూట్టజ్గళ్"** అనే పదాన్ని **"అన్దరత్తమరర్కళ్, అరున్దవ మునివర్; మరుతర్"** అనే మూడు చోట్ల అన్వయించి, అర్థాన్ని చెప్పాలి.

**(ఎమ్బెరుమాన్ ఉన్ కోయిలిన్ వాశల్) - "అమరర్కళ్ పుకున్దనర్" (5)** అనే పాశురంలో చెప్పిన రీతిలో దగ్గరకు రావడం మాత్రమే కాదు, నీ కోవెల వాకిటి ముందుకు వచ్చారు; వారిని కటాక్షించాలి'' అని భావం.

**(ఉన్ కోయిలిన్ వాశల్) -"పిన్నిట్ట శడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్, తున్నిట్టు పుకలరియ వైకున్దనీళ్వాశల్"** (పెరుమాళ్ తిరు-4-3) (పేనిన జటలను కల రుద్రుడు, బ్రహ్మ, ఇంద్రుడు ఒకరిని ఇంకొకరు తోసికొంటూ ప్రవేశించడానికి వీలుకాని వైకుంఠంలోని విశాలమైన వాకిలి) అని చెప్పబడినట్లుగా భూలోక వైకుంఠమైన శ్రీరంగదివ్యాలయం వాకిలి అయినది- అని భావం.

**(కన్దరమ్ నెరుక్క)**- దేవతలలో ఒక వర్గానికి చెందిన గంధర్వులు మిగిలిన వారితో సమ్మర్దాన్ని పొందుతున్నారు. **"కన్దరమ్"** అనే పదం అందంగా పాడేవారిని తెల్పుతుంది. లేక, **"కన్దరర్"** అనేది అందమైన రూపాన్ని కల గంధర్వులను తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు.

**(విచ్చాదరర్ నూక్క)** - ముంజేతి బలిమిని కల విద్యాధరులు మిగిలినవారిని గెంటుకొంటూ వస్తున్నారు.

**(ఇయక్కరుమ్ మయఙ్గినర్)** - సౌకుమార్యాన్ని కల్గినవారైన యక్షులు ఆ సమ్మర్దాన్ని భరించలేక, మోహాన్ని పొందారు. **"మయఙ్గినర్"** అనే పదానికి "కలసిపోయారు'' అనే అర్థాన్ని గ్రహించి, "యక్షులుకూడా వారితో ఒకటిగా కలసిపోయారు.'' అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఈ రీతిలో వీరు ఇంతటి పాట్లు పడడానికి ఏమి కారణం ? అని అంటే,

**(తిరువడి త్తొఴువాన్)** - నీ శ్రీచరణాలను సేవించడంలో ఉండే అభిలాషవల్ల ఇన్ని పాట్లు పడ్డారు. శయ్యనుండి నిద్ర లేచేటపుడు ఉండే అందాన్ని మొదటగా దర్శించి, ప్రథమకటాక్షానికి లక్ష్యం కావాలి- అనే ఆశతో ఇంతటి పాట్లను పడ్డారు- అని కూడా చెప్పవచ్చు. ఈ విధమైన సమ్మర్దం లోపల మాత్రమే కాదు, బయట కూడా ఈ విధమైన సమ్మర్దం ఉన్నది- అని అంటున్నారు, ఇకపై.

**(అన్దరమ్ పారిడమ్ ఇల్లై మఱ్ఱితువో)** - "ఆకాశంతో, భూమితో, తేడా లేకుండా మధ్యలో అంతరం అనేది లేని రీతిలో సమ్మర్దాన్ని పొందుతున్నారు'' అని నంజీయర్ వ్యాఖ్య.

**(అరఙ్గత్తమ్మా ! పళ్ళి ఎఴున్దరుళాయే)** - అందఱికి స్వామివి అయిన నీవు నిద్ర లేచి, కటాక్షించి, మేము చేసే కైంకర్యాలను గ్రహించాలి.

**8.** నమ్బువిఴ్ వానవర్ వాయుఱై వఴఙ్గ
మానితి కపిలై యొణ్కణ్ణాడి ముతలా
ఎమ్బెరుమాన్ పడిమైక్కలమ్ కాణ్డఱ్కు
ఏఱ్పనవాయిన కొణ్డు నన్మునివర్
తుమ్బురు నారదర్ పుకున్దనరివరో
తోన్ఱిన నిరవియుమ తులఙ్గొళి పరప్పి
అమ్బరతలత్తిల్ నిన్ఱకల్కిన్ఱతిరుళ్ పోయ్
అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెఴున్దరుళాయే.

వఴఙ్గ = (నీకు) సమర్పించడంకోసం, వాయుఱై = గడ్డిపోచను, మా = గొప్ప, నిది = శంఖనిధి పద్మ నిధులను (చేతిలో కలవారై), వమ్బు అవిఴ్ = గొప్ప సువాసనను మిక్కిలిగా కల, వానవర్ = దేవతలు, కపిలై = కామధేనువు, ఒణ్ = కాంతి కల, కణ్ణాడి ముదలా = అద్దం మొదలుగా, ఎమ్బెరుమాన్ = స్వామివి అయిన నీవు, కాణ్డఱ్కు = చూడడంకోసం, ఏఱ్పన ఆయిన = తగినవిగా ఉన్న, పడిమైక్కలమ్ కొణ్డు = ఉపకరణాలను అన్నిటిని గ్రహించి, నల్ మునివర్ = గొప్ప ఋషులు, తుమ్బురు నారదర్ = తుమ్బురుడు, నారదుడు, పుకున్దనర్ = వచ్చి నిలచారు, (ఇంతేకాక) ఇరవియుమ్ = సూర్యుడు కూడా, తులఙ్గు ఒళి = (తన) గొప్ప తేజస్సును, పరప్పి = అంతటా వ్యాపింపజేసి, తోన్ఱినన్ = ఉదయించాడు, ఇరుళ్ = చీకటి, అమ్బరతలత్తిల్ నిన్ఱు = ఆకాశంనుండి, పోయ్ అకల్కిన్ఱతు = పోయి తొలగిపోతున్నది, అరఙ్గత్తమ్మా పళ్ళి ఎఴున్దరుళాయే = శ్రీరంగనాథా ! నీవు శయ్యనుండి నిద్రలేవాలి.

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

*అవతారికై : ఎట్టామ్పాట్టు. దేవరీర్ తిరువారాధనత్తుక్కు అనురూపమాన ప్రాతఃకాలమానతు సన్నిహితమాయ్త్తు. ఆరాధనాఙ్గమాయ్ క్కణ్డరుళుకైక్కు సదృశమాన ఉపకరణఙ్గళ్ కొణ్డు అనన్యప్రయోజనరాన ఋషికళ్ వన్దు నిన్ఱార్కళ్. తిరుప్పళ్ళి యుణర్న్దరుళి అవఱ్ఱై క్కణ్డరుళ వేణుమెన్గిఱార్.*

*వ్యాఖ్యానమ్ : (వమ్బవిఴిత్యాది) పరిమళితమాన స్వర్గత్తిలే వర్తిక్కక్కడవ దేవర్కళ్, గోగ్రాసఙ్గళుమ్ కొణ్డువన్దు నిన్ఱార్కళ్. (మానితి యిత్యాది) శఙ్ఖనిధి పద్మనిధికళుమ్, కపిలాసురభికళుమ్, తిరుక్కణ్ణాడి ముతలాక సర్వస్వామియాన దేవరీర్ కణ్డరుళుకైక్కు సదృశమాన ఉపకరణఙ్గళడైయ క్కొణ్డు అనన్య ప్రయోజనరాన ఋషికళ్ వన్దు అవసరప్రతీక్షనాయ్ నిన్ఱార్కళ్.*

*(తుమ్బురునారదర్ పుకున్దవరివరో) - మఙ్గళగీతఙ్గళ్ పాడుకైక్కు తుమ్బురునారదర్కళుమ్ వన్దు నిన్ఱార్కళ్. (తోన్ఱిన నిరవియు మిత్యాది) మిక్క తేజస్సైయుడైయ ఆదిత్యనుమ్ తన్ తేజస్సై ప్పరప్పికొణ్డు వన్దు తోన్ఱినాన్. (అమ్బరమిత్యాది) ఆకాశత్తినిన్ఱుమ్ ఇరుళ్ పోయిఱ్ఱు. బాహ్యమాన అన్ధకారమిత్తే, అవనాల్ పోక్కలావతు. సర్వరక్షకరాన దేవరీర్ ఆన్తరమాన అన్ధకారత్తై ప్పోక్క త్తిరుప్పళ్ళి యుణర్న్దరుళ వేణుమెన్గిఱార్.*

## పెరియవాచ్చాన్బిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై : ఎట్టామ్బాట్టు (వమ్బువిఴిత్యాది) మున్నిల్ పాట్టిల్ - ఇన్ద్రన్ సపరికరనాయ్ వన్దపడి శొల్లిన్ఱు; ఇప్పాట్టిల్ - తిరుప్పళ్ళియుణర్ణ్దరుళినాల్ కణ్డరుళక్కడవ ఉపకరణఙ్గళై మఙ్గళార్థమాక అవరవర్కళ్ కొణ్డువన్దు నిన్ఱార్కళ్- ఎన్గిఱతు.

వ్యాఖ్యానమ్ : (వమ్బువిఴ్ వానవర్ వాయుఱై వఴఙ్గ) వానవర్ దేవజాతి.

(వమ్బువిఴ్ వానవర్) నిత్యయౌవనత్తై యుడైయవర్కళ్ - ఎన్నుతల్; సౌగన్ధ్యత్తై యుడైయవర్కళ్; తన్దామ్ పదఙ్గళుక్కు త్తక్క పూమలర్కళై యుడైయవర్కళ్- ఎన్నుతల్.

(వాయుఱై వఴఙ్గ) "వాయుఱై వఴఙ్గ" ఎన్ఱదై మెలిత్తు, "వాయుఱై వఴక్కమ్" ఎన్ఱాక్కి అవర్కళుడైయ నియమప్రకారత్తై నినైక్కిఱతు. "వాయుఱై" ఎన్ఱతు- అఱుకమ్బుల్. "వమ్బువిఴ్" ఎన్ఱతు- సశ్రద్ధమాయిరుక్కై.

(మానితి) "నితి" ఎన్ఱు- శఙ్ఖనిధిపద్మనిధియాకవుమామ్. నితియెన్ఱు- నవరత్నాదికళాకవుమామ్. మానితి యెన్ఱు- మహార్ఘమెన్ఱపడి. నిత్యదానత్తుక్కు ధనరాశికళై చ్చొల్లిన్ఱాకవుమామ్.

(కపిలై) పశుక్కళ్ వరక్కడవతిఱే వఴక్కత్తుక్కుఱుప్పాక. వాయుఱై, మానితి, కపిలై, మన్ఱుమ్ శొల్లిచ్చొల్లాత ఉపకరణఙ్గళెల్లామ్ వన్దన. కణ్డరుళు కైక్కుఱుప్పాక తిరుక్కణ్ణాడి తొడక్కమానవై ఎల్లామ్ వన్దన.

(ఏఴ్పన వాయిన కొణ్డు) దేవరీరుక్కు సదృశమానవై- అనురూపమానవై కొణ్డు.

(నన్మునివర్) అత్తలైక్కు ప్పాఙ్గానవన్ఱైయే మననమ్ పణ్ణుమవర్కళ్.

(తుమ్బురు నారతర్ పుకున్దనరివరో) పెరుమాళ్ పళ్ళికొణ్డరుళిన పిన్బు ఇశై కేట్టరుళుమాపోలే;

(తోన్ఱిన నిరవియుమ్ తులఙ్గొళి పరప్పి) అవ్వో పణిక్కు క్కడవార్కళ్ ఎడుత్తువన్దార్కళ్; ఇవన్ఱై క్కణ్డరుళ వేణుమెన్ఱు కాట్టువారైప్పోలే, సహస్రకిరణ మాకిఱ పన్దత్తై క్కొణ్డు ఆదిత్యనుమ్ వన్దాన్.



(అమ్బరతలత్తిలిత్యాది) ఇరుళానతు ఒరు పయణమెఴ వాఙ్గిన్ఱు- ఎన్ఱాప్పోలేయిఱే మున్బు శొల్లిన్ఱు. అవ్వళవల్ల; ఆకాశత్తిలుమ్ సఞ్చరిక్క వొణ్ణాతపడి నిరస్తమానపడి శొల్లుకిఱతు. బాహ్యమాన ఇరుళానతు నిరస్తమానాల్, ఆన్తరమాన ఇరుళైప్పోక్కి యరుళవేణ్డావో! దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళి అమలఙ్గళాక విఴిత్తరుళీర్ -ఎన్గిఱార్.

*అరు : ఎట్టామ్బాట్టు-వమ్బెన్ఱు- పుతితాయ్, యౌవనమాతల్, పరిమళమాతల్, (నియమప్రకారమ్) ఉద్దేశ్యవిషయత్తై క్కిట్టుమ్బోతు కైయుమ్ అఱుకమ్ పుల్లుమాక క్కిట్టవేణుమెన్గిఱ నియతి. (వమ్బువిఴ్) వాయుఱైక్కు విశేషణమాకవుమామ్. (వఴక్కత్తుక్కు) దానత్తిఱ్కుఱుప్పాక. ఎమ్బెరుమాన్ కాణ్డఱ్కు పడిమై క్కలమావతు- మున్ఱుముణ్డాన ఉపకరణ పదార్థమ్. (ఇశై కేట్టరుళుకై) తాలాట్టు క్కేట్టు ఉకక్కుమాపోలే, ఉణర్న్దరుళుమ్బోతుమ్ పాట్టు క్కేట్క్కైక్కాక ప్పాడవన్దార్కళ్ -ఎన్ఱపడి.*

## భావదీపిక వివరణం

ఎనిమిదవ పాశురం - అవతారిక : గడచిన పాశురంలో - ఇంద్రుడు తన పరిజనాలతో వచ్చిన రీతిని తెలిపారు. ఇందులో - "తిరువారాధనకు తగిన ఉదయవేళ వచ్చినందువల్ల, తిరువారాధనకు అంగమైన ఉపకణాలను ప్రయోజనాంతర పరులు కాని ఋషులు, దేవతలు మంగళార్థంగా తీసికొని వచ్చి నిలిచారు' - అని అంటున్నారు.

వ్యాఖ్యానమ్ : (వమ్బువిఴ్ వానవర్ వాయుఱై వఴఙ్గ) - సువాసనను మెండుగా కల్గిన దేవతలు నీకు సమర్పించడం కోసం గరిక పోచను తీసికొని వచ్చారు. "వమ్బు" అనే పదం పరిమళాన్ని తెల్పుతుంది. లేక, అభినవత్వాన్ని తెల్పుతున్నదనికూడా చెప్పవచ్చు. సదా లేతవయస్సుతో ఉండే దేవతలని అర్థం. లేక, పూవులను ఈ పదం తెల్పుతున్నదనికూడా చెప్పవచ్చు. అపుడు, తమ పదవులకు తగినట్లుగా పారిజాతాదిపుష్పాలను చేతిలో కలవారని భావం.

(వాయుఱై వఴఙ్గ) - అనే పాఠమైతే అందులోని "వఴక్క" అనే వల్లొత్తును కల పదాన్ని "వఴఙ్గ" అని మెల్ ఒత్తును కల పదంగా స్వీకరించి, పూర్వంవలె అర్థాన్ని చెప్పాలి. "చక్రవర్తిని దర్శించాలని వచ్చేటపుడు రిక్తహస్తాలతో పోకూడదు'' అనే నియమాన్నిబట్టి వారి పశువులకు ఆహారంగా గరికపోచను తీసికొని వస్తున్నారు- అని భావం. "వమ్బువిఴ్" అనే పదాన్ని "వాయుఱై" అనే పదానికి విశేషణంగా

కూడా చేయవచ్చు. గరికపోచను తీసికొని వచ్చేటపుడు శ్రద్ధతో, సువాసన నిండుగా ఉండే, లేక, నూతనమైన గరికపోచను తీసికొని వస్తున్నారని భావం.

**(మానితి)** గొప్ప నిధులైన నవరత్నాలు మొదలైనవానిని తీసికొని వస్తున్నారు. **"నిధి"** అని శంఖనిధి, పద్మనిధి అనే దేవలోకంలోని నిధులను తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు. **"మానితి"** అనేది అమూల్యాలనే అర్థాన్ని తెల్పుతున్నది. భగవానుడు ప్రతిదినం తన భక్తులకు అనుగ్రహించడం గొప్ప ఐశ్వర్యాలైన ధనం, ధాన్యం మొదలైనవానిని తీసికొనివస్తున్నారనికూడా చెప్పవచ్చు. **"మానితి"** ని దేవతలు తీసికొని వచ్చే వస్తువులలో చేర్చకుండా, పైన చెప్పబడే మునులు తీసికొని వచ్చే వస్తువులలో చేర్చి నంజీయర్ వ్యాఖ్యానించారు.

**(కపిలై)** - రాజులను చూడడానికి వచ్చేవారు దానానికి ఉపయోగపడేటట్లు పశువులను తీసికొని రావడం సహజంకదా ! పాశురప్రారంభంనుండి **"ఏఴ్పనవాయిన"** అనే పర్యంతం కపిల అనే గోవు, దానికి ఆహారంగా పెట్టదగిన గరికపోచ గడ్డి, మహానిధులు, మిగిలిన పలు ఉపకరణాలు, భగవానుడు కటాక్షించడంకోసం తగిన అద్దం మొదలైనవి వచ్చాయి- అని అంటున్నారు. **"పడిమై క్కలమ్"** అంటే -మిగిలిన ఉపకరణాలు.

**(ఏఴ్పన వాయిన కొణ్డు)** - నీ గొప్పతనానికి తగినవై ఉండేవానిని తీసికొని,

**(నన్మునివర్)** - భగవానునకు ఏది అభిమతం- అనేదానినే భావించే మునులు. "వేఱు ప్రయోజనాన్ని భావించని ఋషులు" అని నంజీయర్ వ్యాఖ్య.

**(తుమ్బురు నారదర్ పుకున్దనర్ ఇవరో)** - భగవానుడు శయనించి ఉండేటపుడు జోలపాటలను **(తాలాట్టు)** విని ఆనందించేటట్లే, నిద్రనుండి లేచేటపుడు మంగళగీతాలను విని ఆనందింపజేయడానికి తుంబురుడు, నారదుడు వచ్చి నిలచి ఉన్నారు.

**(తోన్ఱిన నిరవియుమ్ తులఙ్గొళి పరప్పి)** - "ఆయా కైంకర్యాలను చేయాలని వచ్చినవారు వాటికి తగిన ఆయా ఉపకరణాలను తీసికొనివచ్చారు. వాటిని కటాక్షించాలి" అంటూ దివ్విటీని ఎత్తి చూపించేవారివలె సూర్యుడు కూడా తన వేయి కిరణాలనే దివ్విటీని ఎత్తి చూపుతూ ఈ కైంకర్యాలను చేసేవారిని చూపించడం కోసం వచ్చాడు.



**(అమ్బరతలత్తిల్ నిన్ఱు అకల్కిన్ఱదు ఇరుళ్ పోయ్)** - గడచిన పాశురాలలో "చీకటి తొలగిపోవడం ఆరంభమైనది" అని చెప్పబడింది. అంతటితో ఆగకుండా ఆకాశంలో సంచరించడానికి వీలుకానట్లుగా చీకటి అంతా పూర్తిగా తొలగిపోయిన విషయం ఇక్కడ చెప్పబడింది.

**(అరఙ్గత్తమ్మా ! పళ్ళి ఎఴున్దరుళాయే)** - బాహ్యాంధకారం పూర్తిగా తొలగిన తరువాత నీవు నిద్రలేచి, కటాక్షించి, ఆంతరమైన అంధకారాన్ని పోగొట్టవద్దా! - అని అంటున్నారు. **"అమలఙ్గళాక విఴిక్కుమ్"** (తిరువాయ్-1-9-9) (పవిత్రం అయేట్లు కటాక్షిస్తాడు) అనే రీతిలో దిక్కులలో ఉండే మలినాలన్నీ తొలగిపోయేటట్లు నీవు శయ్యనుండి నిద్ర లేచి కటాక్షించాలి- అని అంటున్నారు.

**9)** **ఏతమిల్ తణ్ణుమై యెక్కమ్ మత్తళి**
**యాఴ్కుఴల్ ముఴవమోడు ఇశైతిశై కెఴుమి**
**కీతఙ్గళ్ పాడినర్ కిన్నరర్ కరుడర్కళ్**
**కన్దరువరుమివర్ కఙ్గులు ళెల్లామ్**
**మాతవర్ వానవర్ శారణర్ ఇయక్కర్**
**శిత్తరుమ్ మయఙ్గినర్ తిరువడిత్తొఴువాన్**
**అతలిల్ అవర్క్కు నాళోలక్క మరుళ**
**అరఙ్గత్తమ్మా ! పళ్ళి యెఴున్దరుళాయే ॥**

ఏదమ్ ఇల్ = ఏదోషం లేని, తణ్ణుమై = చిన్న డప్పు, ఎక్కమ్ = ఒకే తంత్రిని కల వాద్యం, మత్తళి = మద్దెల, యాఴ్ =వీణను, కుఴల్ = పిల్లనగ్రోవి- అంతా, తిశై = దిక్కులన్నిటిలో, ముఴవమోడు = వీటి ధ్వనులతో, ఇశై కెఴుమి కీతఙ్గళ్ పాడినర్ = రాగాలు నిండేటట్లుగా పాటలను పాడేవారైన, కిన్నరర్ = కిన్నరులు, కెరుడర్ = గరుడులు, కన్దరువర్ అవర్ = అదిగో నిలచి ఉండే గంధర్వులు, కఙ్గులుళ్ ఎల్లామ్ = రాత్రి అంతా, మాతవర్ = గొప్ప ఋషులు, వానవర్ =దేవతలు, శారణర్ = చారణులు, ఇయక్కర్ = యక్షులు, శిత్తరుమ్ = సిద్ధులు, తిరువడి తొఴువాన్ = నీశ్రీచరణాలో నమస్కరించడంకోసం వచ్చి, మయఙ్గినర్ = (ఒకరితో ఇంకొకరికి కల్గిన) మోహాన్ని పొందారు, ఆతలిల్ = అందువల్ల, అవర్క్కు = వారికి, నాళ్ ఓలక్కమ్ అరుళ = పగటి సభను అనుగ్రహించడంకోసం, అరఙ్గత్తమ్మా పళ్ళి ఎఴున్దరుళాయే = శ్రీరంగనాథా నిద్రనుండి లే.

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

*అవతారికై : ఒన్బతామ్బాట్టు. తిరుప్పళ్ళి యుణర్న్దరుళుమ్బోతై యఴకు కణ్డు తిరువడి త్తొఴవుమ్, అఴకోలక్క మిరుక్కుమ్బడి కణ్డు అడిమై శెయ్యవుమ్ వేణుమెన్ఱు. తన్దాముడైయ పరికరమాన మఙ్గళవాద్యఙ్గళుమ్ వీణైకళుమాయ్ ఉకళిత్తుక్కొణ్డు యక్షగన్ధర్వాదికళ్ వన్దు నిన్ఱార్కళ్. అడియేనుక్కాక త్తిరుప్పళ్ళి యుణర్న్దరుళి అడిమై కొణ్డరుళవేణుమెన్గిఱార్.*

*వ్యాఖ్యానమ్ : ఒన్బతామ్బాట్టు. (ఏతమిలిత్యాది) నిర్దోషమాన మఙ్గళవాద్య విశేషఙ్గళుమ్. ఏకతన్త్రీ-ఎక్కమ్; మత్తళి ఎన్నవుమామ్. ఒరు పఱైవిశేషమ్, యాఴ్ విశేషఙ్గళుమ్, కుఴల్ విశేషఙ్గళుమాయ్, దిక్కుక్కళెఙ్గుమ్ ముఴఙ్గిక్కొణ్డు మఙ్గళమానగీతఙ్గళ్ పాడక్కడవరాన కిన్నరాదికళుమ్, గన్ధర్వర్కళుమ్, మహాతపస్సై యుడైయ ఋషికళుమ్, అనుక్తరాన దేవర్కళుమ్, చారణయక్షసిద్ధర్కళుమడైయ పుకున్దు తిరువడి త్తొఴుకైయిలుణ్డాన త్వరైయాలే నెరుక్కా నిన్ఱార్కళ్. సర్వరక్షకరాన దేవరీర్ ఉణర్న్దరుళి అఴకోలక్కమాక ఇరున్దు అడిమైకొణ్డరుళవేణు మెన్గిఱార్.*

### పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై: ఒన్బతామ్బాట్టు. (ఏతమిలిత్యాది) మున్నిఱ్పాట్టిల్ - నిత్యదానత్తుక్కుఉప్పానవైయుమ్, మఱ్ఱుమ్ కణ్డరుళక్కడవనవుమ్ వన్దన ఎన్ఱతు. ఇప్పాట్టిల్- దేవరీర్ తిరుప్పళ్ళియెఴుచ్చిక్కు నృత్తవాద్యగీతఙ్గళుక్కు క్కడవరానవర్కళ్ వన్దార్కళెన్గిఱతు.

వ్యాఖ్యానమ్ : (ఏతమిల్ తణ్ణుమై) - ఏతమెన్ఱు -కుఱ్ఱమ్, ఇల్లెన్ఱు-ఇల్లామై. కుఱ్ఱమఱ్ఱ వాద్యమెన్గిఱతు. తణ్ణుమై యెన్ఱతు - శిఱు పఱై. ఒరుతలైప్పఱై. ఎక్కమ్ - తాళమ్. ఏకతంత్రి ఎన్నవుమామ్. మత్తళి-శిఱు మత్తళి. యాఴెన్ఱు- ఇశైక్కుమున్ ఓట్టుక్కొళ్ళదొన్ఱు. కుఴలెన్ఱు - జాత్యేకవచనమ్.

(ముఴవమ్) -పెరువాయన్. పెరుమత్తళి- ఎన్ఱుమామ్. ఇవఱ్ఱిలుణ్డాన నాదమానతు. దిక్కుక్కళ్ తోఱుమ్ కెఴుమిఱ్ఱు; నిఱైన్దతు. ఏతమిల్ - తణ్ణుమై, ఏతమిల్ ఎక్కమెన్ఱు- ఎల్లావఱ్ఱిలుమ్ వైత్తు చ్చొల్లలామ్.

(కీతఙ్గళ్ పాడినర్ కిన్నరర్ కరుడర్కళ్) ఎల్లారుమ్ విడివోడే వరువారుమ్, విడిన్దు వరువారుమిఱే. ఇవర్కళై త్తిరువుళ్ళమ్బఱ్ఱి యరుళవేణుమ్



(కిన్నరర్ కరుడరిత్యాది) మఙ్గళగానమ్ పాడువార్. అతిల్ తలైవరాన గన్ధర్వర్కళ్ ఉళ్ళిట్టవర్కళై ప్పార్త్తరుళీర్.

(కఙ్గులుమెల్లామ్) రాత్రి యెల్లామ్

(మాతవర్) మహాతపస్సైయుడైయ ఋషికళ్.

(వానవర్) వైమానికరాన దేవర్కళ్.

(శారణర్) దేవజాతితన్నిలే ఉలావి త్తిరియుమవర్కళ్.

(ఇయక్కర్) యక్షరెన్ఱు దేవజాతియిలే శిలర్.

(శిత్తర్) సిద్ధర్కళ్.

(శిత్తరుమ్ మయఙ్గినర్ తిరువడిత్తొఴువాన్) వైమానికరాన దేవజాతియోడు, పెరియతపస్సుక్కళై ప్పణ్ణిన మతిప్పరాన ఋషికళోడు, యక్షసిద్ధచారణర్ ఎన్గిఱ దేవర్కళోడు, కిన్నరర్ గరుడర్కళ్ ఎన్గిఱ మఙ్గళగానమ్ పాడుమవరోడు, ఇవర్కళిలే తలైవరాన గన్ధర్వరోడు వాశియఱ, శిఱియార్ పెరియార్ ఎన్నాతే దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళుమ్బోతిల్ ప్రథమకటాక్షత్తై నినైత్తు ఒరువర్ క్కొరువర్ ముఱ్కోలి నెరుక్కుణ్డానిన్ఱార్కళ్. మఙ్గళవాద్యఙ్గళ్, కుఴల్కళ్- ఇవైకొణ్డు అడివ్మై శెయ్యుమవర్కళుమ్ తిరుప్పళ్ళియెఴుచ్చిక్కు ఉతవ వన్దార్కళ్.

(ఆతలిలిత్యాది) "నన్మణివణ్ణనూర్" ఎన్గిఱపడియే తిరుప్పళ్ళియుణర్న్దరుళి ఎల్లారుమ్ వాఴుమ్బడి కటాక్షిత్తరుళ వేణుమెన్గిఱార్.

*అరు : ఒన్బతామ్బాట్టు. (ఏతమిత్యాది) (మయఙ్గినర్) నెరుక్కుణ్డు మోహియా నిన్ఱార్కళ్. (నన్మణి వణ్ణనూరెన్ఱతు) తిరువేఙ్గడముడైయాన్ నానాజాతికళైయుమ్ కటాక్షిక్కుమాపోలే దేవరీరుమ్ కటాక్షిత్తరుళవేణుమ్.*

## భావదీపిక వివరణం

తొమ్మిదవ పాశురం - అవతారిక : గడచిన పాశురంలో తొమ్మిదవ పాశురం భగవానుడు ప్రతిదినం దానం చేయడానికి ఉపయోగించే వస్తువులు, ఇంకా కటాక్షించదగిన అద్దం మొదలైన ఉపకరణాలు తీసికొని రాబడ్డాయి - అని

చెప్పబడింది. ఇందులో- "నీవు నిద్రనుండి లేచేటపుడు నీ అందాన్ని చూచి, నీ శ్రీచరణాలకు నమస్కరించడంకోసం, మండపాలలో వేంచేసి ఉండేటపుడు దర్శించి, కైంకర్యాన్ని చేయడంకోసం తమ తమ సాధనాలైన మంగళవాద్యాలను, వీణలను ఆనందంగా తీసికొని, యక్షులు, గంధర్వులు మొదలైనవారు వచ్చి నిలచారు. వారికోసం, దాసుడనైన నాకోసం మేల్కొని కటాక్షించాలి''- అని అంటున్నారు.

వ్యాఖ్యానమ్ : **(ఏదమిల్ తణ్ణుమై)** దోషం లేని చిన్నడప్పు, మొదలైన వాద్యాలు. **"ఏద"** మనే శబ్దం దోషాన్ని తెలుపుతుంది. అందువల్ల **"ఏదమిల్"** అంటే దోషం లేని - అని అర్థం. ఈ దోషరాహిత్యం (**"ఏదమిల్"** అనే విశేషణం) పైన నిర్దేశింపబడే వాద్యాలకు అన్నిటికి విశేషణం. **"తణ్ణుమై"** అంటే చిన్న డప్పు. లేక, ఒకే వైపు వాయించడానికి వీలున్న డప్పును తెల్పుతుంది. **"ఎక్కమ్"** అనేది ఒకే తీగను కల్గినదైన వాద్యవిశేషం. లేక, తాళాన్ని సూచిస్తున్నదని కూడా చెప్పవచ్చు. **"మత్తళి"** అంటే రెండు వైపుల వాయించగల్గిన, తోలుతో చేయబడిన వాద్యం. (మద్దెల) **"యాழ்"** అంటే -ఒక విధమైన వీణ. ఇది రాగానికి ముందు (ఆలాపనలో) వాయించబడేది. **"కుழల్"** అంటే -పిల్లనగ్రోవి. ఇక్కడ **"కుழల్"** ఇత్యాది వాద్యాలను తెలిపే పదాలలోని ఏకవచనాన్ని జాత్యేకవచనంగా గ్రహించాలి. అందువల్ల బహుత్వం ఉపలక్షితం.

**(ముழవమ్)** -పెద్ద మద్దెల. "పెరువాయన్" అనే పెద్ద నోటిని కల కాహళం. ముందు తెలుపబడ్డ వాద్యాల ధ్వనులను సూచిస్తున్నదని కూడా చెప్పవచ్చు.

**(ఇశైతిశై కెழுమి)**- వీటివల్ల పుట్టే ధ్వని అన్ని దిక్కులలో నిండింది.

**(కీతజ్గళ్ పాడినర్ కిన్నరర్ కెరుడర్కళ్)** - మంగళాశాసనాన్ని చేసేవారైన కిన్నరజాతికి చెందినవారు, గరుడజాతికి చెందినవారు, గానాన్ని పాడారు. కొందరు ప్రాతఃకాలంలో వచ్చేవారు. కొందఱు పొద్దుపొడిచిన తరువాత వచ్చేవారు.

**(కిన్నరర్ కెరుడర్కళ్ కన్దరువర్ అవర్)**- మంగళాశాసనం చేసేవారిలో చాలా గొప్పవారైన గంధర్వులు మొదలైన వీరందఱిని కటాక్షించాలి.

**(కజ్గులుళెల్లామ్)** - రాత్రి అంతా

**(మాతవర్)** - గొప్ప తపస్సును చేసిన మహర్షులు



**(వానవర్)** - విమానాలలో ఆకాశంలో సంచరించే దేవతలు.

**(శారణర్)** -దేవజాతిలో ఉల్లాసంగా సంచరించి తిరిగే ఒక తెగవారు. **"చరతి ఇతి చారణః"** (సంచరించి తిరిగే వారు కనుక చారణులు అనబడుతున్నారు) అని చారణశబ్ద వ్యుత్పత్తి.

**(ఇయక్కర్)** - యక్షులనబడే దేవజాతిలోని ఒక తెగ.

**(శిత్తర్)** -దేవతలలో సిద్ధులనేవారుకూడా ఒక తెగ.

**(శిత్తరుమ్ మయజ్గినర్ తిరువడి తొழுవాన్)** - విమానాలలో సంచరించే దేవజాతులతో పాటు, గొప్ప తపస్సును చేసి గౌరవాన్ని కల్గిన మహర్షులతో పాటు, యక్షులు, సిద్ధులు, చారణులనే దేవతలతో పాటు, కిన్నరులు, గరుడులు అనే మంగళాశాసనాన్ని పాడేవారితో పాటు, వీరిలో గొప్పవారైన గంధర్వులతో పాటు తేడా లేకుండా, చిన్నవారు, పెద్దవారు- అనే వ్యత్యాసం లేకుండా నీవు నిద్రనుండి లేచే సమయంలోని మొదటి కటాక్షాన్ని పొందాలని కోరి, ఒకరి కంటే ఇంకొకరు ముందుగా రావాలని "నేను ముందు, నేను ముందు'' అనే అహమహమికతో సమ్మర్దాన్ని పొందుతున్నారు. మంగళవాద్యాలు, పిల్లనగ్రోవులు మొదలైనవానిని తీసికొని కైంకర్యాన్ని చేసేవారు కూడా సుప్రభాతసేవకు సహాయపడాలని వచ్చారు.

**(ఆదలిల్ అవర్కు్క నాళోలక్కమ్ అరుళ అరజ్గత్తమ్మా! పళ్ళి ఎழுన్దరుళాయే)** - **"నన్మణి వణ్ణనూర్ ఆళియుమ్ కోళరియుమ్ పొన్మణియుమ్ ముత్తముమ్ పూమరముమ్, పన్మణి నీరోడు పొరుదురుళుమ్ కానముమ్ వానరముమ్ వేడుముడై వేజ్గడమ్"** (నాన్ముకన్ తిరు- 47) (శరభమృగాలను, పరాక్రమాన్ని కల సింహాలను, బంగారాన్ని, ముత్యాలను, నిండుగా పూచిన వృక్షాలను, పలు రత్నాలను, నీటి ప్రవాహాలతో నిండిన అరణ్యాలను, వానరాలను, బోయలను కల వేంకటాచలమే ఇంద్రనీలంవంటి వర్ణాన్ని కల స్వామి నివసించే చోటు) అని శ్రీవేంకటేశ్వరుడు నిమ్నజాతులకు చెందినవారికి పలువురకు దర్శనమిచ్చి అనుగ్రహించేటట్లు, నీవుకూడా మేల్కొని, ఉన్నతులు, అధములనే అందఱు ఉజ్జీవించేటట్లు కటాక్షించాలి- అని అంటున్నారు.

**10.** కడిమలర్ క్కమలజ్గళ్ మలర్న్దన విఴైయో
కతిరవన్ కనైకడల్ ముళైత్తననివనో

తుడియిడైయార్ శురికుழల్ పిழிన్దుతఱి
తుకిలుడుత్తేఱినర్ శూழ்పునలరఙ్గా !
తొడైయొత్త తుళవముమ్ కూడైయుమ్ పొలిన్దు
తోన్ఱియతోళ్ తొణ్డరడిప్పొడి యెన్నుమ్
అడియనై యళియనెన్ఱరుళి ఉన్నడియార్క్కు
ఆట్పడుత్తాయ్ పళ్ళి యెழுన్దరుళాయే

పునల్ శూழ் = కావేరీజలంతో పరివేష్టితమైన, అరఙ్గా = శ్రీరంగంలో శయనించి ఉండే శ్రీరంగనాథా !, కడి = పరమళాన్ని కల, కమలమ్ మలర్కళ్ = తామరపూలు, మలర్న్దన = (బాగా) పూచాయి, కదిరవన్ = (తామరలను వికసింపజేసే) సూర్యుడు, కనై కడల్ = ఘోషాన్ని చేయడమే స్వభావంగా కల సముద్రంలో, ముళైత్తనన్ = ఉదయగిరిపైకి వచ్చి ఉదయించాడు, తుడి ఇడైయార్= మెఱుపువంటి (సూక్ష్మమైన) నడుమును కల స్త్రీలు, శురి కుழల్ = తమ గుండ్రని కేశాలను కల కొప్పును, పిழிన్దు ఉదఱి = (నీటితేమ ఆరేటట్లు) పిండి, విదల్చి, తుకిల్ ఉడుత్తు= తమ తమ వస్త్రాలను ధరించి, ఏఱినర్ = నదీతీరం పైకి ఎక్కారు, తొడై ఒత్త = చక్కగా కూర్చబడిన, తుళవముమ్ = తులసీమాలికలను, కూడైయుమ్= పూలబుట్టను, పొలిన్దు తోన్ఱియ = ప్రకాశించేటట్లుగా ఉండే, తోళ్= బాహువులను (భుజాలను) కల, తొణ్డరడిప్పొడి ఎన్నుమ్ = "తొణ్డరడిప్పొడి" అనే పేరును కల, అడియనై = దాసుడనైన నన్ను, అళియన్ ఎన్ఱు అరుళి = కృపజేయడానికి తగిన యోగ్యతను కలవాడని కటాక్షించి, (అంగీకరించి), ఉన్ అడియార్క్కు = నీకు చెందినవారైన భాగవతులకు, ఆళ్పడుత్తాయ్ = దాసునిగా చేయాలి, (అందుకోసం) పళ్ళి ఎழுన్దరుళాయ్ = శయ్యనుండి మేల్కొనాలి.

## నఞ్జీయర్ వ్యాఖ్యానమ్

*అవతారికై :- నిగమత్తిల్ - ముతల్ పాట్టు త్తొడఙ్గి చ్చొన్న దేవర్కళోడు ఋషికళోడు వాశియఱ దేవరీర్ పక్కల్ ఒరు ప్రయోజనఙ్గొణ్డు మీళువర్కళన్ఱిక్కే, దేవరీర్ తిరుప్పళ్ళి యుణర్న్దరుళుమ్పోతై ముఖవికాసమే ప్రయోజనమాయిరుక్కిఱ అడియేనుక్కాక త్తిరుప్పళ్ళియుణర్న్దరుళ వేణుమెన్ఱు ప్రార్థిత్తు ముడిక్కిఱార్.*

*వ్యాఖ్యానమ్ : (కడిమలరిత్యాది) ఊరిలే తామరైయాయుళ్ళవై ఎల్లామ్ అలర్న్దు తోన్ఱి మదు వెళ్ళమిడానిన్ఱన. (కతిరవనిత్యాది) అన్ద త్తామరైయై*



*అలర్త్తక్కడవ ఆదిత్యనుమ్ కీழ் దిక్కిలే, ఘోషిక్కైయే స్వభావమాకవుడైయ సముద్రత్తిల్ ఉయగిరియిలే వన్దు తోన్ఱినాన్.*

*(తుడియిడైయారిత్యాది) కణ్డారై ప్పిచ్చేఱ్ఱవల్ల ఇడైయైయుమ్ మయిర్ ముడియైయుముడైయ ఒరుతరత్తిల్ పెణ్గళెల్లామ్ నీరాడి త్తన్దామ్ పరియట్టఙ్గళ్ తాన్దామే శాత్తి చ్చమైన్దార్కళ్. ఇత్తాల్- పెరియపెరుమాళ్ శివట్కొన్న ఉణరుకైక్కాక ప్పழைయ యమునై నీరాట్టై స్మరిప్పిక్కిఱార్. పెరియపెరుమాళాకిఱార్- కృష్ణన్. నమ్పెరుమాళాకిఱార్- చక్రవర్తిత్తిరుమకన్ ఎన్ఱరుళిచ్చెయ్వర్. (శూழ்పునలరఙ్గా) విరజైయైయుమ్, యమునైయైయుమ్, సరయువైయుమ్ మఱప్పిక్కుమ్పడియాన తిరుప్పొన్నియాలే శూழப్పట్ట కోయిలై నిరూపకమాక వుడైయ దేవరీర్. పెరుమాళుడైయ నిరూపకధర్మమిరుక్కిఱపడి.*

*(తొడైయొత్త ఇత్యాది) తొడుక్కిఱపోతే అఙ్గుత్తైక్కు సదృశమామ్పడి తొడుత్త తిరుమాలైకళుమ్ తిరుప్పడలిక్కైయుమాయ్ (తోన్ఱియ ఇత్యాది) రక్షకరాన పెరుమాళుక్కు క్కోయిల్ నిరూపకమానాప్పోలే, ఆழ்వారుక్కు నిరూపకధర్మ మిరుక్కిఱపడి. "ఖనిత్రపిటకాధరః" ఎన్ఱుమ్, "లక్ష్మణో లక్ష్మిసమ్పన్నః" ఎన్ఱుమ్ శొల్లుకిఱ ఇళైయపెరుమాళైప్పోలే శేషభూతనుక్కు శేషత్వపరికరమే ఐశ్వర్యమాకక్కడవతిఱే. "తొణ్డరడిప్పొడి" ఎన్ఱు ఇవరుడైయ ప్రసిద్ధి. జ్ఞానానన్ద లక్షణమాకైయన్ఱిక్కే, తదీయశేషత్వపర్యన్తమాయిరుక్కై. (అడియనై యళియ నెన్ఱరుళి) స్నిగ్ధనెన్ఱు కృపై పణ్ణియరుళి, అచ్ఛేషత్వత్తినెల్లైయిలే నిఱుత్తిన దేవరీర్ అడియేనుక్కాక త్తిరుప్పళ్ళి యుణర్న్దరుళి అడిమై కొణ్డరుళవేణు మెన్గిఱార్.*

## పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానమ్

అవతారికై : నిగమత్తిల్. (కడిమలరిత్యాది) ఉపక్రమోపసంహారఙ్గళ్ శేర్న్దిరుక్కిఱతు. ఎఙ్గనే ? ఎన్నిల్; "అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్" ఎన్ఱు తొడఙ్గి, "మాఱన్ విణ్ణప్పమ్ శెయ్త" ఎన్ఱుమ్, "నమక్కే పఱై తరువాన్" ఎన్ఱు తొడఙ్గి, "అఙ్గప్పఱై కొణ్డ" ఎన్ఱుమ్, "నాథాయ నాథమునయే" ఎన్ఱు తొడఙ్గి, పిన్ఱు ముడిక్కిఱ విడత్తిలుమ్, "పితామహం నాథమునిం విలోక్య" ఎన్ఱుమ్ ఉపక్రమోపసంహారఙ్గళ్ శేర కిడక్కుమాపోలే, ఇవరుమ్, ఉపక్రమోపసంహారఙ్గళ్ శేర త్తలైకట్టానిఱ్కచ్చెయ్దే,

ఇవరుక్కోరేఱ్ఱముణ్డు. ఇప్ప్రబన్ధమ్ తన్నిల్, పాట్టుక్కు ప్పాట్టు పోతువైకినపడి శొల్లుకైయాయిఱ్ఱు - కరుత్తు.

ముతల్పాట్టిలే శెయ్‌తతు- ఆదిత్యనానవన్ ఉదయపర్వతత్తై వన్దణుకినాన్. దేశాన్తరమ్‌పోన పిళ్ళైకళ్ వారానిన్ఱార్‌కళ్ - ఎన్ఱు కేట్టాల్, అవర్‌కళుడన్ స్పర్శముడైయ మనుష్యరుక్కు ముఖత్తిలే వికాసముణ్డామాప్పోలే, ఆదిత్యనోడే తామరైక్కు ఒరు శేర్‌త్తియుణ్డిఱే. అత్తాలే మున్బు నిన్ఱ మాత్రైయిల్ శిఱితు వికసిక్క క్కోలి అతు కట్టు నెకిఴ్కిఱవళవిలే ఛిద్రత్తిన్ వఴియే తేన్ ప్రవహిత్తత్తెన్ఱిఱే శొల్లిఱ్ఱు అతిల్; అవ్వళవుమన్ఱియే, అత్తామరైయోడు శేర్‌త్తియైయుడైయ ఆదిత్యను ముదిత్తు మేలే పోనాన్. తామరైకళుమ్ అఴియ అలర్‌న్దనవెన్ఱు పోతు వైకినపడి శొల్లుకిఱతు- ఇతిల్.

వ్యాఖ్యానమ్ : (కడిమలర్ క్కమలఙ్గళ్ మలర్‌న్దన వివైయో) కడియెన్ఱు- నఱునాఱ్ఱమ్. గన్ధముణ్డాక చ్చొల్లవేణుమో? "వాశమ్ శెయ్ పూఙ్గుఴలాళు డైయ" వాసస్థానమన్ఱో.

(మలర్‌న్దన వినైయో) మున్బు శొన్నమాత్రమేయల్ల, దేవరీర్ కణ్డరుళవల్ల వళమ్‌పూ.

(కతిరవన్ కనైకడల్ ముళైత్తననివనో) మున్బుమ్ ఇవన్ ప్రస్తుతనావ విడత్తిల్, "ఇవనో" ఎన్ఱ విడమిల్లై. ఇవనై వినవి యరుళవేణుమ్. అవనుక్కు ధారకమ్ దేవరీర్ కుశలప్రశ్నమ్ పణ్ణుకైయన్ఱో.

ఇవర్‌కళ్ తన్దాముడైయ సత్తాధారకమ్ ఇఴక్కుమళవల్ల. ఇవర్‌కళై వినవియరుళాతే దేవరీరుడైయ సత్తాధారకమ్ ఇఴక్కప్పుకానిన్ఱీర్ -ఎన్గిఱార్ మేల్.

(తుడియిడైయారిత్యాది) "తోఴియుమ్ నానుమ్ తొఴుతోమ్", "కోలమ్ కరియపిరానే ! కురున్దిడైక్కూఱై పణియాయ్" ఎన్గిఱ ఇన్ద రస మిఴక్కప్పుకానిన్ఱీర్. ఇత్తాల్- పఴైయ మడువిన్ కరైయైయుమ్, కురున్దిలేఱిన పడియైయుమ్ నినైక్కిఱతు. "కోవలనాయ్ వెణ్ణె యుణ్డవాయ"నిఱే పళ్ళికొళ్ళుకిఱవన్.

(శూఴ్ పునలరఙ్గా), నీర్‌చ్చిఱై యిట్టుక్కొణ్డు కణ్‌వళర్‌న్దరుళలామో?



(తొడైయొత్త తుళవముమ్) తిరుమాలై ఎడుత్తాల్ తిరుక్కుఴలుక్కుమ్ తిరుమార్ పుక్కుమళవాయిరుక్కై. తిరుమాలైయాయుమ్, తిరుప్పరియట్ట మాయుమ్ నిఱ్కిఱార్. చేతనవర్గమిఱే.

(కూడైయుమ్ పొలిన్దు తోన్ఱియ తోళ్) "అఴియుమ్ శఙ్గుముడైయ నఙ్గళడికళ్" ఎన్ఱు అవనుక్కు శేషిత్వసూచకమిఱే. "మహాత్మన శ్శఙ్ఖచక్రాసిపాణేః" ఎన్నుమాపోలేయిఱే; శేషభూతనానవనుక్కుమ్ తిరుప్పడలిక్కై సూచకమా యిరుక్కిఱపడి. "ఖనిత్రపిటకాధరః"ఇత్యాది.

(తొణ్డరడిప్పొడి) (తుళ వత్తొణ్డాయ) తిరుత్తఴాయ్‌క్కు ఎఴుతిక్కొడుత్తిరుక్కుమ్ శ్రీవైష్ణవర్‌కళుక్కు అడియేన్ ఎన్ఱిరుక్కుమవర్. ఇవరుడైయ అడయారడియార్ ఇరుక్కిఱపడి. ఇప్పడిప్పట్ట శ్రీవైష్ణవర్‌కళ్ శ్రీపాదరేణు -ఎన్గిఱార్.

(అడియనై) ఇవ్వాత్మావినుడైయ ఆర్‌ప్పొ త్తుడైత్తాల్ నిలైనిన్ఱ పేర్ ఇతువేయిఱే.

(అళియనెన్ఱరుళి) స్నేహియెన్ఱు తిరువుళ్ళమ్ పఱ్ఱి. అఙ్గనన్ఱియే దేవరీర్ అళిమిక్కారిఱే; ఇఙ్గన్నువై కృపైపణ్ణ వడుక్కుమెన్ఱు తిరువుళ్ళమ్బుఱ్ఱి. ఎల్లామఱ్ఱానెన్ఱు తిరువుళ్ళమ్బుఱ్ఱి.

(ఉన్నడియార్‌క్కాట్పడుత్తాయ్) ఉన్నళవిలే నిఱ్కిల్ ముతల్ నిలై. "ఉనక్కాట్పట్టు నిన్‌కణ్ పెఱువతు ఎతుకొల్ ఎన్ఱు పేతైయేన్ నెఞ్జమ్ మఱుకల్ శెయ్యుమ్" ఎన్నాతపడి, అడియార్‌క్కాట్పడుత్తాయ్. ముతల్ నిలైయు మన్ఱియే, ఇవ్వరుకిల్ సంసారముమన్ఱియే, "తొణ్డర్ తొణ్డర్ తొణ్డన్ శడకోపన్" ఎన్నుమాపోలే ఎల్లైనిలత్తిలే నిఱుత్తినాయ్, "రత్నమ్ పట్టతు, ముత్తు ప్పట్టతు" ఎన్నుమాపోలే.

(పళ్ళి యెఴున్దరుళాయే) అభిమతసిద్ధి యుణ్డానాలుమ్ ఉఱఙ్గు మిత్తనైయో? దేవరీరుడైయ యోగనిద్రై ఫలపర్యన్తమానాలుమ్ ఉఱఙ్గు మిత్తనైయో?

పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళేశరణమ్

తిరుప్పళ్ళియెఴుచ్చి వ్యాఖ్యానఙ్గళ్ ముఱ్ఱిఱ్ఱు.

*అరు : పత్తామ్పాట్టు. (కడిమలర్) మేలిల్ పదత్తుక్కు అవతారికై అరుళిచ్చెయ్ కిఱార్ (ఇవర్‌కళిత్యాది) తిరుమాలైకళ్ అఙ్గత్తైక్కు అనురూపమాక క్కూడుమో? ఎన్న*

*అరుళిచ్చెయ్‌కిఱార్ (తిరుమాలైయాయు మిత్యాది). (పడలికై) తిరుప్పళ్ళిత్తామ క్కూడై. శేషత్వసూచకమాక ధరిత్త పేరుణ్డో? ఎన్న అరుళుకిఱార్ (ఖనిత్రేత్యాది) అళియన్ - స్నేహి ఎన్నుతల్, దయనీయన్ ఎన్నుతల్.*

జీయర్ తిరువడికళే శరణమ్

అరుమ్బుదమ్ ము*ర్‌ఱి ర్‌*ఱు

## భావదీపిక వివరణం

**పదవ పాశురం - అవతారిక :** చివరి పాశురమైన ఇందులో "మొదటి పాశురంనుండి చెప్పబడ్డ దేవతలు, ఋషులు మొదలైనవారు నీవద్ద ఏదో ఒక ప్రయోజనాన్ని పొంది తిరిగి పోయేవారు. ఆ రీతిలో కాకుండా నీవు శయ్యనుండి మేల్కొనేటపుడు ఉండే ముఖవికాసాన్నే పరమప్రయోజనంగా భావించే దాసుని కోసం శయ్యనుండి నిద్ర లేవాలి'' అని ప్రార్థించి, ఈ దివ్యప్రబంధాన్ని పూర్తి చేస్తున్నారు. గొప్ప ప్రబంధాలలో మొదట, చివర సంబంధాన్ని కల్గినవై ఉంటాయి. నమ్మాழ்వార్లు తిరువిరుత్తప్రబంధాన్ని ప్రారంభించేటపుడు **"అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్"** (తిరువిరుత్తమ్-1) (దాసుడు చేసే విన్నపం) అని ఆరంభించి, ముగించేటపుడు **"మాఱన్ విణ్ణప్పమ్ శెయ్య"** (తిరువిరుత్తమ్-100) (నమ్మాழ்వార్లు విన్నపించిన)అని ముగించారు. గోదాదేవి తిరుప్పావైను ఆరంభించేటపుడు **"నమక్కే పఱై తరువాన్"** (తిరుప్పావై-1) (మనకే పురుషార్థాన్ని ఇస్తాడు) అని ఆరంభించి, పూర్తి చేసేటపుడు **"అఙ్గ ప్పఱైకొణ్డ వార్*ర్‌ఱై*"** (తిరుప్పావై-30) (అక్కడ ఆ ప్రాప్యాన్ని పొందిన సంగతి) అని ముగించారు. ఆళవందార్ స్తోత్రరత్నాన్ని ప్రారంభించేటపుడు **"నమోఽచింత్యాద్భుతాక్లిష్టజ్ఞానవైరాగ్యరాశయే, నాథాయ మునయేఽగాధభగవద్భక్తి సింధవే"** (స్తోత్రరత్నమ్-1) (ఇటువంటిది- అని భావించ లేనిది, ఆశ్చర్యకరమైనది, భగవత్కృపచేత సులభంగా లభించినది అయిన జ్ఞానంయొక్క, వైరాగ్యంయొక్క లోతైన భగవద్భక్తికి సముద్రంవంటివారైన నాథమునులకు నమస్కారం) అని తమ పితామహులైన నాథమునులను అనుసంధించి ఆరంభించి, ముగించేటపుడు- **"అకృత్రిమత్వచ్చరణారవింద ప్రేమప్రకర్షావధి మాత్మవంతమ్, పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మంచితయిత్వా"** (స్తోత్రరత్నమ్- 65) (నా నడతను గమనించకుండా, నీ శ్రీచరణపద్మాలలో సహజమై ఉండే, గొప్ప ప్రేమకు పరమావధిగా ఉండేవారు,



ఆత్మస్వరూపాన్ని తెలిసినవారు, నాకు పితామహులు అయిన నాథమునులను కటాక్షించి నాకు కృపజేయాలి) అని నాథమునులను చూచి అనుగ్రహించాలని అర్థిస్తూ ముగించారు. ఈ రీతిలో మొదలు, చివరలలో ఈ ప్రబంధాలు సంబంధాన్ని కల్గి ఉండేటట్లు, వీరుకూడా మొదటి పాశురంలో సూర్యుడు ఉదయించడాన్ని, తామరలను వికసించడాన్నిగూర్చి పల్కినట్లే, చివరి పాశురంలో కూడా ఆ విషయాన్నే ప్రస్తావిస్తున్నాయి. అయితే, ఈ ప్రబంధానికొక వైలక్షణ్యమున్నది. మొదటి పాశురంనుండి ఉత్తరోత్తరం ఉండే ఒక్కొక్క పాశురం ముందు పాశురంకంటే ఎక్కువ పొద్దు పొడిచిన విషయాన్ని తెలిపే రీతిలో అనుగ్రహింపబడింది. ఆ క్రమంలో, మొదటి పాశురంలోను, చివరి పాశురంలోను సూర్యుని, తామరలనుగూర్చి పల్కినా, రెండిటికి ఒక వ్యత్యాసం ఉన్నది. 'సూర్యుడు ఉదయగిరిని సమీపించాడు''. "విదేశాలకు పోయిన పిల్లలు తిరిగివస్తున్నారు'' అని వింటే వారితో సంబంధాన్ని కలవారి ముఖాలు వికసించినట్లే, సూర్యుడు ఉదయించడాన్ని చూడగానే అతనితో సంబంధాన్ని కల తామరపూవు కొంచెం వికసించడం ఆరంభించినపుడు ఆ సందులోనుండి తేనె స్రవించింది'' అని మొదటి పాశురంలో తెలుపబడింది. ఈ చివరి పాశురంలో "తామరతో సంబంధాన్ని కల సూర్యుడు ఉదయించి పైకి వచ్చాడు. తామరలుకూడా బాగా పూర్తిగా వికసించాయి' అని పొద్దు బాగా పూర్తిగా విడిచిన విషయం తెలుపబడింది.

**వ్యాఖ్యానమ్ : (కడిమలర్ క్కమలఙ్గళ్ మలర్‌న్దన ఇవైయో) -** సువాసనను కల తామరపూలు ఇవిగో వికసించాయి. "కడి" అనే పదం పరిమళమనే అర్థాన్ని ఇస్తుంది. **"వాశమ్ శెమ్ పూమ్కు*ழ*లాళ్ తిరు"** (తిరువాయ్-10-10-2) (సువాసనను కల పూవులతో అలంకరింపబడిన కేశాలను కల లక్ష్మి) అనే రీతిలో సువాసన రూపొందినట్లుండే లక్ష్మీదేవికి నివాసస్థానమైనందువల్ల తామరలు సువాసన ఉన్నది- అని ప్రత్యేకంగా చెప్పాలా ?

**(మలర్‌న్దన ఇవైయో)-** మొదటి పాశురంలో- "మదు విరిన్దొ*ழு*కిన" అని వికసించడం ఆరంభించిన స్థితి తెలుపబడింది. ఇక్కడ పూర్తిగా వికసించిన విషయం చెప్పబడుతున్నది. నీవు నిద్రలేవగానే కటాక్షించవలసిన, సమృద్ధిని కల పూవులు అంతట నిండి ఉన్నాయి.

**(కదిరవన్ కనైకడల్ ముళైత్తనన్ ఇవనో) -** ఇక్కడ తామరలు వికసింపజేసే, సూర్యుడు తూర్పు దిక్కులో ఘోషించడమే స్వభావంగా కల్గిన సముద్రంలోని

ఉదయగిరిపైకి వచ్చి, ఉదయించాడు. మొదటి పాశురంలో **"కదిరవన్ కుణతిశై చ్చికరమ్ వన్దెడున్దాన్"** (సూర్యుడు తూర్పు దిక్కులోని ఉదయగిరి శిఖరం పైకి వచ్చి ఉదయించాడు) అని చెప్పినపుడు **"ఇవనో"** అని చెప్పలేదు. ఇక్కడ **"ఇవనో"** అని అంటూ ప్రత్యక్షనిర్దేశాన్ని చేసినందువల్ల ఇతని క్షేమాన్నిగూర్చి విచారించాలి. నీవు ఆ విధంగా కుశల ప్రశ్నలు అడిగినందువల్లకదా అతడు ప్రాణధారణను చేస్తాడు- అని అంటున్నారు.

సూర్యుడు తన ప్రాణధారణను చేసేటట్లు అనుగ్రహించాలని మొదటి పాదంలో పలికారు. ఇక, రెండవ పాదంలో, శ్రీరంగనాథుడే చటుక్కున లేవడం కోసం, **"కోழி యழைప్పదన్ మున్నమ్ కుడైన్దు"** (కోడి కూయడానికి ముందే స్నానం చేసి) యమునానదిలో స్నానం చేసిన గోపికల వస్త్రాలను అపహరించి బండిగురువిందచెట్టుపై ఎక్కి కూర్చున్న వృత్తాంతాన్ని స్మరింపజేయడంద్వారా "నీ ధారకత్వాన్ని నీవు కోల్పోకుండా ఉండాలి" అని అంటున్నారు.

**(తుడియిడైయార్ శురికుழల్ పిழிన్దుదఱి త్తుకిల్ ఉడుత్తేఱినర్)** - చూచినవారంతా అభినివేశాన్ని పొందే రీతిలోని మెఱుపువంటి సన్నని నడుమును, గుండ్రని కేశబంధాన్ని కల అందమైన స్త్రీలు కావేరీనదిలో నీరాడి, తమ వస్త్రాలను ధరించి, తీరానికి చేరుతున్నారు. **"తోழிయుమ్ నానుమ్ తొழுతోమ్"** (నాచ్చి.తిరు.3-1) (సఖి, నేను నమస్కరించాము) **"కోలమ్ కరియపిరానే ! కురున్దిడైక్కూఱై పణియాయ్"** (నాచ్చి.తిరు-3-5) (నల్లని అందమైన స్వామీ ! గురువిందచెట్టునుండి దొంగిలించిన మా వస్త్రాలను అనుగ్రహించు) అనే శ్రీకృష్ణావతారరసాన్ని కోల్పోకుండా నీవు మేల్కొనాలి సుమా! అని భావం. **"కోవలనాయ్ వెణ్ణెయ్ ఉణ్డ వాయన్"** (అమలనాదిపిరాన్-10) (గోపాలుడై వెన్నను ఆరగించిన నోటిని కలవాడు) అని అంటూ తిరుప్పాణ్ ఆழ்వార్లు శ్రీరంగనాథుని శ్రీకృష్ణునిగానే పలికారు కదా! **"పెరియపెరుమాళాకిఱార్ కృష్ణన్, నమ్బెరు మాళాకిఱార్ చక్రవర్త్తిత్తిరుమకన్"** ఎన్ఱు **"భట్టర్ అరుళిచ్చెయ్‌కిఱార్"** (పెరియ పెరుమాళ్ శ్రీకృష్ణుడు, నమ్బెరుమాళ్ శ్రీరాముడు- అని భట్టర్ పలికేవారు) అని నంజీయర్ వ్యాఖ్య.

**(శూழ்పునల్ అరఙ్గా !)**- పరమపదంలోని విరజానదిని, బృందావనంలోని యమునానదిని, అయోధ్యలోని సరయూనదిని మఱపింపజేసే రీతిలోని కావేరీ



నదిచే పరివేష్ఠింపబడిన శ్రీరంగాన్ని పురస్కరించుకొని నిరూపించదగిన నీవు (ఆ) నీటితోనే బంధింపజేసికొని నిద్రించవచ్చునా ?

**"శూழ்పునలరఙ్గా !"** అని అంటూ ఆழ்వార్లు శ్రీరంగనాథునకు నిరూపకంగా పలికారు. ఇక, తమకు చెందిన నిరూపకాన్నిగూర్చి పల్కుతున్నారు.

**(తొడైయొత్త తుళవముమ్)** - కూర్చేటపుడే భగవానునకు తగినదిగా ఉండేటట్లుగా కూర్చిన తులసీమాలను -అని అర్థం. మాలికలను కూర్చినపుడు అవి కేశపాశానికి, వక్షఃస్థలానికి తగిన ప్రమాణంలో ఉండేటట్లుగా కూర్చడం ఇక్కడ సూచింపబడింది. **"ఒత్త తుళవమాలై"** (తగిన తులసి మాల) అని అన్నందువల్ల పూమాల, పీతాంబరం మొదలైనవి అన్నీ, నిత్యసూరుల రూపంలోని చేతనులుగానే ఉంటారు- అని తెలుపబడింది. "స్రగ్వస్త్రాభరణైర్యుక్తం స్వానురూపై రనూపమైః, చిన్మయైః స్వప్రకాశైశ్చాన్యోన్యరుచిరంజితైః" (పౌష్కరసంహిత) - (తనకు తగినవి, సాటి లేనివి, జ్ఞానమయాలుగా ఉండేవి, స్వయంప్రకాశకమైన ఉండేవి, ఒకదానికి ఇంకొకటి కలయిక వల్ల ఏర్పడే కాంతితో అందాన్ని కల్గించబడినవి అయిన మాలికలతో, వస్త్రాలతో, ఆభరణాలతో కూడి ఉండేవాడైన భగవానుడు) అని చెప్పబడిందికదా!

**(కూడైయుమ్ పొలిన్దు తోన్ఱియ తోళ్)** **"ఆழிయుమ్ శార్ఙ్గముడైయ నఙ్గళడికళ్"** (పెరియతిరు.11-2-6) (శంఖచక్రాలను కల మా స్వామి) **"వర్షాయుతైర్యస్య గుణా న శక్యా వక్తుం సమేతైరపి సర్వలోకైః, మహాత్మనః శంఖచక్రాసిపాణేః విష్ణోర్జిష్ణోః వాసుదేవాత్మజస్య"** (భార-కర్ణ-83-65) (మహాపురుషుడు, శంఖం, చక్రం, ఖడ్గం అనే ఆయుధాలను చేతిలో ధరించినవాడు, సర్వవ్యాపి, జయశీలుడు, వాసుదేవపుత్రుడైన ఎవని గుణాలు పదివేల సంవత్సరాలపాటు జనులందఱు కలసినా పల్కడానికి సాధ్యం కావో) అనే రీతిలో నాథుడైన భగవానునకు శంఖచక్రాలు అతని నాథత్వాన్ని (ప్రభుత్వాన్ని) తెలిపే చిహ్నాలై ఉండేటట్లే, దాసుడైన చేతనునకు పూలబుట్ట శేషత్వాన్ని సూచించే చిహ్నామై ఉంటుంది. **"ధనురాదాయ సశరం ఖనిత్రపిటకాధరః, అగ్రత స్తే గమిష్యామి పంథాన మనుదర్శయన్"** (రామా-అయో-31-25) (తవ్వుగోలను, బుట్టను ధరించినవాడనై, బాణాలతో కూడిన వింటిని ధరించి, దారిని చూపిస్తూ నీముందు నడువగలను) అని లక్ష్మణునకు కూడా చిహ్నాలుగా చెప్పబడ్డాయికదా !

**(తొణ్డరడిప్పొడి)- "తుళవత్తొణ్డాయ తొల్‌శీర్ తొణ్డరడిప్పొడి"** (తిరుమాలై-**45)** (తులసికి దాస్యం చేసే, స్వాభావికాలైన కల్యాణగుణాలను కల తొణ్డరడిప్పొడి) అనే రీతిలో తులసీమాలికా సమర్పణకైంకర్యాన్ని చేసే శ్రీవైష్ణవులకు దాస భూతులుగా తమను భావిస్తారు, వీరు. నమ్మాழ்వార్లుకూడా **"అడియారడియార్ తమ్మడియారడియార్ తమక్కడియారడియార్ తమ్మడియారడియొఙ్గళే"** (తిరువాయ్-**3-7-10**) అని తమను నిరూపించుకొన్నట్లే, వీరుకూడా తమను **"తొణ్డరడిప్పొడి"** అని నిరూపించుకొంటున్నారు. తులసీమాలికాకైంకర్యాన్ని చేసే శ్రీవైష్ణవుల శ్రీచరణాలలో అంటుకొన్న రేణువుగా తమను అభిమానిస్తున్నారు (భావిస్తున్నారు) ''రక్షకుడైన శ్రీరంగనాథునకు శ్రీరంగాలయం (కోవెల) నిరూపకమైనట్లే, ఆழ்వార్లకు ఇది - పూలబుట్ట నిరూపకమ్'' అని, లక్ష్మణునకు (ఇళైయ పెరుమాళ్‌కు) శ్రీరామాయణంలోని **"ఖనిత్రపిటకాధరః"** పూర్వం ఉట్టంకించిన శ్లోకంలో (అయో-**31-25**) తవ్వుగోలను, బుట్టను నిరూపకాలుగా పల్కినట్లు, **"సర్వప్రియకరస్త్య రామస్యాపి శరీరతః, లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః"** (రామా-భార- **18-28**) (కైంకర్య లక్ష్మిని కల లక్ష్మణుడు, రామునకు తన శరీరం కంటే అన్ని ప్రియాలను చేసేవాడుగాను, బయట ఉండే ఇంకొకప్రాణంవలె ఉన్నాడు) అని కైంకర్యలక్ష్మిని నిరూపకంగా పల్కినట్లే, తమకు నిరూపకం **"తొణ్డరడిప్పొడి"** అనేదే- అని అంటున్నారు- అని నంజీయర్ వ్యాఖ్యానించారు.

**(తొణ్డరడిప్పొడి ఎన్నుమ్ అడియనై)** - ఆత్మస్వరూపాన్నిగూర్చి లోతుగా గ్రహించినవారు దానికి జ్ఞానానందాలనే లక్షణంగా పల్కుతారు. ఈ ఆత్మయొక్క అహంకారమనే ఆవరణం తొలగిపోతే, అపుడు స్థిరమైన నామం **"అడియేన్"** అనేది. అదికూడా భగవద్భక్తులకు దాసుడై ఉండడంవరకు కొనసాగాలి- అని తెల్పుతున్నది.

**(అళియనెన్ఱరుళి)** - భక్తిని (ప్రేమను) కలవాడని భావించి, కృపజేసి- అని అర్థం. లేక, **"అళి మిక్కాన్"** (తిరువాయ్-**4-8-5**) (మిక్కిలి భక్తిని కలవాడు) అనే రీతిలో కరుణ నిండినవాడవైన నీవు ఈ జంతుప్రాయుడనైన నన్ను "ప్రేమను చూపదగినవాడు'' అని భావించి, ఏవిధమైన ఉపాయానుష్ఠానాన్ని లేనివాడు కనుక, మనమే ఇతనిపట్ల కృపజూపాలి - అని భావించి - అని అర్థం. **"అళియన్ నమ్ పైయల్ ఎన్నార్"** (తిరుమాలై-**37**) (కృపకు తగిన మన కుఱ్ఱవాడు అని అన్నారు) అని తిరుమాలై ప్రబంధంలో ఈ ఆழ்వార్లు అనుగ్రహించారుకదా !



**(ఉన్ అడియార్‌క్కు ఆట్పడుత్తాయ్)** - నీకు శేషభూతుడనై ఉంటే, అది ప్రథమపర్వం. (అక్కడే నిలచిపోతే) అందువల్ల ఫలసిద్ధిని గూర్చి సంశయించవలసి ఉంటుంది. **"ఉనకాట్పట్టు నిన్‌కణ్ పెఱువదు ఎదుకొలెన్ఱు పేదైయేన్ నెఞ్జమ్ మఱుకల్ శెయ్యుమ్"** (తిరువాయ్-**9-4-4**) (నీకు శేషభూతుడనై, నీవద్ద పొందేది ఏది? అని మూఢుడనైన నా మనస్సు సంశయిస్తుంది) అనే నమ్మాழ்వార్లవలె సంశయించకుండా నీ దాసుడనైన నన్ను నీ భక్తులకు దాసునిగా చేసి, ఫలసిద్ధిని గూర్చి సంశయించనక్కరలేని రీతిలో చరమపర్వమనే చివరి దశలో స్థిరంగా ఉండేటట్లు నిలిపావుకదా !- అని అంటున్నారు. ఇక్కడ సంసారియై ఉండే స్థితిని పోగొట్టి, నీకు, కైంకర్యం చేసే ప్రథమపర్వానికి మించి, **"తొణ్డర్‌తొణ్డర్ తొణ్డన్ శెయ్యుమ్ శడకోపన్"** (తిరువాయ్-**8-9-11**) (భగవానుని దాసదాసులకు కైంకర్యం చేసే శఠకోపులు) అనే రీతిలో చరమపర్వంలో స్థిరంగా నిలిపావు కదా! అని అంటున్నారు. **"రత్నమ్ పట్టదు, ముత్తు ప్పట్టదు"** (రత్నం లభించింది, ముత్యం దొరికింది) అనేటట్లుగానే, **"ఆట్పడుత్తాయ్"** అని అంటూ పొందడానికి అరుదైన ప్రయోజనం- అని తెలుపుతున్నారు.

**(పళ్ళి ఎழுన్దరుళాయే)** - నీవు యోగనిద్రను పొందడం నావంటి ఒక చేతనుని పొందడం కోసమే కదా ! ఆ ప్రయోజనం లభించి, మనోరథం నెఱవేరిన తరువాత కూడా నిద్రించవచ్చునా ! ఇక నిద్రలే- అని అంటున్నారు.

కృష్ణాజీనామదాసస్య షష్ఠ్యబ్ద్యుత్సవచిహ్నికా ।
భగవద్భాగవతార్యసేవాయై తేన భక్తితః ॥

సుప్రభాతనుతిర్దివ్యా భక్తపాదరజోమునేః ।
పూర్వాచార్యకృతవ్యాఖ్యాసనాథేయం ప్రకాశ్యతే ॥

ప్రణీతా శింగరార్యేణ వివృతిః భావదీపికా ।
సేయం భవేత్ ప్రమోదాయ సారాసారవిదాం సతామ్ ॥